ISBN 81-237-2339-3

ప్రథమ ముద్రణ 1997 *(శక 1920)*



The Best Thirteen *(Telugu)*

రూ. 37.00

డైరెక్టర్, నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా, ఎ-5, గ్రీన్‌పార్క్,
న్యూఢిల్లీ-110016 ద్వారా ప్రచురింపబడినది.



# పదమూడు ఉత్తమ కథలు

(భారతదేశంలోని 13 భాషలనుంచి సంకలనం
చేసిన ఉత్తమ కథల సంపుటి)

అనువాదం
కడియాల రామమోహనరాయ్

చిత్రాలు
మిక్కీ పటేల్



నేషనల్ బుక్‌ట్రస్ట్, ఇండియా



# విషయసూచిక


| మూలభాష | పేరు | పేజీ |
| --- | --- | --- |
| అస్సామీ | ప్రత్యేక బహుమతి | 5 |
| బెంగాలీ | ఆకలిగొన్న సప్తపాశం | 13 |
| ఇంగ్లీషు | సీత - నది | 33 |
| గుజరాతీ | 'అదల్ - బాదల్' : మారకం | 49 |
| హిందీ | కేట్‌బాల్ (పంగటిపుల్ల) అబ్బాయి | 56 |
| కన్నడ | రాహుల | 64 |
| మళయాళం | సుందర్ - 'చుక్కతోక' | 74 |
| మరాఠీ | నువ్వు పాస్టర్ ఫినేవే గదా! | 82 |
| ఒరియా | స్వర్గానికి ఏడు మెట్లు | 92 |
| పంజాబీ | బమ్ బహదూర్ | 102 |
| తమిళం | స్టాంప్ ఆల్బమ్ | 113 |
| తెలుగు | పొదుపు | 122 |
| ఉర్దూ | గర్వభంగం | 130 |

# ప్రత్యేక బహుమతి

## అనంత దేవ శర్మ

ఎంత చిలిపి పిల్లాడు! వాడికి గట్టిగా తగలాల్సిందే. వాడికి ఎప్పుడూ మిగిలిన పిల్లలతో పోట్లాటలేనని నాకు ఫిర్యాదు లొచ్చాయి. వాణ్ణి పిలిపించాలి. "మోహన్ ! ఓ మోహన్" ప్రధానోపాధ్యాయుడు జవాను కోసం కేక పెట్టాడు. ప్రధానోపాధ్యాయుని గొంతులో తీవ్రతను బట్టి ఆయన కోపంగా వున్నాడని మోహన్ గ్రహించాడు. వాడు త్వరగా లోపలికొచ్చి భయంగా "యస్, సర్" అన్నాడు.

"త్వరగా వెళ్ళి ఐదవ తరగతిలో తపన్‌ను పిలుచుకురా" ప్రధానోపాధ్యాయుడు ఆజ్ఞాపించాడు.

తపన్ అనే అబ్బాయిని ముందుగా పాఠకులకు పరిచయం చెయ్యనివ్వండి. పడుమని గ్రామంలో రతన్ అనే గుమాస్తా రెండవ కొడుకు తపన్. సన్నటి వాడైనా అతను బలంగా చామన చాయతో మెరిసే కళ్ళతో చలాకీగా వుంటాడు. చదువులో తెలివైన వాడు. కాని ఇంటా బయటా కూడ అతని చిలిపి చేష్టలకు అంతులేదు. అతనెప్పుడూ చిక్కులు కొని తెచ్చుకుంటాడు. కాని ఒక్క సంగతి మాత్రం చెప్పకోవాలి. అతను మాత్రం స్వయంగా ఎప్పుడూ తగాదా పెట్టుకోడు. కాని ఎవరైనా అతన్ని నొప్పిస్తే మాత్రం అంతకు బదులు తీర్చుకోవటానికి వెనుకాడడు. తన వయసు పిల్లలకి అతను నాయకుడు. వాళ్ళ పక్షాన నిలబడి పోట్లాడటానికి అవసరమైతే కొట్లాటకు అతనెప్పుడూ సిద్ధమే. మిత్ర బృందానికి అతనంటే ఇష్టమూ, గౌరవమూ.

పల్లెలో ప్రాథమిక పాఠశాలలో చదువు ముగించుకొని పదిహేను మైళ్ళ దూరంలో ఉన్న ఉన్నత పాఠశాలలో ఒక సంవత్సరంపాటు మేనమామ ఇంట్లో వుండి చదువుకున్నాడు. పల్లెకి తిరిగి వచ్చి మైలున్నర దూరంలో వున్న జ్ఞానపీఠ ఉన్నత పాఠశాలలో చదువుతున్నాడు.

జ్ఞానపీఠంలో చేరి నెల రోజులయిందో లేదో అప్పుడే అతని మీద ఫిర్యాదు వచ్చింది. పదుమని గ్రామపు దుకాణదారు హరేన్ వచ్చి తపన్ మరికొందరు అబ్బాయిలు క్రితం రోజు సాయంత్రం అకారణంగా తన దుకాణం మీద రాళ్ళు రువ్వారని ప్రధానోపాధ్యాయునికి ఫిర్యాదు చేశాడు. తపన్ ఆ జట్టుకి నాయకుడు.

జవాను వెనకాల తపన్ వచ్చి ప్రధానోపాధ్యాయుని వంక భయంగా చూసి తలవంచుకున్నాడు. "నీవేనా తపన్ అంటే"- అని గద్దించాడు బెత్తం ఆడిస్తూ ప్రధానోపాధ్యాయుడు.

"అవునండీ" తపన్ నమ్రతతో జవాబిచ్చాడు.

"ఈ పెద్దమనిషి తెలుసా?" దుకాణదారును చూపిస్తూ అడిగాడు.

"తెలుసండీ. ఆయనది మా వూరే."

"నిన్న సాయంత్రం నువ్వూ నీ స్నేహితులూ అతని దుకాణం మీద రాళ్ళు రువ్వినమాట నిజమేనా? నిజం చెప్పు, లేకపోతే వీపు చిట్లగొట్టేస్తాను."

"అవునండీ. రతన్ మరికొందరితో కలిసి నేను దుకాణం మీద రాళ్లు రువ్వినమాట నిజమే."

"ఎందుకు? ఎందుకట్లా చేశావ్? రాస్కెల్! జవాబు చెప్పు" ప్రధానోపాధ్యాయుడు ఉరిమాడు.

"సర్! ఈ మనిషి మోసగాడు. ఎక్కువ డబ్బు తీసుకొని తక్కువ సరుకిస్తాడు. అడుగున వొత్తు పెట్టి కొత్తరకపు కాగితపు సంచులు ప్రవేశపెట్టాడు. మొన్న మేం ఇతని దగ్గర కిలో పప్పు కొన్నాం. ఇంటిదగ్గర తూకం వేసి చూస్తే ఎనిమిది వందల గ్రాములే తేలింది. కాగితపుసంచీ అడుగున పెట్టిన వొత్తు ఏభైగ్రాములు తూగింది; నూటయాభై గ్రాము లితను తక్కువ తూచాడు. ఈ సంగతి ఊళ్ళో అందరికీ తెలుసు. ఈ విషయం అడిగితే, నన్ను తిట్టి, దుకాణం నుండి వెళ్లగొట్టాడు. అందుకని దుకాణం మీద రాళ్లు విసిరాం."

ప్రధానోపాధ్యాయుడు దుకాణందారు వైపు చూశాడు. అతని ముఖం కందగడ్డ లాగైంది.

ప్రధానోపాధ్యాయుడు కొంతసేపు ఆలోచించాడు. తర్వాత తపన్ వైపు తిరిగి "అయినా నువ్వు చేసింది సరియైన పనికాదు. ఇతరుల సొమ్మును నష్టపరచటం తప్పు. అతను అవినీతిపరుడైతే చర్య తీసుకోవలసింది ప్రభుత్వం; కాకపోతే గ్రామపంచాయితీ. దీనితో నీకేం సంబంధం లేదు. చెయ్యి చాపు! అన్నాడు. తపన్‌కు అయిదు బెత్తపు

దెబ్బలు తగిలాయి. తరగతికి తిరిగి వచ్చాక సహాధ్యాయులు అతన్ని హేళన చేశారు; వెక్కిరించారు.

కొన్నాళ్ళ తర్వాత మరొక సంఘటన జరిగింది. పోట్ల ఎద్దు ఒకటి ఆ ప్రాంతమంతటినీ కల్లోల పరిచింది. చాలమందిని పొడిచింది. ఎవరైనా కర్ర తీసుకొని దగ్గరకు వస్తే మీదకు దూకేది - దాన్ని చూసి అందరూ భయపడ్డారు.

ఆ గొడ్డు దుండగాలు తపన్ ఉద్రేకాన్ని రెచ్చగొట్టింది. "ఆగవే, మొద్దా! నిన్ను మచ్చిక చేస్తాను" అన్నాడు. పాఠశాల విశ్రాంతి సమయంలో కర్ర ఉచ్చువేసినతాడు తీసుకొని, నెమ్మదిగా ఎద్దుని సమీపించాడు. సరైన సమయం చూసి ఎగిరి దాని వీపుమీదికి దూకి, దాని నోటికి, ఉచ్చు తగిలించాడు. ఎద్దు ఆశ్చర్యపడి, వీపుమీద బరువు పడినట్లు తెలుసుకుని కాలితో నేలను తన్నుతూ విదిలించ సాగింది. ముందుకు దూకి వీపుమీద బరువు తోసెయ్యాలని చూసింది. ఇంతలో పాఠశాల విశ్రాంతి సమయం అయిపోయి తరగతి ప్రారంభమయింది. కానీ తపన్ మాత్రం ఎద్దును మచ్చిక చేయటంలో నిమగ్నమైవున్నాడు. దాని వీపు మీదనుంచి జారిపోకుండా నిలుచుని ఉచ్చును గట్టిగా ఓగించి పట్టుకున్నాడు. దాని వీపుని నెమ్మదిగా తట్టాడు. దాంతో గొడ్డు మరింత చెలరేగింది. పాఠశాల ఆవరణలోకి చొచ్చుకు వచ్చి ఏడవ తరగతి గదిలోకి జొరబడింది. ఉపాధ్యాయుడు విద్యార్థులు బెదిరిపోయి చెల్లాచెదురుగా అన్ని దిక్కులా తొక్కుకుంటూ తోసుకుంటూ తరగతి గదినుంచి బయటపడ జూచారు. ఆ తొక్కిడిలో చాలమంది నలిగిపోయి కింద పడ్డారు. ఉపాధ్యాయుడు రజనీ సహారియా పరుగెత్తి దెబ్బతగలకుండ బైటపడ్డాడు.

బెదిరిపోయిన ఆ గొడ్డు కొమ్ముల పోట్లకు చాల అద్దాల కిటికీలు పగిలిపోయాయి. చివరకు బెదిరిన ఎద్దు తెగించి పాఠశాల మైదానంలోకి పరుగెత్తి పక్కకు పడిపోయింది. కొద్ది క్షణాల తర్వాత అది పైకి లేచి కాలికొద్దీ వెనుతిరిగి చూడకుండా పరుగుతీసింది.

తపన్ మీద మళ్లీ ఫిర్యాదు వచ్చిపడింది. ఈసారి ఉపాధ్యాయుడు రజనీ సహారియాయే ఫిర్యాదు చేశాడు. ప్రధానోపాధ్యాయుడికి విపరీతమైన కోపం వచ్చింది. ఈ అబ్బాయి ఒక పెద్ద అడ్డంకి, చిక్కులు తెచ్చిపెట్టేవాడు. విద్యార్థులేగాక పాఠశాల భవనానికి కూడ నష్టం కలిగింది. ప్రధానోపాధ్యాయుడు మళ్ళీ తపన్‌ను పిలిపించాడు.

తపన్ జవాన్ మోహన్‌తో కలిసి ప్రధానోపాధ్యాయుని ముందు నిలిచాడు - అతన్ని చూడగానే ప్రధానోపాధ్యాయుని కోపం తారస్థాయికి చేరుకున్నది.

"నువ్వొక దుర్మార్గుడివి. ఎద్దుని తరగతి గదిలోకి ఎందుకు తీసుకొచ్చావ్? మాట్లాడు" బెత్తం ఝుళిపిస్తూ నిగ్గదీశాడు.

తలవంచుకొని తపన్ జవాబిచ్చాడు. "సర్! నేను ఎద్దుని లోపలికి తీసుకురాలేదు. మచ్చిక చేయటానికి దానిమీద ఎక్కాను. హఠాత్తుగా అది లోపలికి పరుగెత్తింది."

"పాఠశాల జరిగే సమయంలో నిన్ను ఎద్దు నెక్కమని ఎవరడిగారు? ఏదీ చెయ్యి చాపు."

తపన్ పదిహేను దెబ్బలు తిన్నాడు. సహాధ్యాయులు మళ్లీ అతన్ని వెక్కిరించి హేళన చేశారు. పాఠశాలలో చెడ్డ విద్యార్థిగా అతనికి పేరువచ్చింది.

తర్వాత ఒక నోటీసు వచ్చింది. ఇదీ ఆ నోటీసు సారాంశం - "ఐదవ తరగతికి చెందిన తపన్ ఎద్దునెక్కి ఏడవ తరగతి ఉపాధ్యాయుని, విద్యార్థులను కలవరపరచినందుకు పదిహేను బెత్తపు దెబ్బలు విధించటమైనది. అద్దాల కిటికీలు పగులగొట్టినందుకు పరిహారంగా ఇరవై అయిదు రూపాయలు జరిమానా విధించ టమైనది. అంతేకాక తపన్ ఇకముందు ఎలాటి తప్పు చేసినా పాఠశాలనుంచి బహిష్కరించటం జరుగుతుంది." కొంతమంది పిల్లలు తరగతులలో నుంచి బయటికి వచ్చి తపన్‌ను వెక్కిరించారు.

ఆ రోజు సాయంత్రం ప్రధానోపాధ్యాయుడు ఇంటికి తిరిగివచ్చి టీ తీసుకొని షికారు వెళ్ళాడు. ఇది ఆయన దినచర్య. సూర్యాస్తమయం అవుతున్న సమయంలో ఇంటికి తిరుగుముఖం పట్టాడు. తోవలో ఒక దృశ్యం చూశాడు. ఒక ముసలి బిచ్చగత్తె చేతిని పట్టుకొని తపన్ ఆమె భిక్షాపాత్రను తలమీద పెట్టుకొని మోస్తున్నాడు. నరేన్, తరగతిలో ప్రథముడిగా వచ్చిన మహేష్ తపన్‌ను ఎగతాళి చేస్తూ పక్కనే నడిచి వస్తున్నారు. ఆ ముసలమ్మకు జ్వరం. బిచ్చమెత్తు కొంటుండగా ఆమెకు జ్వరం తగిలింది. భిక్షాపాత్ర మోయలేక పోవటమేగాక ఆమె నడవలేక పోతున్నది. ఆ ముసలమ్మ స్థితిని చూసి తపన్ భిక్షాపాత్రను తలమీద పెట్టుకొని ఆమె చేతిని తనచేతిలోకి తీసుకొని "అవ్వా ! నన్నుపట్టుకో, నిన్ను ఇంటికి తీసుకువెళ్తాను" అన్నాడు.

నరేన్, మహేష్ ప్రధానోపాధ్యాయుణ్ణి చూచి నమస్కరించారు. ప్రధానోపాధ్యా యుడు తపన్ చేస్తున్న చెడ్డపనిని కళ్లారా చూస్తున్నందుకు తృప్తిగా నవ్వి, తమ ఆనందాన్ని తెలియ పరచాడు. ఆ ముసలమ్మ తపన్ తనకు సహాయపడటానికి ఏవిధంగా ముందుకు వచ్చినదీ ఉపాధ్యాయుడికి చెప్పింది. గొంతు వణుకుతుండగా

ఆమె తపన్‌ను చూపించి "ఈ అబ్బాయి అక్కడ లేకపోతే నేనింకా ఆ రోడ్డుమీదే పడి వుండేదాన్ని. దేవుడు ఇతన్ని దీవించాలి. మిగిలిన ఇద్దరు పిల్లలు నేనెంత జబ్బుతో వున్నదీ చూశారు గాని, చెయ్యి ఆసరా యివ్వక పోవట మటుంచి ఈ అబ్బాయిని ఎగతాళి కూడ చేస్తున్నారు." ముసలమ్మ ఊపిరి తీసుకోవటం కోసం కొంతసేపు ఆగింది. ప్రధానోపాధ్యాయుడు నరేన్, మహేష్‌లను చివాట్లుపెట్టి పంపించి వేశాడు. ఆ ముసలమ్మ నామె యింటికి తీసుకు వెళ్ళమని తపన్‌కి చెప్పాడు.

రెండు వారాలు గడిచాయి. ఒకనాడు ప్రధానోపాధ్యాయుడు షికారు వెళ్ళి యింటికి తిరిగి వస్తున్నాడు. రోడ్డుమీద దెబ్బతగిలిన ఎద్దు కాలికి, తపన్ మోకాళ్ళమీద కూర్చొని వంగి మందు రాస్తూ, కట్టు కడుతూ కన్పించాడు. తపన్ కన్నీళ్లు పెట్టుకొనివున్నాడు- ప్రధానోపాధ్యాయుడు తన దగ్గరకి వచ్చి నిలబడటం గమనించి ఉలిక్కి పడ్డాడు. చేతులు జోడించి నమస్కరించాడు. "ఇక్కడేం చేస్తున్నావు తపన్?" ప్రధానోపాధ్యాయుడు అడిగాడు.

"సర్, కొంతమంది ఆకతాయి పిల్లలు ఎద్దుకాలు విరగకొట్టారు - దానికి బాధగా వున్నది. సర్, నోరులేని జంతువులను బాధపెట్టటం తప్పుకాదా?" తపన్ విచారంగా అడిగాడు.

"ఆ రోజు నువ్వు ఎద్దునే కదూ ఎక్కావు? అది పొగరుబోతనీ మచ్చిక చెయ్యాలనీ చెప్పావు! ఈ రోజు అది నీ దృష్టిలో అంతమంచి దెలా అయింది?"

"అవును సర్! అది అప్పుడు పొగరుబోతే! నేను ఎక్కినప్పటినుంచీ అది మారిపోయింది. అది జనాన్ని ఎదిరించటం మానేసి యిప్పుడు దారి కూడ యిస్తున్నది. కొన్ని మందుకు పనికొచ్చే ఆకులు నమిలి దానికి ఆ పసరుతో కట్టుకట్టాను. గాయాలకు అది చాల మంచిదని మా నాన్న చెప్పగా విన్నాను" అన్నాడు తపన్. అతనికి ఎద్దుమీద ఎంతో సానుభూతి ఏర్పడింది. కళ్ళనిండా నీళ్ళు నిలిచాయి.

ప్రధానోపాధ్యాయుడు ఆలోచనా నిమగ్నుడయ్యాడు. తర్వాత తపన్ ముఖంవైపు చూసి ఆప్యాయంగా అతన్ని బుజ్జగించాడు. మౌనంగా ఇంటిదారి పట్టాడు. ఆయన కళ్ళు చెమ్మగిల్లాయి.

జ్ఞానపీఠ ఉన్నత పాఠశాలలో ఆ రోజు బహుమతి ప్రదానోత్సవం. గౌహతి కళాశాలాధ్యక్షులు ఆ ఉత్సవానికి అధ్యక్షత వహించటానికి ఆహ్వానితులుగా విచ్చే

స్తున్నారు. ఈ సారి ప్రధానోపాధ్యాయులు రాబిన్ బారువా ఉత్తమ నడవడి గల విద్యార్థికి ప్రత్యేక బహుమతి నివ్వటానికి నిశ్చయించారు. మహాత్మాగాంధీ, జవహర్‌లాల్ నెహ్రూ, లాల్ బహదూర్‌శాస్త్రి జీవితచరిత్రలు - మూడు పుస్తకాలు బహూకరించ నిశ్చయించారు.

పాఠశాలలో విద్యార్థులు ప్రత్యేక బహుమతి గురించే మాట్లాడుకుంటున్నారు - ఐదవ తరగతిలో నరేన్ ఎగతాళిగా నవ్వి పక్కనే కూర్చున్న భాదేష్‌తో బిగ్గరగా "భాదేష్, నీకు తెలుసా! ఉత్తమ నడవడికి ప్రత్యేక బహుమతి తపన్‌కు ఇవ్వబోతున్నారు తెలుసా?" అన్నాడు. విద్యార్థులంతా విరగబడి నవ్వారు. తపన్ ముఖం అవమానంతో ఎర్రబడింది.

కార్యక్రమం ప్రారంభమైంది. అధ్యక్షుని ఆహ్వానించటం పూర్తయిన పిమ్మట కార్యదర్శి నివేదిక సమర్పించాడు. విద్యార్థుల పాటలు, నాట్యాలు, పద్య పఠనాల కార్యక్రమాలు జరిగాయి. ఆ తర్వాత అధ్యక్షులు ప్రసంగించారు. మరికొందరు ఉపన్యసించారు. ఆ తరువాత బహుమతి ప్రదానం ప్రారంభమైనది. బహుమతి విజేతలు ఆనందంతో, గర్వంతో ఉప్పొంగారు. ప్రత్యేక బహుమతి ప్రకటించే సమయం ఆసన్నమైంది. అందరూ ఆతృతతో ఎదురు చూడసాగారు. సభ నుద్దేశించి ప్రధానోపాధ్యాయుడు "గౌరవ అధ్యక్షా! సోదర సోదరీమణులారా! ఉత్తమ నడవడికి ప్రత్యేక బహుమతిని ఐదవ తరగతికి చెందిన తపన్ హజారికాకు నిశ్చయించాం" అన్నాడు.

ఉపాధ్యాయులు, విద్యార్థులు దిగ్భ్రాంతులయ్యారు. నరేన్, భాదేష్‌ల ముఖాలు నల్లబడ్డాయి. తపన్ తన చెవులను తానే నమ్మ లేకపోయాడు. లేచివెళ్ళి బహుమతి నందుకొనే ధైర్యం లేకపోయింది. "తపన్‌కుమార్‌హజారికా! ఐదవ తరగతి" ప్రధానోపాధ్యాయుడు మళ్ళీ పిలిచాడు. అతని తల తిరిగింది. ఇది నిజమేనా! పాఠశాల కంతటికీ చెడ్డపిల్లవాడని పేరు పడిన తననేనా ఉత్తమ నడవడి బహుమతిని తీసుకోవటానికి పిలిచింది? తపన్ లేచి నిలబడి, అధ్యక్షుని ముందుకు వెళ్ళి, నమస్కరించి, బహుమతి నందుకొన్నాడు.

ప్రధానోపాధ్యాయుడు అప్పుడు తపన్ ఏవిధంగా ముసలి బిచ్చగత్తెకు సహాయపడి నదీ, గాయపడిన ఎద్దుకు సేవచేసినదీ వివరించి చెప్పాడు. ఆయన తపన్‌కు స్వయంగా ఐదురూపాయలు బహుమతి యిచ్చాడు. సభ హర్షధ్వానాలతో మారుమ్రోగింది.

తపన్ కళ్ళల్లో ఆనంద బాష్పాలు మెరిశాయి.

# ఆకలిగొన్న సప్తపాశం

## సత్యజిత్ రే

మళ్లీ తలుపు చప్పుడయ్యేటప్పటికి చిరాకు పడుతూ అయిష్టంగా మూలిగాను. మధ్యాహ్నం నుంచి యిది నాలుగోసారి ! ఎవరైనా పని ఎలా చేసుకుంటారు? మార్కెట్ కి వెళ్లాలనే వంకతో వీలు చూసుకొని కార్తీక్ కూడ కనిపించకుండ పోయాడు.

వ్రాయటం ఆపవలసి వచ్చింది. లేచి తలుపు తీసి నప్పుడు కాంతిబాబు అక్కడ కనిపిస్తాడని అనుకోనేలేదు.

"ఎంత ఆశ్చర్యం! లోపలికి రండి, రండి" అని పిలిచాను.

"గుర్తు పట్టారా?"

"ఆ!"

ఆయన్ని లోపలికి తీసుకొచ్చాను. నిజానికి యీ పదేళ్లలో ఆయన రూపం చాల మారిపోయింది. 1950లో యీ మనిషి అస్సాం అడవులలో తన భూతద్దం పట్టుకొని తిరిగాడంటే యిప్పుడెవరు నమ్ముతారు? అతన్ని నే నక్కడ కలుసుకొనే సరికి దాదాపు యాభై యేళ్లుంటాయి ఆయనకు. కాని ఒక వెంట్రుక కూడ తెల్లబడలేదు. ఆ వయస్సులో ఆయన ఉత్సాహమూ, శక్తీ యువకున్నైనా సిగ్గుపడేటట్లు చేస్తాయి.

"ఆర్కిడ్స్ మొక్కల మీద నీ కింకా ఆసక్తి తగ్గిపోలేదను కుంటాను" అన్నాడాయన. చాలాకాలం కిందట కాంతిబాబు నాకు కానుక యిచ్చిన 'ఆర్కిడ్' మొక్క కిటికీ మీద కుండీలో వున్నది. మొక్కల మీద నాకు కుతూహలం కలిగేలాగ చేసినవాడు ఆయనే. కాని ఆయన దేశం వదిలిపెట్టి పోయాక నెమ్మదిగా నా ఇతర అభిరుచుల లాగే ఆర్కిడ్స్ మొక్కల మీద కూడ నాకు ఆసక్తి తగ్గిపోయింది. మొక్కల మీద నా ఆసక్తి యింకా మిగిలివున్నదనటం పొరపాటే. రచన చేయటం మీదే యిప్పుడు నా ఆసక్తి అంతా! కాలం మారిపోయింది. రచనలు చేసి జీవించటానికి వీలు కలిగింది. నేను రచించిన మూడు పుస్తకాల మీద వచ్చే ఆదాయం యిప్పుడు మా

కుటుంబపోషణకు సరిపోతున్నది. ఇప్పటికీ నేను ఆఫీసులో ఉద్యోగం చేస్తున్నాను. ఆ ఉద్యోగం వదిలిపెట్టి పూర్తి కాలాన్ని రచనల మీదే కేంద్రీకరించే సమయం కోసం ఎదురుచూస్తున్నాను. అప్పుడప్పుడూ విరామం కోసం ప్రయాణాలు చెయ్యాలని వున్నది.

కూర్చోగానే కాంతిబాబు వణకసాగాడు.

"చలిగా వుందా? కిటికీ మూస్తాను" అన్నాను.

"కలకత్తాలో యీ సంవత్సరం చలికాలం...."

'కాదు' 'కాదు', నాకు అప్పుడప్పుడు ఇలా వణుకు వస్తుంది. పెద్దవాడి నయిపోయిన కొద్దీ... ఇది నా నరాలకు సంబంధించినది" అన్నాడాయన.

ఆయనను నేను అడగ వలసిన విషయాలెన్నో ఉన్నాయి. కార్తీక్ తిరిగి వచ్చాడు. టీ తయారు చేయమని చెప్పాను.

"ఎక్కువసేపు వుండను.... నేను మీరు వ్రాసిన నవలల్లో వొకదాన్ని చూడటం జరిగింది. ప్రచురణకర్తలు మీ 'అడ్రసు' యిచ్చారు. ఇక్కడకు ఒక పనిమీద వచ్చాను" అన్నారు కాంతిబాబు.

"మీకేవిధంగా సహాయపడగలనో చెప్పండి.... మీరు ఎప్పుడు తిరిగి వచ్చారు? అది ముందు చెప్పండి. ఇంతకాలం మీరు ఎక్కడ వున్నారు! ఇప్పుడెక్కడ వుంటున్నారు? నేను తెలుసు కోవలసింది చాలా వుంది."

"రెండు సంవత్సరాల కిందట తిరిగివచ్చాను. అమెరికాలో వున్నాను. ప్రస్తుతం బరసాత్‌లో వుంటున్నాను."

"బరసాత్?"

"అక్కడ ఒక ఇల్లు కొనుక్కున్నాను."

"అక్కడ తోట వున్నదా?"

"ఆ ఉన్నది."

"మొక్కలను సంరక్షించే ఇల్లు కూడా వుందా?"

అంతకు ముందు కాంతిబాబు వున్నచోట అరుదుగా లభించే మొక్కల సంరక్షణ బ్రహ్మాండమైన ఇల్లు వున్నది. ఎంత అద్భుతంగా అరుదుగా లభించే చెట్లను సేకరించాడో! ఒక్క ఆర్కిడ్స్‌లోనే అరవై, అరవై ఐదు రకాలుండేవి. ఒక రోజంతా పువ్వులు చూస్తూ గడపవచ్చు ఎవరైనా!

కాంతిబాబు జవాబు చెప్పబోయే ముందు కొంచెం ఆగారు.

"అవును. చెట్ల సంరక్షణకు వేరే ఇల్లు వున్నది."

అంటే మీకు పది సంవత్సరాల కింద మొక్కలమీద ఎంత శ్రద్ధవుందో, ఇప్పుడు కూడ అంత శ్రద్ధ వుందన్నమాట."

"అవును."

ఆయన గదిలో ఉత్తర దిక్కుగా వున్న గోడవైపు వింతగా చూస్తున్నారు. నేను కూడ అదే వైపుకు చూశాను. రాయల్ బెంగాల్‌పులి చర్మం, పూర్తిగా తలతో గూడ అక్కడ తగిలించబడి వుంది.

"దాన్ని గుర్తుపట్టారా?" అని అడిగాను.

"ఆ చర్మం దానిదే కదూ!"

"అవును. చెవి దగ్గర ఆ రంధ్రం చూడండి."

"అప్పుడు గురిచూచి కాల్చడంలో చాల నేర్పరులు. ఇప్పుడుకూడ అంతే నేర్పువుందా?"

"నాకు తెలియదు. ఏడు సంవత్సరాల నుండి వేటాడటం మానేశాను."

"ఎందుకని?"

"కావలసినన్ని కాల్చాను. ఇప్పుడు ఏదో యిలా గడుపుతున్నాను."

ఇకమీద జంతువులను చంపాలని లేదు.

"శాకాహారులుగా మారేరా?"

"లేదు."

"మరి ఎందుకని? కాల్చడం అంటే చంపటమేగదా! మీరు పులినో, మొసలినో, గేదెనో కాలుస్తారు. అప్పుడు మీకు దాని చర్మం వస్తుంది లేదా తలలో ఏదైనా చెత్తకూరుతారు లేదా వాటి కొమ్ముల్ని కొయ్యలో బిగించి మీ గదిగోడలు అలంకరించుకుంటారు. కొందరు మిమ్మల్ని మెచ్చుకుంటారు. మీ విజయ చిహ్నాలను చూసినపుడు కొందరు భయంతో వణికిపోతారు. అవి యవ్వనంలో మీ సాహసకృత్యాలకు గుర్తులుగా వుంటాయి. కాని మీరు యే మేకనో, కోడినో, మరొకదాన్నో తిన్నప్పుడు ఏమౌతుంది? మీరు వాటిని కేవలం చంపటం మాత్రమేగాక, నమిలి తిని జీర్ణించుకుంటున్నారు. ఇది ఏ విధంగా నైనా అంతకంటె బాగుందా?

నేను జవాబు చెప్పటానికేమీ లేదు. కార్తీక్ టీ తీసుకువచ్చాడు. కాంతిబాబు కొద్దిసేపు నిశ్శబ్దంగా వున్నారు. టీ కప్పు అందుకునే ముందు మరొకసారి వణికారు. ఒక గుక్క 'టీ' చప్పరించి ఇలా చెప్పారు. "ఒక జీవి మరొక జీవిని తినటం, ఇంకొక దానిచే తినబడటం అనేది ప్రకృతిలోని మూల సిద్ధాంతం. ఆ బల్లిని చూడండి! ఓర్పుగా ఎలా ఎదురు చూస్తుందో!"

కింగ్ అండ్ కంపెనీ వారి కాలెండరు పైన ఒక బల్లి రెప్ప కొట్టకుండా పురుగుపై చూపు నిలిపి వున్నది. మేము దానివైపు చూశాం. ముందు కదలిక లేకుండ వుంది. తరువాత నెమ్మదిగా, జాగ్రత్తగా కదులుతూ, చివరిగా ఒక్క దూకుదూకి పురుగును పట్టేసింది.

"భలేగా పట్టింది" అన్నారు కాంతిబాబు. "దానికి ఈ రాత్రి యీ ఆహారం చాలు. ఆహారం! ఆహారం జీవితంలోని ముఖ్యావసరం. పులులు మనుషుల్ని తింటాయి. మనిషి మేకల్ని తింటాడు. మరి మేకలు!.... ఏం అవి ఏమీ తినవా మరి? మీరు ఇలా చూసుకుంటూ పోతే ఆదిమ దశలాగా ఆటవిక దశలాగా, కనిపిస్తుంది. కాని ఇది ఈ విశ్వంలోని సిద్ధాంతం. దీని నుంచి తప్పించుకొనే మార్గం లేదు. ఈ పద్ధతి ఆగిపోతే సృష్టే ఆగిపోతుంది.

"శాకాహారిగా వుండటం మంచిదేమో!" తెగించి అన్నాను.

"అలా ఎవరంటారు? ఆకులూ, కూరగాయలూ ప్రాణంలేనివని మీ రనుకుంటు న్నారా?"

"ఉంటుందనుకోండి. మీకూ జగదీష్‌బోస్ గార్కికీ ధన్యవాదాలు. ఇది నా కెప్పుడూ గుర్తుంటుంది. కాని యిది అలాంటి ప్రాణం కాదు? కాదుగదా! మొక్కలూ జంతువులూ ఒకలాంటివి కావు."

"అవి రెండూ పూర్తిగా వేరుగా వుంటాయని అనుకుంటున్నారా?"

"మరి కాదా! వాటి మధ్య తేడా చూడండి! చెట్లు నడవలేవు; వాటి భావాలను పైకి చెప్పలేవు. వాటి భావాలను తెలిపే మార్గం వాటికి తెలియదు. మీరు అంగీకరించారా?"

కాంతిబాబు ఏదో చెప్పబోయినట్లుగా కనిపించారు. కాని ఏమీ చెప్పలేదు. వారు 'టీ' ముగించి, కొంతసేపు తలవంచుకొని నిశ్శబ్దంగా కూర్చున్నారు.

తరువాత నావైపు చూశారు. ఆందోళన, భయంతో కూడిన వారి చూపు నన్ను ఇబ్బంది పెట్టింది. రాబోయే ప్రమాదాన్ని కీడును తెలియజెప్పింది. ఆయన రూపం ఎంతగా మారిపోయింది!

తరువాత ఆయన నెమ్మదిగా మాట్లాడసాగారు. "పరిమళ్! నేను ఇక్కడికి 21 మైళ్ల దూరంలో వుంటున్నాను. ఈ 58 సంవత్సరాల వయస్సులో ప్రచురణకర్తనుంచి మీ 'అడ్రస్' తెలుసుకోవటం కోసం ఎంతో కష్టపడి కాలేజిరోడ్డుకు వెళ్లాను. ఏ ప్రత్యేక కారణం లేకుండ నేను ఇంత ప్రయాసపడనని మీరు గ్రహించే వుంటారని తలుస్తాను. లేకపోతే పిచ్చి నవలలు వ్రాసి మీ వివేకం కోల్పోయారా? బహుశ మీరు

నన్ను మీ కథలో ఒక ఆసక్తికరమైన పాత్రగా వాడుకోవాలని ఆలోచిస్తున్నారేమో!

నేను సిగ్గుపడ్డాను. కాంతిబాబు అంత పొరబడలేదు. నిజానికి నేను అతన్ని నా నవలలో ఒక దానిలో పాత్రగా వుపయోగించుకోవటానికి అవకాశం వున్నదేమో నని చూస్తున్నాను.

"ఒకవేళ మీరు మీ రచనని జీవితానికి అన్వయించు కోలేకపోతే, పరిమళ్, మీ పుస్తకాలెప్పుడూ జీవితపు లోతుకు పోలేక పైపైనే వుండిపోతాయి. మీ ఊహ ఎంత నిశితమైనప్పటికీ అది వాస్తవం కన్నా వింతగా వుండదని మీరెప్పుడూ మర్చిపోగూడదు. ఏమైనా నే నిప్పుడు మీకు బోధచేయటం కోసం రాలేదు. నిజానికి నేనిప్పుడు మీ సహాయాన్ని కోరటానికి వచ్చాను...."

నేను ఆశ్చర్యపోయాను. నావల్ల అతనికో సహాయం కావాలి!

"మీ దగ్గర యింకా తుపాకీ వున్నదా? లేక దాన్ని వదిలించుకున్నారా?"

తుపాకీ తుప్పపట్టింది గానీ నా దగ్గర యిప్పటికీ వున్నది. "మీ రెందుకలా అడిగారు?" అన్నాను.

"రేపు మీ తుపాకీతో మా ఇంటికి రాగలరా?"

నేను దగ్గరగా ఆయన ముఖంలోకి చూశాను. ఆయన హాస్యానికి అంటున్నట్లు లేదు. "తూటాలు కూడ తీసుకు రండి" అని చెప్పారాయన. ఏం చెప్పాలో తెలియలేదు. ఆయనకు బహుశా మతి చలించిందేమోనని నేను అనుమానించాను. ఆయన సంభాషణలో అలాంటి దేమీ కనిపించలేదు. ఆయనెప్పుడూ ఒక్క పిసరు వింతగానే ప్రవర్తిస్తారు. లేకపోతే అరణ్యాలలో దొరికే వింత మొక్కల కోసం ఆ జీవితాన్నెందుకు ప్రమాదాలపాలు చేసుకుంటారు!

"నాకు తుపాకీ తీసుకురావటాని కేమీ అభ్యంతరం లేదు. కాని ఆ కారణం తెలుసుకోవాలని ఉబలాటంగా వుంది. అక్కడ మీరుండే చుట్టుపక్కల్లో క్రూరజంతువులు గానీ, కన్నం వేసే దొంగలు గానీ వున్నారా?" అని అడిగాను.

"మీరు వచ్చినప్పుడు అంతా చెపుతాను. తుపాకీతో అవసరంకూడ కలగక పోవచ్చు. ఒకవేళ కలిగినా మిమ్మల్ని చట్టానికి విరుద్ధమైన ఏ నేరంలోను ఇరికించనని వాగ్దానం చేస్తున్నాను."

కాంతిబాబు వెళ్లటానికి లేచారు. నా భుజంపై చేయి వేసి ఇలా అన్నారు "పరిమళ్! మీ దగ్గర కెందుకు వచ్చానంటే కిందటిసారి మిమ్మల్ని చూసినప్పుడు సాహసాలు చెయ్యటమంటే ఇష్టంగా కనపడ్డారు. నాకు మానవ సమాజంతో సంబంధం ఎప్పుడూ తక్కువే. ఇప్పుడది మరీ తగ్గిపోయింది. నా స్నేహితులలో

పరిచయస్థులలో మీ అంత శక్తిసామర్థ్యాలున్న వాళ్లెవరూ లేరు. సాహసాలు చెయ్యాలనే కోరిక ఇంతకుముందు నా రక్తనాళాల్లో అనుభవిస్తూ వున్నది. యిప్పుడీ క్షణంలో బయటికి వచ్చింది.

"అక్కడి కెలా వెళ్లాలి, ఎప్పుడు, ఎక్కడ" అని అడిగాను.

సరే చెపుతాను. జెషోర్‌రోడ్డులో తిన్నగా వెళితే బరసాత్ స్టేషన్ వస్తుంది. అక్కడ ఆగి అడగాలి. మధుమురళి కొలను అంటే అక్కడ ఎవరేనా చెపుతారు - స్టేషన్ నుంచి నాలుగు మైళ్లుంటుంది. కొలను పక్కన ఒక పాత నీలిమందు పండించే వారి బంగళా వుంది. దాని పక్కనే మా ఇల్లు. మీ కారున్నదను కొంటాను."

"లేదు, కాని మిత్రుడొకరికి కారున్నది."

"ఎవరా మిత్రుడు?"

"అభిజిత్. కాలేజీలో నాతో చదివాడు."

"అతనెలాంటివాడు? అతన్ని నేను ఎరుగుదునా?"

"బహుశా తెలియక పోవచ్చు. కాని చాల మంచివాడు. అంటే మీరొక నమ్మకస్తుడి కోసం చూస్తూంటే అతను తగినవాడు."

"బావుంది. అతన్ని కూడా తీసుకు రండి. ఎలాగైనా వచ్చెయ్యండి. రావటం అర్జంటని చెప్పనక్కర లేదు - చీకటిపడకముందే చేరు కోవటానికి ప్రయత్నించండి."

మా ఇంట్లో టెలిఫోన్ లేదు. సందు మలుపు వరకూ నడిచి రిపబ్లిక్ కెమిస్ట్సు మందులు షాపునుంచి అభిజిత్‌కు ఫోన్ చేశాను.

"ఇప్పుడే రావాలి. చెప్పాల్సిన ముఖ్య విషయం వొకటుంది," అని చెప్పాను.

"నాకు తెలుసు. నీవు కొత్తగా వ్రాసిన కథ నేను వినాలని వుంది. నాకు భయంగా వుంది, వింటూనే మళ్ళీ నిద్రపోతానని!"

"ఇది ఆ విషయం కాదు, పూర్తిగా వేరే సంగతి."

"ఏమిటి అది? ఇప్పుడే ఎందుకు చెప్పకూడదు? ఇక్కడ ఒక మనిషి మాస్టిఫ్ కుక్కను తీసుకొచ్చాడు. ఆ మనిషి మా ఇంట్లో కూర్చొని వున్నాడు."

అభిజిత్‌ను అక్కడ నుంచి కదిలించాలంటే కుక్కలను ఎరగా పెట్టి ఆకర్షించాలి తప్ప మరో విధంగా వీల్లేదు. అతని కుక్కల దొడ్డిలో ఐదు ఖండాలనుంచి తెప్పించిన అనేక జాతుల కుక్కలున్నాయి. అందులో మూడు బహుమతులు పొందినవి వున్నాయి. ఐదు సంవత్సరాల కిందట కుక్కలంటే అతనికి మోజు వుండేది కాదు. కాని యిప్పుడు ఆ విషయం కాకుండ వేరే విషయం ఏదీ

ఆలోచించటం లేదు, మాట్లాడటం లేదు.

కుక్కల మీద ప్రేమే కాకుండ అభిజిత్‌కు ఇంకో మంచి గుణం వుంది. నా శక్తిమీద నా తీర్పుమీద పూర్తి నమ్మకం వుంది.

నా మొదటి నవలను ప్రచురించటానికి ఏ ప్రచురణ కర్తకూడ ముందుకు రాని సమయంలో అభిజిత్ దాన్ని ముద్రించటాని కయ్యే ఖర్చు స్వయంగా భరించాడు. ఇలా అన్నాడు "ఈ విషయాలు అర్థం కావు. ఇది నువ్వు వ్రాశావు కాబట్టి పూర్తిగా చెత్త అనటానికి వీల్లేదు. ఈ ప్రచురణకర్తలు వట్టి తెలివి తక్కువ దద్దమ్మలు". ఆ పుస్తకం బాగానే అమ్ముడుపోయి కొంత కీర్తిని తెచ్చిపెట్టింది. ఈ విధంగా అభిజిత్‌కు నా మీద వున్న నమ్మకం బలపడింది.

నే కుక్కల పేరుతో చెప్పిన కథ అబద్ధం అని బయట పడగానే నాకు లభించవలసిన సత్కారం లభించింది. అది - అభిజిత్ నా భుజం మీద గట్టిగా చరిచాడు. నేనదేం లెక్కచెయ్యలేదు. ఎందుకంటే నే చెప్పిన దాన్ని అతను అంగీకరించాడు.

"వెళదాం పద, చాల రోజులుగా బయటకు వెళ్ళలేదు. చివరిది సోనాపూర్‌లో చిత్తడిగా వున్నచోట వాసనపట్టి కాల్చటమే, కానీ యీ మనిషి ఎవరు? ఇతని కథ ఏమిటి? అతను వివరంగా చెప్పటం లేదేం?"

"నాకేమీ వివరంగా చెప్పలేదు. నీకు ఇంకేం చెప్పగలను? అక్కడ ఏదో ఒక రహస్యం వున్నది. ఇది మన ఆలోచనలను పదును పెట్టటానికి మంచి అవకాశం."

"ఆ మనిషెవరో, కనీసం అదైనా చెప్పు."

"కాంతిచరణ్ ఛటర్జీ. ఆ పేరులో నీకేమైనా తెలుస్తుందా? ఒకప్పుడు ఆయన స్కాటిష్ చర్చ్ కాలేజీలో బోటనీ ప్రొఫెసర్. తర్వాత బోధన మానేసి, అరుదుగా లభించే మొక్కలను సేకరించటానికి, చుట్టుపట్ల ప్రదేశాలన్నీ తిరిగారు. అనేక పరిశోధనలు చేసి కొన్ని విషయాలు వ్రాసి ప్రచురించారు. ఆయన దగ్గర బ్రహ్మాండమైన మొక్కలున్నాయి - ముఖ్యంగా ఆర్కిడ్స్."

"ఆయన్ను నువ్వేలా కలుసుకున్నావు?"

"మేము ఒకప్పుడు కలిసి అస్సాంలోని కజరంగా అరణ్యంలోని బంగళాలో వున్నాం. నేను అక్కడికి ఒక పులిని పట్టుకోగలననే ఆశతో వెళ్లాను. ఆయన నెపంథిస్ కోసం వెతుకుతున్నారు."

"దేనికోసం చూస్తున్నారూ?"

"నెపంథిస్! అది ఒకమొక్క శాస్త్రీయ నామం. మనిద్దరికీ అది 'పిచ్చర్‌ప్లాంట్',

అది అస్సాం అడవుల్లో కీటకాలపై ఆధారపడి నివసిస్తుంది. అది నేనెప్పుడూ చూడలేదు. కాని ఇది కాంతిబాబు చెప్పినది మాత్రమే."

"కీటకాలను తింటుందా? ఒక చెట్టా? కీటకాలను తినటమా?"

"నీవు ఎప్పుడూ వృక్షశాస్త్రం చదవనట్లు కనిపిస్తున్నదే?"

"లేదు. నే చదవలేదు."

"మంచిది. నీవు సందేహించ నవసరం లేదు. నీ పాఠ్యపుస్తకాలలో వాటి బొమ్మలు చూడొచ్చు - "

"మంచిది. చెప్పు."

"అంతకు మించి చెప్పటటానికి ఏమీలేదు. పులిని తీసుకొని తిరిగి వచ్చాను. ఆయన అక్కడే వున్నారు. ఆయన్ను ఏ పాము కరుస్తుందో, ఏ క్రూర జంతువు తింటుందో అని భయపడ్డాను."

"కలకత్తా తిరిగి వచ్చాక మేము ఒకటి రెండు సార్లకన్నా ఎక్కువ కలుసుకోలేదు. కానీ ఆయన్ను తరుచుగా తలచుకున్నా. ఎందుకంటే ఆ కొద్ది కాలంలోనే ఆర్కిడ్స్ అంటే మోజు పడ్డాను. నా కోసం అమెరికా నుంచి కొత్త జాతి మొక్కలను తెస్తానని చెప్పాడు."

"అమెరికానా? అంటే ఆయన అమెరికా వెళ్లాడన్నమాట!"

ఆయన పరిశోధనలోని ఒక అంశం విదేశాలలోని వృక్షశాస్త్రానికి సంబంధించిన పత్రికలో ప్రచురింపబడింది. దాని ద్వారా ఆయన బాగా పేరు పొంది వృక్షశాస్త్రానికి సంబంధించిన సమావేశానికి ఆహ్వానింపబడ్డారు. అది ఎప్పుడంటే - 51 లేదా 52లో. ఆ తరువాత ఇవాల్టివరకూ ఆయన్ను నే కలుసుకోలేదు."

"ఇన్ని సంవత్సరాలూ ఆయనేం చేస్తున్నాడు?"

"నా కింకా తెలియదు. కాని మనకు రేపు తెలుస్తుందని ఆశ."

"ఆయనేమీ తిక్క మనిషి కాడు గదా?"

"ఏమైనా నీ కంటె తిక్కమనిషి కాడు. నువ్వూ నీ కుక్కలూ ఆయనా ఆయన మొక్కల కంటె తక్కువ బాధేమీ కాదు."

జెష్సోర్ రోడ్డుమీద అభిజిత్ స్టాండర్డ్ కారులో ప్రయాణ మయ్యాం. "మేం అంటే" అభిజిత్, నేను, మరొకజీవి - అభిజిత్ కుక్క బాద్‌షా. ఇదే నా పొరపాటు, అభిజిత్‌తో పాటు అతని కున్న పదకొండు కుక్కల్లో దేన్నో వొకదాన్ని తీసుకువస్తాడని గ్రహించకపోవడం నాదే పొరపాటు.

'బాద్‌షా' గోధుమరంగులో వున్న రాంపూర్ వేట కుక్క. పెద్దదిగా, బలంగా

వుండి కార్లో వెనక సీటంతా ఆక్రమించుకొన్నది. ముఖం కిటికీలోనుంచి బయట పెట్టింది. ఆరుబయట కన్పించే పచ్చని వరి పొలాలను మెచ్చుకోలుగా, ఆనందంగా చూస్తున్నది. రోడ్డుపక్క పల్లెటూళ్లలో కుక్కల్ని చూసి అప్పుడప్పుడు 'గుర్రు' మంటున్నది.

ఈ ప్రయాణంలో బాద్‌షా అవసరం వుండదని హెచ్చరించానుగాని అభిజిత్ వొప్పుకోలేదు. నాకు నీ తుపాకి గురి మీద నమ్మకం లేక దీన్ని తీసుకొచ్చాను. నువ్వు తుపాకి పట్టుకొనక కొన్ని సంవత్సరాలైంది. ఏదైనా అపాయం వస్తే బాద్‌షా బాగా ఉపయోగపడుతుంది. అది వాసన పట్టటంలో అసాధారణమైన నేర్పు గలది. దానికెంత ధైర్యమో తెలుసా?"

కాంతిబాబు ఇల్లు కనుక్కోవటం పెద్ద కష్టమేమీ కాలేదు. మధ్యాహ్నం రెండున్నర గంటల ప్రాంతంలో అక్కడికి చేరుకున్నాం. గేటులోపలికి ప్రవేశించగానే బంగళాలోకి దారి తీసే రోడ్డు వున్నది. ఇంటి వెనకాల ఒక పెద్ద ఎండిపోయిన శిరీష వృక్షం వున్నది. దాని పక్కనే ఫ్యాక్టరీ లాగ కనిపించే రేకుల షెడ్డొకటుంది. ఇంటి కెదురుగా రోడ్డు కిరుపక్కలా తోటవున్నది. తోట కవతల పొడవైన రేకుల షెడ్డులో వరుసగా పేర్చిన మెరిసే అద్దాల పెట్టెలున్నాయి.

కాంతిబాబు మమ్మల్ని ఆహ్వానించాడు. కాని బాద్‌షా వైపు నిరసనగా చూశాడు. "ఈ కుక్కకు శిక్షణ ఇచ్చారా?" అని అడిగాడు.

"ఇది నేను చెప్పినట్లు వింటుంది. కాని యిక్కడ శిక్షణ పొందని కుక్కలు వుంటే ఇది ఏం చేస్తుందో చెప్పలేను. మీకు కుక్కలున్నాయా?" అన్నాడు అభిజిత్.

"లేవు, కుక్కలు లేవు. కాని దయచేసి దాన్ని యీ గది కిటికీకి కట్టివేయండి" అభిజిత్ నావైపు పక్క చూపు చూసి సైగ చేశాడు. కాని బుద్ధిమంతుడైన అబ్బాయిలాగా కుక్కను కట్టివేశాడు. బాద్‌షా నెమ్మదిగా మూలిగి అసమ్మతిని తెలిపింది కాని పరిస్థితిని అర్థం చేసుకున్నట్లు కనిపించింది.

మేం బయట వరండాలో పేమ్ కుర్చీల్లో కూర్చున్నాం. తన సేవకుడు ప్రయాగ్ కుడిచేతికి దెబ్బ తగలడం చేత, తానే కాస్త టీ పెట్టి ఫ్లాస్కులో పోసివుంచినట్లు చెప్పారాయన. టీ కావలసినప్పుడు అడగమని చెప్పారు.

ఇంత ప్రశాంతమైన చోట తెలియని ఆపద ఏమి మూడనున్నదో నా ఊహకు అందలేదు. పిట్టల కూతలు తప్ప అంతా నిశ్శబ్దంగా వున్నది. తుపాకి తీసుకు రావటం అర్థంలేని పనిగా తోచి, దాన్ని గోడ పక్కన కింద పెట్టాను.

అభి అచ్చమైన 'సిటీమనిషి.' కుదురుగా కూర్చోలేదు. పల్లె అందం, తెలియని పిట్టల కూతలు అతన్ని ఎక్కువ కదిలించలేదు. కాస్సేపు వోపిక పట్టి ఇంక ఉండబట్టలేక "మీరు అస్సాం అడవులలో ఏదో వొక అరుదైన మొక్కకోసం వెతుకుతూ దరిదాపు ఒక పులినోట్లో చిక్కుకున్నారని నా పరిమళ్ చెప్పాడు" అన్నాడు.

అభికి నాటకీయంగా, అతిశయోక్తులతో మాట్లాడటమంటే ఇష్టం. కాంతిబాబు మనస్సు నొప్పిస్తాడేమోనని భయం వేసింది. కాని ఆయన చిరునవ్వు నవ్వి "అడవిలో ప్రమాదమంటే, అది మీరు, తప్పకుండ పులే అయి వుంటుందను కుంటారు. అదే కదా! చాలమంది అంతే అనుకుంటారు. కాని.... నేను పులిని ఎదుర్కోలేదు. ఒకసారి నన్నొక జలగ పట్టుకుంది. దానివల్ల నాకేమీ ప్రమాదం జరగలేదు."

"మీ మొక్క దొరికిందా?"

"ఏ మొక్క?"

"పిచ్చర్ లేక ప్ల్యాటర్, దాన్నే మంటారో మీరు?"

"ఓ మీ రనేది నెపస్థీస్ సంగతా! ఆ దొరికింది. అదింకా నా దగ్గరున్నది. మీకు చూపిస్తాను దాన్ని. ఇప్పుడు నాకు మాంసాహారపు మొక్కలమీద తప్ప మిగిలిన వాటిమీద ఆసక్తి తగ్గిపోయింది. చాల భాగం ఆర్కిడ్స్ మొక్కల్ని కూడ వదిలించుకున్నాను."

కాంతిబాబు లోపలికి వెళ్ళినపుడు అభీ నేనూ వొకరినొకరం చూచుకున్నాం. మాంసం తినే మొక్కలు! నేను కళాశాలలో పదిహేనేళ్ల కింద చదివిన వృక్షశాస్త్రపు పాఠ్యపుస్తకంలో ఒక పేజీని, కొన్ని బొమ్మల్ని అస్పష్టంగా జ్ఞాపకం తెచ్చుకున్నాను.

కాంతిబాబు ఒక సీసా తీసుకొని వచ్చాడు. దాని నిండా మిడతలు, పేడపురుగులు అదే సైజులో వున్న యింకా కొన్ని పురుగులూ వున్నాయి. దాని బిరడాకు కారపు పిడతకున్నట్లు చాలా చిల్లులున్నాయి.

"భోజనం పెట్టే సమయమిది, నాతో రండి" అన్నాడాయన.

ఒక రేకుల షెడ్డులోకి నడిచాము. దాన్లో గాజు తొట్లున్నాయి. ఒక్కొక్క తొట్టిలో ఒక్కొక్క రకం మొక్కలున్నాయి. వాటిలో వొక్కటి కూడ నేనింతకు ముందు చూడలేదు.

"ఈ మొక్కలు మన దేశంలో కనిపించవు. ఏవీ దొరకవు, నెపంథిస్ తప్ప. ఒకటి నేపాల్ నుంచి, రెండవది ఆఫ్రికా నుంచి తెచ్చాను. మిగిలినవన్నీ మధ్య అమెరికా నుంచి తెచ్చినవి" అన్నారు కాంతిబాబు.

అభిజిత్‌కు యీ మొక్కలు మన నేలలో ఎలా బ్రతికి వున్నాయో తెలుసుకోవాలని పించింది.

"వాటికి నేలతో ఏం పనిలేదు" అని కాంతి బాబు సమాధానం చెప్పారు.

"ఎలా?"

"వాటికి నేలనుంచి ఆహారం లభించదు. మానవులు తమ ఆహారాన్ని బయటనుంచి ఎలా పొందుతున్నారో, తమ దేశంలోనే గాక, ఇంకా ఇతర దేశాల్లో కూడా సుఖంగా ఎలా బతకగలుగుతున్నారో, ఇవి కూడ తమకు కావలసిన ఆహారం లభించినన్నాళ్ళూ, అవి ఎక్కడున్నా జీవించి వుండగలవు."

కాంతిబాబు ఒక గాజు తొట్టి దగ్గర నిలిచారు. దానిలో ఒక వింతయిన మొక్క వున్నది. దాని ఆకులు ఆకుపచ్చగా, రెండంగుళాల పొడవులో, అంపములాంటి తెల్లటి అంచులుగల పలువరుసతో వున్నాయి. ఆ గాజు తొట్టికి గుండ్రటి తలుపు వున్నది. ఆ తలుపు సీసా మూతకు సరిపడే సైజులో వున్నది. అతి త్వరగా కాంతిబాబు ఆ తలుపు తెరిచి, సీసా మూత తీసారు. సీసా మూతిని దాని తలుపు గుండా లోపలికి నెట్టారు. వెంటనే సీసా నుంచి ఒక పురుగు బయటకు వచ్చింది. ఆయన త్వరగా సీసాను వెనక్కి లాగి దాని తలుపు మూశారు. ఆ పురుగు కొంచెంసేపు ఇరుక్కుపోయి, తర్వాత ఆకుమీద స్థిరపడింది. ఆ ఆకు వెంటనే మధ్యకు ముడుచుకొని, బిగుతుగా ఆ పురుగును తనలో ఇరికించుకొన్నది. ఆ ఆకు అరల్లో చిక్కుకుపోయి పురుగు ఆ వలలో నుంచి తప్పించుకోవటానికి వీల్లేకుండా పోయింది.

నేనెప్పుడూ ప్రకృతి సిద్ధంగా చేయుబడిన ఇలాంటి వింతయిన, భయంకరమైన వలను చూడలేదు.

"ఆ పురుగు ఎప్పుడూ ఆకుమీదే కూర్చుంటుందనటానికి ఏమైనా నిదర్శనం వున్నదా?" అని అభి ఊపిరాడని గొంతుకతో అడిగాడు.

"బహుశా అంతే! పురుగుల్ని ఆకర్షించటం కోసం యీ మొక్కలు ఒకలాంటి వాసనను వెదజల్లుతాయి! దీన్ని 'వీనస్ ఫ్లైవల' అని పిలుస్తారు. ఈ మొక్కను మధ్య అమెరికానుంచి తీసుకు వచ్చాను. ఇది అన్ని వృక్ష శాస్త్ర పాఠ్యపుస్తకాల పట్టికలో వున్నది" అన్నారు కాంతిబాబు.

"నేను పురుగును ఆసక్తితో చూచాను. మొదట్లో అది కొద్దిగా కొట్టుకొన్నది - కాని స్పృహ కోల్పోయింది. దానిమీద ఆకు వత్తిడి ఎక్కువైంది. ఆ మొక్క బల్లి కన్నా ఏమాత్రం తక్కువయింది కాదు."

అభి బలవంతాన చిరునవ్వు నవ్వాడు. మీ ఇంట్లో ఇలాంటి మొక్కను వుంచుకోవడం మంచిదే. పురుగుల్ని వదిలించుకోవటానికి యిది తేలికైన పద్ధతి - బొద్దింకల్ని చంపటానికి DDT పొడి చల్లనవసరం లేదు" అన్నాడు.

"ఈ చెట్టు అలా చెయ్యలేదు. ఇది బొద్దింకల్ని జీర్ణించుకోలేదు. దీని ఆకులు చిన్నవి" అన్నారు కాంతిబాబు.

ఆ ప్రక్కనే వున్న గాజు తొట్టిలో మరొక మొక్కను చూశాము దాని ఆకులు బారుగా లిల్లీ మొక్క ఆకుల్లాగా వున్నాయి. ప్రతి ఆకు చివరను సంచిలాంటిది వ్రేలాడుతున్నది. అంతకు ముందు ఒక బొమ్మలో చూసి వుండటాన దాన్ని గుర్తుపట్టాను.

"ఇది 'నెపంథిస్' లేదా 'పిచ్చర్ ప్లాంట్'. దీని జీర్ణశక్తి పెద్దది. దీన్ని నేను మొదట చూసినప్పుడు దీని సంచిలో ఒక పక్షి శరీరభాగాలు కొన్ని కనిపించాయి." అని కాంతిబాబు వివరించారు.

"అమ్మబాబోయ్" అభి భయంతో అన్నాడు. "ఇది ఏమి తిని బతుకుతున్నది?" అతని గొంతులో మామూలు పద్ధతిమారి, భక్తితో కూడిన భయం వచ్చింది.

"బొద్దింకలు, సీతాకోకచిలుకలు, గొంగళి పురుగులు అలాంటి జీవులు. ఒకసారి నేను ఒక ఎలుకను బోనులో పట్టాను. దాన్ని ఆ మొక్కకు ఆహారంగా పెట్టటానికి ప్రయత్నించాను. మొక్కకేమీ అభ్యంతరం లేకపోయింది. కాని ఎక్కువ తినటం వాటికి చాల హానికరం. ఆ మొక్కలు చాలా ఆశపోతులు. వాటికి తమ సహజమైన మితి ఏదో తెలియదు."

ఒక గాజు తొట్టి దగ్గరనుంచి మరొక గాజు తొట్టి దగ్గరకు మేం మిక్కిలి ఆసక్తితో కదిలాం. బట్టర్ వర్ట్, సన్‌డ్యూ, బ్లాడర్ వర్ట్ - వీటిలో కొన్నిటిని ఇంతకు ముందు బొమ్మల్లో చూడటాన వాటిని గుర్తించాను. కాని మిగిలినవి పూర్తిగా కొత్తవి, నమ్మశక్యంకానివి. కాంతిబాబు దగ్గర మాంసం తినే మొక్కలు ఇరవై రకాలున్నాయి. వాటిలో కొన్ని ప్రపంచంలో యింకెవ్వరి సేకరణలోనూ లేనివి.

వాటిలో అత్యద్భుతమైనది సన్‌డ్యూ! దాని ఆకు నూగుమీద మిలమిల మెరిసే నీటి చుక్కలున్నాయి. కాంతిబాబు ఏలకి గింజంత ఒక చిన్న మాంసం ముక్క తీసుకొని, దాన్నొక దారంతో కట్టాడు. ఆయన ఆ దారాన్ని నెమ్మదిగా ఆకు మీద వుంచినప్పుడు ఆకు మీద నూగు పైకిలేచి అత్యాశతో ఆ మాంసాన్ని అందుకోవటం మేం కళ్లారా చూశాం.

కాంతిబాబు దారాన్ని వెనక్కి లాగాడు. దాన్ని యింకా కిందికి దించితే, ఆకు

ఆ మాంసాన్ని, ఈగను వల్లో పట్టుకున్నట్టు పట్టుకుంటుందనీ, తర్వాత దాని సారమంతా పీల్చుకొని మిగిలి దాన్ని వదిలేస్తుందనీ వివరించాడు.

"మీరూ నేనూ తిన్నట్లే అది కూడ తింటుంది. ఏం తేడాలేదు - ఏమంటారు?" షెడ్డులోనుంచి మేం తోటలోకి వచ్చాం. శిరీష వృక్షపు నీడ గడ్డిమీద పొడవుగా పాకింది - అప్పుడు దాదాపు మధ్యాహ్నం 4 గంటలయింది.

"ఈ మొక్కల్లో చాలా వాటిని గురించి పుస్తకాల్లో వ్రాశారు. కాని విచిత్రమైన మొక్క వొకటి నా సేకరణలో వున్నది. దాని గురించి ఎవరూ వ్రాయలేదు. వ్రాస్తే నేనే వ్రాయాలి. ఆ మొక్కను మీరు ఇప్పుడు తప్పక చూడాలి" అన్నారు కాంతిబాబు.

మేము అతన్ని అనుసరించి వెనకాల ఫాక్టరీలా కనిపిస్తున్న షెడ్డువైపు వెళ్లాము. గట్టిగా బిగింపబడిన రేకు తలుపుతో అటూ ఇటూ రెండు కిటికీలతో వున్న షెడ్డు. కాంతిబాబు ఒక కిటికీ తెరిచి లోపలికి తొంగిచూశాడు. తర్వాత మమ్మల్ని లోపలికి వచ్చి చూడమన్నాడు. అభీ, నేనూ కిటికీలో గుండా తొంగి చూశాము. పడమటి వైపు గోడ పైభాగాన కాంతి లోపలికి రావటానికి రెండు వెంటిలేటర్లు వున్నాయి. వాటిలో నుంచి కాంతి వచ్చి గదిలో కొంత భాగానికి వెలుగునిచ్చింది. గదిలోపల నిలిచివున్నది మొక్కలగా ఏమాత్రమూ కన్పించటంలేదు. అది కీటకముల నెత్తిపై కనిపించే అనేక జ్ఞానేంద్రియములతో ఒక జంతువులాగా వుంది. నెమ్మదిగా ఆ చెట్టు మొదలు 8 లేక 10 అడుగుల ఎత్తుకు లేపటాన్ని మేము గుర్తించాం. చెట్టు మొదలు పైభాగానికి ఒక అడుగు క్రిందుగా, ఈ జ్ఞానేంద్రియాలు మొట్టుకొని వున్నాయి. వాటిలో నేను ఏడింటిని లెక్క పెట్టాను. చెట్టుమొదలు పాలిపోయినట్లు తెల్లగా నున్నగా మొత్తం అంతటా గోధుమరంగు మచ్చలతో వుంది. జ్ఞానేంద్రియాలు ఇప్పుడు వంకరగా జీవం లేనట్లున్నాయి. కాని దాన్ని చూసినప్పుడు నా వెన్నెముకలోంచి వణుకు పుట్టు కొచ్చింది. మా కళ్లు ఆ మసక వెలుతురును చూడటానికి అలవాటు పడ్డాక మరొకటి గమనించాం. గది నేలంతా ఈకలు పడి వున్నాయి. మేం అలా చలనం లేకుండా ఎంతసేపు నిలబడ్డామో తెలియదు. చివరకు కాంతిబాబు "చెట్టు ఇప్పుడు నిద్రపోతున్నది. కాని అది మేలుకునే సమయం దరిదాపు ఇదే" అన్నారు.

అభి నేలమీదనుంచి పెరుగుతుంది కాబట్టి దాన్ని చెట్టే అనాలి. లేకపోతే ఇంకేమనాలి? "అది చాలా విషయాలలో చెట్టులాగా ప్రవర్తించదని చెప్పక తప్పదు. దానికి నిఘంటువులో మరొక పేరులేదు."

"దాన్ని మీరేమని పిలుస్తారు?"

"సెప్టోపస్ బెంగాలీలో దాన్ని 'సప్తపాశ' అని పిలవవచ్చు. 'పాశ' అంటే ముడి లేక తీగ చట్రం. నాగపాశం లాంటిది."

ఇంటివైపుకు మేము తిరిగి వస్తున్నప్పుడు ఆ చెట్టును ఆయన ఎక్కడ చూశారని అడిగాను.

"మధ్య అమెరికాలో నికారగువా కొలను సమీపంలో ఒక దట్టమైన అరణ్యంలో చూశాను" అన్నాడాయన.

"దానికోసం కష్టపడి వెతక వలసి వచ్చిందా?"

ఆ ప్రాంతంలో అది పెరుగుతుందని తెలుసు. పరిశోధకుడు, వృక్షశాస్త్రజ్ఞుడైన ప్రొఫెసర్ డంకన్ పేరు విని వుండకపోవచ్చు. అవును. ఆయన మధ్య అమెరికాలో, అరుదైన మొక్కలకోసం వెతుకుతూ తన ప్రాణాలు పోగొట్టుకున్నారు. ఆయన శవం దొరకలేదు. ఆయన ఎలా చనిపోయాడో ఖచ్చితంగా ఎవరికీ తెలియదు. తన డైరీలో చివరిపేజీలో యీ చెట్టును గురించి పేర్కొన్నారు.

"అవకాశం దొరకగా నికారగువా వెళ్లాను. గౌటెమాలా దాటిన తర్వాత అక్కడి, ప్రజలీ చెట్టును గురించి మాట్లాడుకోవటం విన్నాను. వాళ్లు దాన్ని దయ్యపు చెట్టని పిలుస్తారు. తర్వాత నేను ఆ చెట్లను మరికొన్నింటిని చూశాను. ఆ చెట్లు కోతులను, అలుగల్నీ (నఖమృగాల్ని) తినటం కళ్లారా చూశాను. ఎంతో ప్రయాసపడి వెతికిన తర్వాత నాతోపాటు తీసుకు వెళ్లటానికి వీలైన చిన్న చెట్టు కనిపించింది. రెండు సంవత్సరాలలో అది ఎంత పెద్దదయిందో చూడండి."

"అది ఇప్పుడేం తింటుంది?"

"ఏది పెడితే అది. దానికోసం కొన్నిసార్లు బోనుపెట్టి ఎలుకల్ని పట్టాను - కారుక్రింద పడి చనిపోయిన కుక్కో, పిల్లో ఎక్కడైనా కనిపిస్తే యీ చెట్టుకోసం తీసుకురమ్మని ప్రయాగ్‌తో చెప్పాను. చెట్టు వాటినికూడ జీర్ణించుకున్నది. మీరూ, నేనూ, మాంసం - కోడి, మేక, ఏది తింటే దాన్నల్లా యీ చెట్టుకు పెట్టాను. కానీ ఇటీవల దీని ఆకలి చాల పెరిగిపోయింది. దీని కోరికలు నేనిక తీర్చలేకపోతున్నాను. ఇటువంటి సమయంలో అది నిద్రలేచినప్పుడు చాల అశాంతితో అల్లకల్లోలంగా వుంటుంది. నిన్న దరిదాపు ఒక ప్రమాదం జరిగింది. దానికి కోడిని తినబెట్టటం కోసం ప్రయాగ్ గదిలోకి వెళ్లాడు. దానికి ఏనుగుకు మేత పెట్టినట్లు పెట్టాలి. మొదట చెట్టు మొదట్లో మూత తీసినట్లు ఒక ద్వారం తెరుచుకుంటుంది. ఒక జ్ఞానేంద్రియంతో అది ఆహారాన్ని తీసుకుని, ఆ ద్వారం లో నుంచి లోపలికి పోనిస్తుంది. సప్తపాశంలోకి అది ప్రతిసారీ కొంత ఆహారాన్ని అందిస్తుంది. కొంతసేపటివరకూ సప్తపాశం

ప్రశాంతంగా వుంటుంది. సప్తపాశం తన జ్ఞానేంద్రియాన్ని మళ్లీ కదిలించినట్లైతే యింకా ఆకలిగా వున్నదని అర్థం.

ఇప్పటివరకూ రోజుకు రెండు కోళ్లూ లేదా ఒక చిన్న మేకా సప్తపాశానికి సరిపోతున్నాయి. నిన్నటినుంచీ ఏదో మార్పు వచ్చినట్లుంది. మామూలుగానే రెండవ కోడిని అందించగానే ప్రయాగ్ యివతలికి వచ్చాడు. జ్ఞానేంద్రియం చేసిన పెద్ద చప్పుడు వినగానే, ఏమైందో తెలుసుకోవటానికి లోపలికి వెళ్లాడు.

నేను గదిలో పత్రికకు వ్రాసుకుంటూవున్నాను. పెద్దకేక వినపడగానే అక్కడికి పరుగెత్తాను. నాకక్కడ భయంకరమైన దృశ్యం కనిపించింది. సప్తపాశపు జ్ఞానేంద్రియమొకటి ప్రయాగ్ కుడి చేతిని గట్టిగా పట్టుకొని వున్నది. ప్రయాగ్ తన బలమంతా కూడదీసుకొని, విడిపించుకోవటానికి ప్రయత్నిస్తున్నాడు. "ఏమాత్రమూ కాలం వ్యర్థం చేయకుండ కర్రతో జ్ఞానేంద్రియాన్ని గట్టిగా కొట్టాను. తర్వాత రెండు చేతులూ వుపయోగించి ప్రయాగ్‌ను గట్టిగా యివతలికి లాగి ఎలాగో అలాగు రక్షించగలిగాను. సప్తపాశం ప్రయాగ్ వంట్లో కొంత భాగాన్ని గట్టిగా పీక్కుని తన నోటిలో పెట్టుకోవటాన్ని నే కళ్లారా చూశాను. ఇది నాకు బాధకలిగిస్తున్నది."

మేము వరండాలోకి చేరుకున్నాము. కాంతిబాబు కూర్చుని తన నుదురు తుడుచుకోవటానికి ఒక చేతి రుమాలు బయటకు తీశాడు. సప్తపాశం మనిషి మాంసానికి ఆకర్షితురాలౌతుందని నేనింతవర కెన్నడూ గుర్తించలేదు. అది అత్యాశ కావచ్చు లేకపోతే ఒక విధమైన దుర్మార్గం కావచ్చు. కానీ, నిన్న జరిగినది చూసిన తరువాత దాన్ని చంపివేయటం తప్ప నాకు మరొక మార్గం కన్పించటంలేదు. నిన్న దానికి ఆహారంలో విషం కలిపి పెట్టటానికి ప్రయత్నించాను కానీ అది చాల తెలివైనది. తన జ్ఞానేంద్రియంతో ఆహారాన్ని తాకి చూసి, విసిరి అవతల పారవేసింది. దాన్ని కాల్చి చంపటం ఒకటే మార్గం. పరిమళ్ మిమ్మల్నెందుకు రమ్మన్నానో యిప్పుడు తెలిసి వుంటుంది.

కొంతసేపు ఆలోచించాను. "ఒక్క తుపాకి గుండు దాన్ని చంపగల దంటారా?" అని అడిగాను.

"అది చస్తుందో లేదో నాకు తెలియదు. దానికి మెదడున్నదని మాత్రం ఖచ్చితంగా చెప్పగలను. అది ఆలోచించగలదని చెప్పటానికి చాల నిదర్శనాలు ఉన్నాయి. దానికి దగ్గరగా నేను చాలాసార్లు వెళ్లాను కానీ అది నన్నెప్పుడు ఎదుర్కోలేదు. కుక్క యజమానిని గుర్తించినట్లు నన్ను గుర్తిస్తుంది. ప్రయాగ్ మీద విరుచుకుపడటానికి దాని కొక కారణం వుండి వుండవచ్చు. ప్రయాగ్

కొన్నిసార్లు సప్తపాశాన్ని ఏడిపించటానికి ప్రయత్నించాడు. దానిముందుకు ఆహారాన్ని తీసుకువెళ్లినట్లే వెళ్లి ఆశపెట్టి హఠాత్తుగా దూరంగా తీసుకువెళ్ళి ఏడిపించేవాడు. లేకపోతే ఆహారాన్ని దాని జ్ఞానేంద్రియందాకా తీసుకు వచ్చి హఠాత్తుగా యివతలికి లాగేసేవాడు. దానికి మెదడు వున్నది. ఎక్కడుండాలో అక్కడే వున్నది - అంటే తలలో - చెట్టు మొదలుకు పైభాగాన, జ్ఞానేంద్రియం పుట్టినచోట వున్నది. అక్కడ గురిపెట్టి కాల్చాలి."

"అది సులభం. ఒక నిముషంలో తెలుసుకోవచ్చు. పరిమళ్ నీ తుపాకీ తీసుకో" అని అభిజిత్ అన్నాడు.

"అతన్ని ఆపటానికి కాంతిబాబు చెయ్యి పైకెత్తాడు. ఎవరైనా నిద్రపోతున్నప్పుడు తుపాకితో కాలుస్తారా? పరిమళ్ మీ వేట నియమాలు యీ విషయంలో ఏమి చెపుతాయి?"

"నిద్రపోయే జంతువును చంపటం అన్ని నియమాలకు విరుద్ధమే. ముఖ్యంగా అది కదలలేకుండా వున్నప్పుడు అసలు కాల్చకూడదు. కాబట్టి కాల్చే ప్రశ్నే లేదు."

కాంతిబాబు ఫ్లాస్కు తీసుకొచ్చి టీ ఇచ్చాడు. మేం టీ తాగిన తరువాత పదిహేను నిముషాలకు సప్తపాశం మేల్కొన్నది.

కొంతసేపటి నుంచి ముందు గదిలో బాద్‌షా అశాంతితో కదులుతున్నది. కాని యిప్పుడు హఠాత్తుగా వినిపించిన వింత ధ్వనికి కదిలిపోయి, నేను అభిజిత్ ఏం జరిగిందోనని అక్కడికి పరుగెత్తాం. బాద్‌షా విడిపించుకోవటానికి గట్టి ప్రయత్నం చేస్తున్నది. అభి దాన్ని ఆపటానికి గొంతు పెంచి హెచ్చరించాడు. అంతలోనే ఒక వింతైన గుప్పుమనే వాసన గాలి అంతా నిండిపోయింది. వాసన, ఏదో పెద్దగా కొడుతున్న శబ్దమూ రేకుల షెడ్డువున్న దిక్కునుండి వచ్చాయి.

ఆ వాసన ఎలాంటిదో వర్ణించటం కష్టం. చిన్నప్పుడు టాన్సిల్ తొలగించుకోవటానికి నేనొక శస్త్రచికిత్స చేయించుకోవలసి వచ్చింది. ఈ వాసనకు శస్త్రచికిత్స చేయించుకునే ముందు ఇచ్చిన క్లోరోఫాం వాసన జ్ఞాపకం వచ్చింది. కాంతిబాబు గదిలోకి పరుగెత్తి వచ్చాడు. రండి "ఇదే సమయం"

"ఏమిటా వాసన?" అడిగాను.

"సప్తపాశం ఆహారాన్ని ఆకర్షించుకోవటానికి వదిలే వాసన యిది..."

ఆయన మాట పూర్తికాకముందే బాద్‌షా ఒక్కసారి తెగించి గట్టిగా విదిలించుకొని, కాంతిబాబును నేలమీద పడవేసి, ఆ వాసన వస్తున్న వైపుకు పరుగెత్తిపోయింది.

"అపాయం" అభిజిత్ అరుస్తూ కుక్క వెనకాల పరుగెత్తాడు.

గుండ్లు నింపిన తుపాకితో కొద్ది సెకండ్ల తరువాత రేకుల షెడ్డు చేరుకొన్నాను. అభి ఎంత ఆపుదామని ప్రయత్నించినా ఆగకుండా బాద్‌షా కిటికీలోనుంచి లోపలికి దూకి కనపడకుండాపోయింది. కాంతిబాబు, గట్టిగా వేసిన రేకు తలుపు తెరుస్తున్నప్పుడే మేము రాంపూర్ వేటకుక్క పెట్టిన చావుకేక విన్నాము. మేం లోపలికి పరుగెత్తాము. బాద్‌షాను గట్టిగా పట్టుకోవటానికి చెట్టుకు ఒక జ్ఞానేంద్రియం సరిపోలేదు. సప్తపాశం తన వలలో చిక్కిన కుక్కను గట్టిగా పట్టుకోవటానికి, ముందొక జ్ఞానేంద్రియాన్ని, తరువాత రెండవదాన్ని, తరువాత మూడవదాన్ని వరుసగా ఉపయోగించి పట్టుకొన్నది.

కాంతిబాబు మా వైపు తిరిగి "ఒక్క అడుగు కూడా ముందుకు వెయ్యవద్దు. పరిమళ్, కాల్చు!" అని అరిచాడు.

నేను గురి పెట్టబోతుండగా అభిజిత్ నన్ను ఆపాడు. అతనికి తన కుక్క అంటే ఎంత ప్రేమో గుర్తించాను. కాంతిబాబు వారిస్తున్నా వినకుండ అతను సప్తపాశం దగ్గరకు వెళ్లాడు. బాద్‌షాను పట్టుకున్న మూడు జ్ఞానేంద్రియాలలో ఒకదాన్ని పట్టు విడిపించాడు.

ఈ భయంకర దృశ్యాన్ని చూస్తున్నప్పుడు నా శరీరంలో రక్తం నీళ్లుగా మారింది. కుక్కను వదిలిపెట్టి జ్ఞానేంద్రియాలు మూడూ అభిని చుట్టుకొన్నాయి. మిగిలిన నాలుగు జ్ఞానేంద్రియాలు ఆకలిగొన్న నాలుకలతో మానవ రక్తాన్ని రుచి చూడటానికి ముందుకు చొచ్చుకు వస్తున్నాయి.

"కాల్చు, పరిమళ్, కాల్చు - అక్కడ ! అదుగో తలమీద" అని కాంతిబాబు హెచ్చరించాడు. నేను కళ్లు నిలిపి సప్తపాశం నెమ్మదిగా తన మొదటి పైభాగంలో మూతవంటి దాన్ని తెరిచి ఒక ద్వారాన్ని బయటపెట్టటం చూశాను. జ్ఞానేంద్రియాలు అభిని ఆ రంధ్రం వైపుకు తీసుకు పోతున్నాయి. అభి ముఖం తెల్లగా పాలిపోయింది. గుడ్లు వెళ్లుకొస్తున్నాయి.

అత్యంత ఆపద సమయంలో ఈ విషయాన్ని నేనింతకు ముందు కూడ గమనించాను. నా నరాలు ప్రశాంతతను పొంది, మంత్రం వేసినట్లు కదలకుండా వున్నాయి. పట్టు సడలిపోకుండా చేతులతో తుపాకీ పట్టుకొని సప్తపాశం తలమీద రెండు చుక్కల మధ్య గురి తప్పకుండా తూపాకి పేల్చాను.

రక్తం నీటి కొలనులో యంత్రం నీటిని చిమ్మినట్లు పైకెగసి పడటం కూడా జ్ఞాపకం వున్నది. హఠాత్తుగా జ్ఞానేంద్రియాలు వంకర తిరిగిపోయి అభిని విడిచిపెట్టటాన్ని చూశాను. తర్వాత వాసన హెచ్చుపెరిగిపోయి నాకు స్పృహ తప్పింది.

ఈ సంఘటన జరిగి ఇప్పటికి నాలుగు నెలలైంది. చిట్టచివరికి ఇప్పటికి నేను నా అసంపూర్ణ నవలను రచించే పనికి పూనుకున్నాను. బాద్‌షాను కాపాడటానికి వీలులేకపోయింది. అభి ఈలోగా ఒక మస్టిఫ్ కుక్కపిల్లను టిబెట్ కుక్కను సంపాదించాడు. మరొక రాంపూర్ వేట కుక్కకోసం వెతుకుతున్నాడు. అభి పక్కటి ఎముకలు రెండు విరిగాయి. రెండు నెలలు పిండి కట్టు వేశాక ఇప్పుడు కాస్త నడవ గలుగుతున్నాడు.

కాంతిబాబు నిన్న వచ్చాడు. ఆయన దగ్గరున్న మాంసం తినే మొక్కలన్నిటినీ వదిలించుకోవాలను కుంటున్నట్లు చెప్పాడు. "నేను సాధారణంగా ఇంటి పెరళ్ళలో పెంచే కూరగాయల మొక్కలు - గుమ్మడి, చిక్కుడు, వంగ - వీటిమీద పరిశోధన చేయాల"ని ఉందన్నాడు. "నాకోసం ఎంతో చేశావు. కావాలంటే నా మొక్కలు కొన్ని ఇస్తాను. నెపంథివ్ లాంటివి - కనీసం మీ ఇంట్లో పురుగులు లేకుండా పోతాయి." అన్నాడు.

"వద్దు. థ్యాంక్యూ. కావాలంటే వాటిని బయట పారవెయ్యి. ఇంట్లో పురుగుల్ని వదిలించుకోవటానికి నాకేమొక్క అక్కర్లేదు" అని చెప్పాను.

కింగ్ అండ్ కో క్యాలెండర్ వెనకాల నుంచి బల్లి ఒకటి 'అవును, అవును' అన్నది.

# సీత - నది

## రస్కిన్ బాండ్

కొండలలో పుట్టిన నది సముద్రంలో కలిసేచోట, నది మధ్యలో ఒక చిన్న దీవి వున్నది. నది దీవిని చుట్టుకొని ప్రవహిస్తూ, కొన్నిసార్లు దీవి అంచులను నీటిలో వొరుసుకుంటూ ప్రవహిస్తున్నది. ఆ ద్వీపంలో చిన్న పూరిల్లు వొకటి వుంది. కొండరాతిని తొలిచినచోట వుంది అది. దానికి మూడు పక్కల మాత్రమే మట్టిగోడలున్నాయి. నాలుగవది కొండరాయే. పైకప్పు వారి వుంది.

కొన్ని మేకలు ద్వీపంలో మొలిచిన పచ్చికను మేస్తూ తిరుగుతుంటాయి. కొన్ని కోళ్లు వాటిని వెంటనంటి తిరుగుతూ వుంటాయి. కొద్దిగా పుచ్చకాయల పాదులు, కూరగాయల మళ్లు కూడా ఉన్నాయి.

ద్వీపం మధ్యలో రావి చెట్టొకటుంది.

అది చాల పురాతనమైన చెట్టు. చాల సంవత్సరాల కిందట ఒక విత్తనం పెనుగాలికి కొట్టికొని వచ్చి, ఈ ద్వీపంలో రెండు రాళ్ళ మధ్య పడి, అక్కడే మొలకెత్తి పెరిగి పెద్దదయింది. ప్రస్తుతం ఒక చిన్న కుటుంబానికి నీడ, ఆశ్రయాన్ని యిస్తున్నది.

తాత చేపల వలను బాగుచేసుకుంటున్నాడు. నదిలో ఆయన పదేళ్లు చేపలు పట్టాడు. అనుభవశాలియైన మంచి జాలరి. నదిలో ఎక్కడ సన్నని వెండి 'చిల్వాలు', ఎక్కడ పెద్ద 'మశీర్లు', ఎక్కడెక్కడ పెద్ద మీసాలుండే 'సింఘూరాలు' పడతాయో బాగా తెలుసు. నది ఎక్కడ లోతుగా వుందో, ఎక్కడ లోతు తక్కువో కూడ బాగా తెలుసు. ఏ చేపకు ఏ ఎర వెయ్యాలో, పురుగులంటే ఏ చేపకు ఇష్టమో, పప్పులంటే వేటికి ఇష్టమో బాగా తెలుసు. కొడుక్కు చేపలు పట్టటం నేర్పాడు కాని అతను సుమారు నూరు మైళ్ల దూరాన ఉన్న నగరంలో, ఫ్యాక్టరీలో పనిచేస్తున్నాడు. తాతకు మనుమడు లేడు కాని ఒక మనుమరాలు వుంది. పేరు సీత. మగపిల్లవాడు

చేసే పనులన్నీ సీత చేస్తుంది. కొంతప్పుడు మగపిల్లవాడి కంటే కూడ బాగా చేస్తుంది. సీత చిన్నప్పుడే తల్లి చనిపోయింది. ఆడపిల్లకు నేర్పవలసిన పనులన్నీ నాయనమ్మ నేర్పింది. తాత, నాయనమ్మ లిద్దరికీ చదువు రాక పోవటాన సీతకు కూడ చదవటం వ్రాయటం రాదు.

నదికి అవతలి వొడ్డున ఒక గ్రామంలో బడి వుంది. కాని సీత ఆ బడి ఎప్పుడూ చూడనైనా లేదు. దీవిలో చేయవలసిన పనులు చాలా వున్నాయి.

తాత వల బాగుచేసుకుంటున్నప్పుడు సీత గుడిసెలో వున్నది.

నాయనమ్మకు జ్వరంతో వొళ్లు కాలిపోతున్నది. సీత నుదురు నొక్కుతున్నది. మూడురోజులనుంచి జ్వరంపడి నాయనమ్మ అన్నం తినలేదు. ఆమె కింతకుముందు జబ్బు చేసినా ఇంత ఎక్కువగా ఎప్పుడూ లేదు.

నాయనమ్మకు నిద్ర పట్టిందని గ్రహించగానే సీత నెమ్మదిగా గదిలోనుంచి బయటకు వచ్చి నిలుచున్నది.

తొలకరి మబ్బులతో ఆకాశం మసకగా వున్నది. రాత్రంతా వర్షం కురిసింది. మరికొద్ది గంటలలో మళ్లీ వర్షం కురిసేటట్లున్నది. తొలకరి వానలు ఆ సంవత్సరం తొందరగా జూన్ నెల చివరకే వచ్చాయి. ఇప్పుడు జూలై నెల చివరి రోజులు. నది ఇప్పటికే పొంగి ప్రవహిస్తున్నది. ఉరవళ్లు పరవళ్లు తొక్కే నది కెరటాల చప్పుడు దగ్గరగా వుండి ఎప్పటికన్నా ఇబ్బందిగా వున్నది.

సీత తాత దగ్గరగా వెళ్లి రావిచెట్టు కింద ప్రక్కన కూర్చున్నది.

"ఆకలైతే చెప్పు. రొట్టె తయారు చేస్తాను" అన్నది.

"మీ నాయనమ్మ నిద్రపోయిందా?"

"ఆ నిద్రపోయింది. నాయనమ్మకు నొప్పి ఎక్కువగా వుంది. తొందరగానే లేస్తుంది." ముసలాయన నదివైపు, పచ్చని దట్టమైన అడవి వైపు నీలాకాశం వైపు తేరిపారజూశాడు. "రేపు ఆమెకు నయం కాకపోతే షాగంజ్‌లో వున్న ఆస్పత్రికి తీసుకు వెళతాను. ఆమె జబ్బు నయం చేయటం వాళ్లకు తెలుసు. కొద్ది రోజులపాటు నువొక్కదానివే వుండాలి" అన్నాడు.

సీత దిగులుగా తల వూపింది. నాయనమ్మకు జబ్బు తగ్గాలని కోరుకుంది. నదిలో ప్రవాహం ఉరవడిగా వున్నప్పుడు చిన్న పడవతో నదిని దాటటంలో తాతకు నేర్పు వున్నదని సీతకి తెలుసు. ఎవరో వొకరుండి తమ కున్న కొద్ది ఆస్తిపాస్తుల్ని జాగ్రత్తగా చూసుకోవాలి.

వొంటరిగా వుండేందుకు సీతకు భయంలేదు. కాని నదికేసి చూడాలంటే జంకుగా వున్నది. ఆ రోజు ఉదయం నీళ్లు తీసుకురావటానికి వెళ్లినప్పుడు నదిలో నీటిమట్టం పెరగటం చూసింది. కొండరాళ్ల మీద నీటి పక్షులు వేసిన రెట్టలు హఠాత్తుగా మాయమయ్యాయి.

"తాతా! నది పొంగితే నేనేం చెయ్యాలి?"

"మెరక మీదికి వెళ్లాలి."

"మెరక మీదికి కూడ నీళ్లు వస్తే?"

"కోళ్లను గుడిసెలోకి తీసుకువెళ్లి, అక్కడేవుండు."

"నీళ్లు గుడిసెలోకి కూడ వస్తే?"

"రావిచెట్టు ఎక్కికూచో. అది చాల గట్టి చెట్టు. పడిపోదు. నీళ్లు అంత పైకి రాలేవు."

"మేకల నేం చెయ్యాలి తాతా?"

"నాతోపాటు తీసుకుపోతున్నాను. వాటిని అమ్మవలసి వస్తుంది. నాయనమ్మకు మందులకు, ఆహారానికి డబ్బు కావాలిగదా! అవసరమైతే కోళ్లను ఇంటికప్పుమీదికెక్కించు. కాని ఎక్కువ దిగులు పెట్టుకోవద్దు." అన్నాడు. సీత తల నిమిరి "నీరు అంత ఎత్తు రాదమ్మా!" అన్నాడు.

ఆ రోజు సాయంత్రం మళ్లీ వర్షం మొదలైంది. నది కెరటాల మీద పెద్ద పెద్ద చినుకులు పడుతున్నాయి. కాని ఆ వర్షం హాయిగా అనిపించింది. సీత వానలో అటూ ఇటూ తిరిగింది. వానకు తడిసి పోతానని భయం లేకపోగా చాల ఆనందంగా కూడ అనిపించిందామెకు. ఇంట్లో వెచ్చగా వుంది. ఆమె పల్చటి దుస్తులు పొయ్యి సెగకు ఆరిపోయాయి.

కుండపోతగా కురుస్తున్న వానలో ఆమె కోళ్లను గుడిసెలోకి తీసుకు వెళుతూ అటూ ఇటూ తిరిగింది. నిరపాయకరమైన ఒక గోదుమ వన్నెపాము కలుగులోంచి బయటకు వచ్చింది. సీత ఒక కర్రతో పామును ఎత్తి రాళ్ల గుట్టల్లో పడవేసింది. పాములతో ఏ చిక్కులేవు. అవి కప్పలు, ఎలుకలు లేకుండ చేశాయి.

సీత లోపలికి వెళ్లే సరికి ఆకలేసింది. పప్పుకూర తిని మేకపాలు వేడిచేసుకొని, తాగింది.

నాయనమ్మ ఒకసారి లేచి, మంచినీళ్లు కావాలని అడిగింది. తాత ఇత్తడి గ్లాసుతో ఆమె నోటికి మంచినీళ్లందించాడు.

రాత్రంతా వాన కురిసింది.

కప్పులో చిల్లుల నుంచి నీరు కారుతున్నది. నేలమీద చిన్న నీటిపడియ యేర్పడింది. తాత కిరోసిన్ దీపం వెలిగించాడు. దీపం అవసరం లేకపోయినా కాస్త ధైర్యం కలిగింది.

నది కెరటాల రొద ఎప్పుడూ వుండేదే, వాళ్లు దాన్నెప్పుడూ పట్టించుకోలేదు. కాని ఆ రాత్రి నది కెరటాల చప్పుడులో తేడాను వాళ్లు గుర్తించారు. మూలుగులాంటి ఒక చప్పుడు చెట్లకొమ్మలలో హోరుమనే ధ్వని, నీటి కెరటాలు రాళ్లను తాకి, ముత్యాలను వెదజల్లుతున్నట్లు నురగ పారటాన్ని వాళ్లు గమనించారు. కొంతప్పుడు మట్టిపెళ్ళలు విరిగి నీటిలో కలిసి పోతున్న పెద్ద చప్పుడు వినిపించింది.

సీతకు నిద్ర పట్టలేదు.

తెల్లవారి వెలుతురు రాగనే లేచి బయటకు వెళ్లింది. వాన ఎక్కువగా కురవటం లేదు కాని జల్లు పడుతున్నది. జల్లుపడే తీరు చూస్తే రోజుల తరబడి కురిసే ముసురనిపిస్తున్నది. నదిమొదలైన చోట కొండల్లో పెద్దవర్షం కురిసి జల్లులుగా యిక్కడ పడుతున్నట్లు వుంది.

సీత నీటి అంచుల దాకా వెళ్లింది. ప్రియమైన రాతిబండ కన్పించలేదు. ఆ బండమీద తరుచు కూర్చొని, నీటిలో కాళ్లాడిస్తూ, చిన్న చిల్వ చేపలు యీదడాన్ని చూస్తుండేది.

బండ అక్కడే వున్నది' కాని దాని మీద నది పొంగి పొరలి ప్రవహిస్తున్నది.

ఇసుక తిన్నెమీద నిలబడి పాదాలను వొరుసుకుంటూ, చుట్టూ ప్రవహించే నీటి తాకిడిని గమనించసాగింది.

తాత పడవను నెట్టుకుంటూ వెళ్లేటప్పటికి కాస్త పొద్దెక్కింది. పడవ ముందరి భాగంలో నాయనమ్మ పడుకొనివుంది. అతి కష్టంమీద సీతవైపు కళ్లు తెరిచి చూసి, మాట్లాడటానికి ప్రయత్నించింది. కాని మాటలు రాలేదు. చేయెత్తి దీవించింది.

సీత వొంగి నాయనమ్మ పాదాలు తాకింది. తర్వాత తాత పడవ నెట్టుకు పోయాడు. చిన్నపడవ - ఇద్దరు ముసలివాళ్లతో, మూడు మేకలతో నదిమీద చకచకా కదులుతూ అవతలి వొడ్డుకు ప్రయాణమైంది.

నీటిమీద క్రమక్రమంగా చిన్నదిగా యింకా చిన్నదిగా పెద్దనదిమీద చిన్న చుక్కగా కనిపించి కదిలిపోయింది.

సీత వొంటరిదై పోయింది.

పెద్ద గాలి వీచి నీటి చుక్కలామె ముఖానికి కొరడా దెబ్బల్లా తగిలాయి. ద్వీపాన్ని ముంచెత్తు తున్నట్లు నీరు పొంగసాగింది. దూరంగా అవతలి వొడ్డు వానలో అస్పష్టంగా కనిపించసాగింది. ఒక చిన్న గుడిసె అక్కడొక చెట్టు మాత్రమే వున్నాయి.

సీత పని ప్రారంభించింది. కోడిపెట్టలకు మేత వెయ్యాలి. వాటికి మేత ధ్యాసతప్ప యింకేమీ అక్కరలేదు. నూకల్ని, బంగాళాదుంప తొక్కల్ని, వేరు సెనగ పొట్టును గుప్పెళ్లతో వాటి ముందు చల్లింది.

తర్వాత చీపురు తీసుకొని గుడిసె చిమ్మింది. పొయ్యి వెలిగించి పాలు కాచింది. "రేపు పాలుండవు" అనుకున్నది.

కొండలమీద నుంచి ఉరుము ఉరిమి పడింది పెళపెళ - పెళపెళా!

సీత ఎక్కువసేపు ఇంట్లో వుండలేక పోయింది. బయటకు వెళ్లి, నది వైపు చూసింది. నది యిప్పుడు విశాలంగా మైదాన ప్రదేశాన్ని కులపుకొని పారుతోంది. దూరాన కాపరులు నీళ్లలో నుంచి గొఱ్ఱెల్ని తోలుతూ, వరద ముంపులో వున్న పొలాల్లో నుంచి తమ వస్తువుల్ని మూటకట్టుకొని తలపైనా, బుజాలపైనా మోసుకొంటూ మెరక మీద వున్న యిళ్లకు వెళుతున్నారు.

ఎక్కడ చూసినా నీరే. ప్రపంచమంతా ఒక పెద్ద నదిలాగ మారిపోయింది. ఆవలి వొడ్డు మీద వుండే చెట్లుకూడ నీళ్లలో నుంచి మొలిచిన రావి చెట్లలాగ కనిపిస్తున్నాయి.

సీత భయపడినంతా జరిగింది. కొద్దిసేపటికి తర్వాత పెద్ద దుంగలు చిన్నచెట్లు, పొదలు నీటిమీద దీవిలో తేలుతూ రావటాన్ని గమనించింది.

అన్నం వొండుకోవాలనుకుంది. బయట చూస్తే రాళ్లమధ్య నీటి మడుగులు కనిపించాయి. అది వర్షపునీరో, నది పొంగి పొరలిన నీరో తెలియలేదు. చటుక్కున ఒక ఆలోచన వచ్చింది.

గదిలో ఒక మూల పెద్ద సత్తుపెట్టె వుంది. అది సీత తల్లిది. పనికొచ్చే వస్తువులు, విలువైన వాటిని ఆ పెట్టినిండా పెడితే నది పొంగి ద్వీపం మీదికి వచ్చినప్పటికీ పెట్టె నీళ్లల్లో కొట్టుకుపోకుండ వుంటుందని అనుకుంది.

తాత హుక్కా పెట్టెలో పెట్టింది. నాయనమ్మ చేతికర్రను కూడ పెట్టెలో పెట్టింది. ఇంకా కొన్ని చిన్న పప్పులు, దినుసుల డబ్బాలు కూడ పెట్టింది. సీత కొన్ని గంటలసేపు చెట్టుమీద ఉండి పోవలసి వచ్చినా కిందికి దిగి వచ్చాక ఇంట్లో

తినటాని కేమయినా మిగులుతుంది!

సీత పెట్టె సర్దటంలో పడి చల్లటినీళ్లు కాలిదాకా వచ్చినా పట్టించుకోలేదు. పెట్టెకు తాళం వేసి, ఎత్తుగా, రాతిగోడకున్న చిన్న రంధ్రంలో చెవిని పెట్టింది. అప్పటికి తాను నీళ్లలో నడుస్తున్నట్లు తెలుసుకున్నది.

వాకిట్లోనుంచి నీరు గదిలోకి తోసుకు వస్తున్నది. నీటిని చూసి భయంతో ఆమె కదలకుండ నిలబడింది.

సీత మిగిలిన సంగతులన్నీ మరచిపోయింది. గుడిసెలో నుంచి బయట పడటానికి రావిచెట్టు వైపుకు తొందరగా పరుగు తీసింది. గుర్తుగా అక్కడ చెట్టు లేకపోతే నదిలోకి పరుగెత్తేదే!

గబగబ చెట్టెక్కి గట్టి కొమ్మల మీదికి వెళ్లి, ఒక కొమ్మమీద భద్రంగా కూర్చున్నది. కళ్ల ముందు పడిన తడిజుట్టును పైకి తీసుకుంది.

వేగంగా వచ్చినందుకు చాల సంతోషించింది. గుడిసె చుట్టూ నీళ్లొచ్చేశాయి. దీవిలో మెరకతట్టు మాత్రమే కనిపిస్తున్నది. కొద్దిగా రాళ్లు, ఒక పెద్దకొండ దానిలో తొలిచినట్టున్నచోట కట్టిన గుడిసె, కొన్ని పొదలు, పెరిగిన కొండచరును, యివి మాత్రమే కనిపిస్తున్నాయి.

కోళ్లు, గుడిసె విడిచి పెట్టిపోయే ప్రయత్నమేమీ చేయలేదు. బహుశా కర్రల మంచం మీద పడుకున్నాయేమో!

సాధారణంగా నీటిమీద కనిపించని వింత వస్తువులు - అల్యూమినియం కెటిల్, పేముకుర్చీ, పళ్లపొడి డబ్బా, ఖాళీ సిగరెట్టుపెట్టె, పావుకోళ్లు, ప్లాస్టిక్ బొమ్మ - తేలి వస్తున్నాయి.

నీరిప్పుడు బాగా పైకి వచ్చేసింది. ద్వీపం కనిపించకుండ పోతున్నది.

గుడిసెలో నుంచి ఏదో తేలుతూ వచ్చింది. అది ఖాళీ కిరసనాయిలు డబ్బా. దాని మీద కోడిపెట్ట ఒకటి ఎక్కి తేలి వస్తున్నది. ఆ డబ్బా నీటిమీద తేలుతూ, చెట్టు దగ్గరగా వచ్చి, ప్రవాహంలో పడి నదివైపు కొట్టుకుపోయింది. కోడిపెట్ట అప్పటికి నిలదొక్కుకో గలిగింది.

కొద్దిసేపయ్యాక నీళ్లు మంచందాకా వచ్చాయి కాబోలు, కోడిపెట్టలు బయటపడి, రాతి తిన్నె మీదికి ఎగిరి, అక్కడ కొద్ది ఖాళీస్థలంలో కూర్చున్నాయి.

సీత ఇంకా కొంచెం పైకెగబాకింది. ఆమె చెట్టు మీదికి పాకుతూవుండగా ఒక నల్లని అడవికాకి పై కొమ్మల మీద స్తిమితంగా కూర్చొని వున్నది. కొమ్మల

మధ్య ఒక గూడును చూసింది. అది కాకి గూడు. అది ఒక కొమ్మ చీలికలో చిందరవందరగా పేర్చిన గూడు.

గూటిలో నీలం ఆకుపచ్చ రంగు కలిసిన చిన్న చుక్కలున్న నాలుగు గుడ్లున్నాయి. కాకి ఆ గుడ్లమీద కూర్చొని కావు కావుమని అసహనంతో అరిచింది. కాకి అవస్థ ఘోరంగా వున్నప్పటికీ, అది అక్కడ వుండటం సీతకు కాస్త సంతోషం కలిగించింది. కనీసం తాను ఒంటరిది కాదు. ఎవ్వరూ తోడు లేకపోవటం కన్నా కాకి తోడున్నా నయమే!

గుడిసెలో నుంచి మరికొన్ని వస్తువులు - ఒక పెద్ద గుమ్మడికాయ, ఒక ఎర్రటి తలపాగా - తాతయ్యది, నీటి మీద పెద్ద పాములాగా పరుచుకునివున్నది. కొట్టుకు వచ్చాయి.

చెట్టు గాలికీ వానకీ కదిలిపోయింది. కాకి 'కావుకావు'మని అరిచి పైకెగిరింది. చెట్టుచుట్టూ కొద్దిసార్లు తిరిగి గూటికి చేరుకొన్నది. సీత కొమ్మను గట్టిగా పట్టుకొని దానికి అతుక్కుపోయింది.

చెట్టు నిలువెల్లా కదిలిపోయింది. సీత కది భూకంపంలాగ తోచింది.

నది ఆమె చుట్టూ సుళ్లు తిరుగుతూ ప్రవహిస్తున్నది. దరిదాపది గుడిసె కప్పు దాకా వచ్చింది. మట్టిగోడ కదిలి, కన్పించకుండ నీటిలో కలిసిపోయింది. పెద్ద కొండరాయి, దూరాన కొద్ది చెట్లు తప్ప ఎక్కడ చూసినా నీరే!

ఆ పెద్ద రావిచెట్టు కదిలిపోయింది. దాని పొడవైన వంపులు తిరిగిన వేళ్లు నేలలో గట్టిగా దిగబడివున్నాయి. కాని నేల నెమ్మదిగా మెత్తబడిపోతున్నది. రాళ్లు కొట్టుకు పోతున్నాయి. వేళ్లు త్వరగా తమ పట్టు కోల్పోతున్నాయి.

ఏదో కీడు మూడిందని కాకికి తెలిసినట్లుంది - అది పైకెగురుతున్నది. చెట్టు చుట్టూ తిరుగుతున్నది. కాని చెట్టు మీద వుండటమా ఎటైనా ఎగిరిపోవడమా పాలుపోవటం లేదు.

సీత వేసుకున్న సన్నని నూలు దుస్తులు తడిసిపోయి సన్నని వొంటికి అతుక్కుపోయాయి. వాన నీళ్లు నల్లటి పొడవైన జుట్టునుండి కారుతున్నాయి. చెట్టులో ప్రతి ఆకునుంచి వాన కురువ సాగింది. కాకి కూడ బాగా తడిసి ముద్దయిపోయింది.

అడుగుభాగంలో మట్టి కరిగిపోయి చెట్టుబాగా కదిలిపోయింది. చెట్టు కదిలి అటూ ఇటూ ఊగి నెమ్మదిగా ముందుకు వాలింది. పక్కలకు అటూఇటూ

వొరిగి నేలలో పాతుకున్న వేళ్లను లాక్కుంటున్నట్లు కదిలింది. ఆ తర్వాత వొరిగి ప్రవాహంలో కలిసిపోయింది.

* * *

కొమ్మలు కదిలిపోయాయి గాని సీత తన పట్టు వదల్లేదు. నీరు బాగా దగ్గరకు వచ్చేసింది. సీతకి భయం వేసింది. వరద ఎంత ఎక్కువగా వున్నదో! నది ఎంత విశాలంగా వున్నదో చూడలేకపోయింది. వెంటనే రాబోయే ప్రమాదాన్ని మాత్రం గ్రహించింది. నీళ్లు ఆమెను చుట్టుముట్టి వున్నాయి.

కాకి చెట్టుచుట్టూ ఎగర సాగింది. దానికి చాల కోపంగా వున్నది. దాని గూడు యింకా చెట్టుకొమ్మల్లోనే వున్నది. ఇంతలో చెట్టు కదిలిపోయి, వంపు తిరిగి ఒక పక్కకు వొరిగి గూడు నీళ్లలో పడిపోయింది. గుడ్లు ఒక్కొక్కటే పడిపోవటాన్ని సీత చూసింది.

కాకి కిందకు వాలి నీటి మీద తిరగసాగింది. కాని అది చేయగలిగిందేమీ లేకపోయింది. కొద్ది క్షణాల్లో గూడు మాయమయింది.

కాకి చెట్టువెంట ఓ యాభై గజాలు ఎగురూ వెళ్లింది. బహుశా యింకా ఏదో ఆశ వుంది కాబోలు! తర్వాత రెక్కలు టపటపలాడిస్తూ ఎత్తుగా గాలిలోకి ఎగిరింది. నది మీదుగా దూరంగా చూపుకు అందకుండ ఎగిరిపోయింది.

సీత మరొకసారి ఒంటరిదయింది. ఒంటరితనాన్ని గురించి ఆలోచించే సమయం కూడ లేదు. అంతా కదిలి పోతున్నది. పైకి కిందకి పక్కకు ముందుకు తొందరలోనే చెట్టు కుడి పక్కకు వొరిగి పోతుంది. తను నీటిలో పడిపోతుందనిపించింది సీతకి.

దూరాన వరదలో మునిగిన ఒక పల్లె కనిపించింది. తెప్పకొయ్య మీద జనం కదిలిపోతున్నారు. కాని వాళ్ళు చాల దూరాన వున్నారు.

చెట్టు బాగా పెద్దది కావటాన నదిలో తొందరగా కొట్టుకు పోవటంలేదు. లోతు తక్కువగా వున్నచోట అది ఆగిపోతున్నది. దాని వేళ్లు రాళ్లలో చిక్కుకొంటున్నాయి. కాని ఆ విధంగా ఎక్కువసేపు జరగలేదు. నది వురవడి దాన్ని తీసుకుపోయింది.

నది వంపుతిరిగిన ఒకచోట ఒక ఇసుకదిబ్బను తట్టుకొని చెట్టు నిలిచిపోయింది.

సీతకు చాలా అలసటగా వున్నది. చేతులు నొప్పి పెదుతున్నాయి. చెట్టు దరిదాపు పక్కకు తిరిగినప్పుడు పడిపోకుండ గట్టిగా కొమ్మను పట్టుకోవలసి వచ్చింది. అదిగాక యింకా వానపడుతున్నది.

అప్పుడు సీతకి తన నెవరో పిలుస్తున్నట్లు అనిపించింది.

దూరంగా నదివైపు చూసింది. ఒక చిన్న పడవ తన వైపు రావటం గమనించింది.

ఆ పడవలో ఒక అబ్బాయి వున్నాడు. పడవను చెట్టు దగ్గరగా తీసుకు వచ్చి ఒక చేత్తో కొమ్మను పట్టుకొని రెండవ చేతిని సీతకు అందించాడు.

ఆ చేతిని అందుకొని సీత పడవలో అతని పక్కకు చేర్చుకొన్నది. అతను చెట్టుమొదలుకు పాదాన్ని తన్నిపట్టి దూరంగా పడవను నెట్టివేశాడు.

ఆ చిన్న పడవ నదిలో వేగంగా కదిలిపోసాగింది. పెద్ద చెట్టు బాగా వెనక బడిపోయింది. సీత దాన్ని ఆ తర్వాత యింక చూడనేలేదు.

పడవలో కదలకుండ పడుకున్నది. మాట్లాడటానికి ఎంతో భయపడింది. అబ్బాయి ఆమె వైపు చూశాడు కాని ఏమీ మాట్లాడలేదు. పలకరింపుగా నవ్వనైనాలేదు. తెడ్లమీద ఆనుకొని నెమ్మదిగా కదిలిస్తూ నది మధ్యలోకి వెళ్లకుండ దాన్ని నడిపించసాగాడు. నది వురవడిలో తట్టుకొని, పడవ నడిపించగల బలశాలి కాదతను. కాని ప్రయత్నిస్తూనే వున్నాడు.

"నువు దీవిలో వుంటావా?" తెడ్లమీద వొరిగి పడవను నెమ్మదిగా మల్లిస్తూ అడిగాడతను. అప్పటికి నదిలో కాస్త విశాలమైన సమతలమైన ప్రదేశాన్ని చేరు కున్నాడతను. "నిన్నింతకుముందు చూశాను. కాని మిగిలిన వాళ్లేరీ?" అని అడిగాడు.

"మా నాయనమ్మకు జబ్బు. తాత ఆమెను షాగంజ్ ఆస్పత్రికి తీసుకు వెళ్లాడు."

"నువ్వెక్క డుంటావ్?" అడిగింది. సీత అతన్ని అంతకు ముందెప్పుడూ చూడలేదు.

"కొండ కింద పల్లెలో వుంటాను. పల్లెను వరద ముంచి వేసిందని చెప్పటానికి పడవమీద బయలుదేరి నదిని దాటటానికి ప్రయత్నిస్తున్నాను. కాని నీటి వురవడి, మరీ బలంగా హెచ్చుగా వుండటంవల్ల మీ దీవి వైపు కిందికి కొట్టుకు వచ్చాను. నదికి ఎదురీదలేం. అది మనల్ని ఎటు తీసుకుపోతే అటు పోవలసిందే!"

అతనొక తెడ్డును లోపలికి తీసుకు వచ్చాడు. ఖాళీగా వున్న చేతిని 'సీటు' కిందికి పోనిచ్చాడు. అక్కడొక చిన్న బుట్ట వున్నది. దాన్లోంచి రెండు మామిడిపళ్లు తీసి సీత కొకటి యిచ్చాడు.

బాగా పండిన కండగల మామిడి పళ్లు. లోతుగా కొరికి తోలుతీసివేసి తినసాగారు. తియ్యని రసం వాళ్ల కిందికి కారసాగింది. పండు రుచి సువాసన దివ్యంగా వున్నాయి. ఏడాదికి పైగా సీత మామిడిపండు రుచి చూడలేదు. కొద్దిసేపు

నది సంగతి మరచిపోయింది. ధ్యాసంతా మామిడిపండు మీదే!

పడవ వొరిగింది కాని మరీ అంత ఎక్కువగా కాదు. కొండ కిందనుంచి చాల దూరం వచ్చేశారు. నది తన శక్తిని, తీవ్రతను చాలవరకు కోల్పోయింది.

నా పేరు 'క్రిషన్'. మా దగ్గిర చాలా ఆవులు, గేదెలు వున్నాయి. కాని అవి చాలవరకు వరదలో కొట్టుకు పోయాయి.

"నీవు బడికి వెళతా వనుకుంటాను" అడిగింది సీత.

"అవును. నేను మా వూరికి కొద్ది దూరంలో బడి వున్నది. నువ్వు కూడ బడికి వెళ్లాలా?"

"లేదు, ఇంట్లో చాల పని వుంటుంది"

ఇంట్లో వుండాలని కోరుకొని ప్రయోజనం లేదు. ఇంక ఇల్లనేది లేదు.

"చెట్లను చేరుకోవటానికి ప్రయత్నిస్తాను. నది మీద రాత్రంతా వుండాలని లేదు గదా!" అన్నాడతను.

పడవను చెట్ల వైపు పట్టించాడు. పది నిముషాల పాటు కష్టపడి తెడ్లు వేశాక నదిలో వొక వొంపుకు చేరుకొని, నదిలో తీవ్రమైన వురవడిని తప్పించగలిగాడు.

త్వరలోనే వాళ్లు వొక అడవిని చేరుకున్నారు. పొడవైన పచ్చని చెట్లకింద తిరగసాగారు. "పడవను వొక చెట్టుకు కట్టేద్దాం. తరువాత విశ్రాంతి తీసుకోవచ్చు. రేపు అడవిలో నుంచి బయటపడే త్రోవ చూడవచ్చు" అన్నాడు.

క్రిషన్ పడవ లోపలనుంచి పెద్ద తాడుతీసి, ఒక కొసను పడవ వెనక కొసకు బిగించి, రెండవ కొసను నీటికి కొద్ది ఎత్తున వొంగి వున్న పెద్ద కొమ్మ వైపు విసిరాడు. చెట్టు మొదలుకు చిక్కుకొని పడవ కదలకుండ నిలిచింది.

ఆ రాత్రి అడవి జంతువులు కదలసాగాయి. జంతువులు కలుగుల్లో నుంచి, గుహల్లో నుంచి, తొర్రల్లో నుంచి వరదకు బయటపడి, ఆశ్రయం కోసం పొడిగా వుండే చోటు కోసం చూడసాగేయి. సీత, క్రిషన్ నీటిమీద ఒక పెద్ద పాము తమవైపు రావటం చూశారు. అది పడవలోకి వస్తుందేమోనని సీత భయపడింది. కాని అది నీటిమీద తల పైకెత్తుకొని, పొడవైన తన శరీరాన్ని కదుల్చుకుంటూ, వాళ్ల పక్కగా వచ్చి నీడలలో కలిసిపోయింది.

ఒక పెద్ద దుప్పి నీటిని చీల్చుకుంటూ వచ్చింది. అది యీద నవసరం లేదు. చాల పెద్దది కావటాన తలా, కొమ్ములూ నీటిపైకే వున్నాయి. దాని కొమ్ములు పెద్దవిగా అందంగా వున్నాయి.

"ఇంకా కొన్ని జంతువులుంటాయి. పులి కూడా వుండొచ్చు. మనం చెట్టెక్కుదామా?" అన్నది సీత.

"పడవలో క్షేమంగా వున్నాం. నిద్రపో నేను కాపలా వుంటాను." అన్నాడు క్రిషన్.

సీత కళ్లు మూసుకొన్నది. పడవను తాకుతున్న కెరటాల చప్పుడు జోల పాడినట్లు వినిపిస్తుండగా నిద్రపట్టింది. ఒక వింత పక్షి ఏదో అరచినట్లు విన్పించగానే ఆమె ఒకసారి మేల్కొన్నది. ప్రక్కకు తిరిగి లేచింది. కాని క్రిషన్ మేలుకొని పడవముందర కూర్చొని, ఆమెకేమీ భయం లేదన్నట్లు చిరునవ్వు నవ్వాడు. క్రిషన్ పడవలో పడుకొని నిద్రపోయాడు. ఒక ఆకు రాలి అతని ముఖంమీద పడింది కాని మెలకువ రాలేదు. ఆ ఆకు అతని చెక్కిలి మీద కదలకుండా ఉండిపోయింది.

కాస్సేపటికి అతను లేచాడు. ఆవులించి, వొళ్లు విరిచి, విదిలించుకొని సీత పక్కన వచ్చి కూర్చున్నాడు.

"నీటి మట్టం యింక పెరగలేదు. కాని నాకు ఆకలిగా వుంది" అన్నాడు.

"నాకు కూడ" అన్నది సీత.

"మిగిలిన మామిడిపళ్లు" అని అతను బుట్ట ఖాళీ చేసి రెండు మామిడిపళ్లు తీశాడు. తినటం పూర్తయ్యాక క్రిషన్ పడవ ముడి తీశాడు. గంటసేపు వెల్లువ పారిన అడవిలో వానకు తడిసిన చెట్ల కిందుగా పడవను నడిపించాడు. ఒక్కోసారి పడవ తెడ్లతో కొమ్మల్ని, పుడకల్ని అడ్డు తొలగించుకోవలసి వచ్చింది. సగం మునిగిపోయిన పొదలు కొన్నిసార్లు వాళ్లకు అడ్డువచ్చాయి. కాని మధ్యాహ్నానికల్లా వాళ్లు అడవిని దాటారు.

మెరకమీద దూరంగా ఒక పల్లెను చూశారు. వెల్లువ వేసిన పొలాల మీద పడవను నడుపుతున్నప్పుడు నీటి లోతు తగ్గింది.

పల్లెప్రజలు వాళ్లకు ఎంతో సహాయం చేశారు. అన్నంపెట్టి తల దాచుకొనే చోటిచ్చారు. సీత, తన తాత నాయనమ్మల కోసం ఆతృత పడింది. షాగంజ్‌లో పనివున్న ఒక ముసలిరైతు సీతని తనతో తీసుకుపోతానన్నాడు. క్రిషన్‌కూడ తోడువస్తాడని ఆశపడింది గాని, అతను పల్లెలోనే వేచి వుంటానన్నాడు. ఇతరులు కూడ అక్కడికి చేరుకుంటారనీ- వాళ్లలో తన వాళ్లుకూడ వుంటారన్నాడు.

"ఇక నీకేం పరవాలేదు. త్వరలోనే తాతను కలుసుకుంటావు. రెండు మూడు రోజులలో నీరు తగ్గిపోతుంది. దీవికి వెళ్లిపోవచ్చు" అన్నాడు.

"అక్కడ దీవి వుంటే గదా!" సందేహించింది సీత.

సీత ఎడ్లబండి ఎక్కగానే క్రిషన్ ఒక పిల్లనగ్రోవి యిచ్చాడు.

"ఇదివుంచు, దాని కోసం ఎప్పుడైనా వస్తాను" అన్నాడు. సీత కొంచెం వెనకాడుతుంటే "ఇది చాల మంచి పిల్లనగోవి"అని కూడ అన్నాడతను.

* * *

ఎడ్లబండిలో ప్రయాణం నెమ్మదిగా సాగుతోంది. పల్లెటి బాటలు కనిపించకుండ పోయాయి. బండి చక్రాలు బురదలో కూరుకుపోయాయి. రైతు, అతని పెద్దకొడుకు, సీత కలిసి బండి దిగి కొయ్యచక్రాలను బురదలో నుంచి నెట్టి రోడ్డుకు చేర్చవలసి వచ్చింది. ఎడ్లకి బాగా బురద అతుక్కుంది. సీత కాళ్లకు బురద అదుసులుగా అతుక్కుపోయింది.

ఒక పగలు, ఒక రాత్రి ఎడ్లబండిలో ప్రయాణం చేసి షాగంజ్ చేరుకున్నారు. రద్దీగావున్న ఇరుకు బజారుగుండా నడుస్తున్న సీతని గుర్తుపట్టటం కూడ కష్టమే అయింది.

తాత సీతని గుర్తుపట్టలేదు. రోడ్డుమీద సూటిగా నడుస్తూపోతున్న తాత, మురికిగా, గుర్తుపట్టలేని సీతని దాటి పొయ్యేవాడే. అతని సన్నని వణుకుతున్నకాళ్లను, చుట్టుకొని కౌగలించుకొని, సీత ఆపకపోతే తాత ముందుకి వెళ్లిపోయేవాడు.

కాస్త స్తిమిత పడ్డాక ఊపిరి తీసుకొని "సీతా!" అని పిలిచాడు. "ఇక్కడి కెలా వచ్చావ్? దీవి నెందుకు వదిలి వచ్చావు? ఎలా రాగలిగావు? నాకు చాల దిగులుగా వుంది - రెండురోజుల నుంచీ ప్రమాదంగా వుందిగదా!" అన్నాడు.

"నాయనమ్మ?" అడిగింది సీత.

అడిగిందేగాని నాయనమ్మ యిక తమతో లేదని తెలుసు. శూన్యమైన తాత చూపులే ఆమెకు అన్నీ సంగతులూ చెప్పాయి. ఆమెకు ఏడవాలనిపించింది - నాయనమ్మ కోసం కాదు. ఆమెకిక ఏ బాధాలేదు కాని తాత తోడులేక దిక్కులేని వాడయ్యాడు. కాని కన్నీళ్లు ఆపుకొని తాత వణుకుతున్న చేతిని పట్టుకొని, రద్దీగా వున్న వీధిలో నుంచి పక్కకు తీసుకొచ్చింది. ఇక ముందు తాత తన భుజాలమీద భారం వేసి నడవాలని సీతకి తెలుసు.

కొద్దిరోజుల తర్వాత వాళ్లు దీవికి తిరిగి వచ్చారు. అప్పటికే వరద తగ్గింది. ఇంకా వర్షం కురిసింది. జరగవలసిన ఘోరం జరిగిపోయింది. తాతకేంకా రెండు మేకలు మిగిలాయి. ఒక మేక కంటే ఎక్కువ అమ్మవలసిన అవసరం లేకపోయింది.

రావిచెట్టు దీవిలోనుంచి కనపడకుండ పోయిందంటే ఆయన తన కళ్లను తానే నమ్మలేకపోయాడు - దీవిలో కొండరాళ్లలాగే చెట్టుకూడ స్థిరంగా వుండిపోతుందనుకున్నాడు. నది లాగే ఆ చెట్టుకూడ వాళ్ల జీవితంలో 'ఒక భాగమైపోయింది. సీత తప్పించుకోవటం ఆయనకు అద్భుతంగా తోచింది.

"ఆ చెట్టే నిన్ను కాపాడింది" అన్నాడాయన.

"ఆ అబ్బాయి కూడ" అన్నది సీత.

సీత ఆ అబ్బాయిని తలచుకొని మళ్లీ అతన్ని చూడగలనా అనుకొన్నది. కాని అతన్ని గురించి ఎక్కువ సార్లు ఆలోచించలేదు. ఇంటిపనిలో మునిగిపోయేది.

మూడు రోజులు గోనెసంచులతో కట్టిన చిన్న గుడారంలో నిద్రపోయారు. పగటిపూట గుడిసె కట్టుకోవటంతో సీత తాతకి సహాయపడింది.

సీత జాగ్రత్తగా వస్తువులు ని పిన పెట్టె కొట్టుకు పోలేదు. కాని అందులోకి నీల్లు పోయాయి. ఎహారము బట్టలూ పాడైపోయాయి. తాత హుక్కాగొట్టం పాడైపోలేదు. సాయంత్రం వాళ్ల పనిపూర్తియ్యాక సీత వండిన అన్నం కొద్దిగా తిన్నాక తృప్తితో తాత కొద్దిగా పొగ తాగేవాడు.

రావిచెట్టు వుండేచోట సీత ఒక మామిడి టెంకె పాతింది. అది పెరిగి పెద్దచెట్టు కావటానికి యింకా చాలా ఏళ్లు పడుతుంది. కాని సీత ఆ మామిడి కొమ్మలమీద కూర్చొని, మామిడి పళ్లు తృప్తిగా తినటాన్ని ఊహించుకొని మురిసిపోయేది.

నెమ్మదిగా వానలు వెనకపడ్డాయి. పల్లె ప్రజలు మళ్లీ పొలాలు దున్ని శీతాకాలపు కొత్త పైర్లు వేయసాగారు. సంతలు, పొట్టేళ్ల పందేలు వచ్చేశాయి. రోజులు చల్లగా హాయిగా గడుస్తున్నాయి. నదిలో నీరు ఏమాత్రం మడ్డిగా లేదు. ఒక రోజు సాయంత్రం తాత "మాసీర్" చేపను పట్టాడు. సీత దాంతో కమ్మని కూర వండింది.

* * *

తాత గుడిసె బైట కూర్చొని హుక్కా పీలుస్తున్నాడు. సీత దూరంగా దీవికి ఆ చివర రాళ్లమీద బట్టలు ఆరవేస్తున్నది.

వెనక అడుగుల చప్పుడైంది. తిరిగి చూసింది. క్రిషన్ చిరునవ్వు నవ్వుతు నిలబడి వున్నాడు.

"నీవు రావనుకున్నాను" అన్నది సీత.

"మా వూళ్లో చాల పని వున్నది. పిల్లనగ్రోవి దాచావా?"

"ఆ కాని నేను దాన్ని సరిగా పలికించలేను"

"నేర్పుతాను" అన్నాడు క్రిషన్.

అతను సీత పక్కన కూర్చున్నాడు. వాళ్లు పాదాలను నీళ్లలో ఆడిస్తున్నారు. నదిలో నీరు నీలాకాశం కింది స్వచ్ఛంగా వున్నది. నది లోపల ఇసుక నత్తగుల్లల్ని కూడ చూడవచ్చు.

"కొంతప్పుడు నదికి కోపం వస్తుంది. కొంతప్పుడు కనికరిస్తుంది" అన్నది సీత.

"మనం కూడ నదిలో భాగమే" అన్నాడు క్రిషన్.

అది మంచి నది. లోతుగా, బలంగా వుంటుంది. కొండలలో మొదలై సముద్రంలో కలుస్తుంది. వొడ్డున వందలాది మైళ్లలో లక్షలాది ప్రజలు జీవిస్తున్నారు. వారిలో సీత వొక చిన్న పిల్లమాత్రమే. ఆమెను గురించి ఆ తర్వాత ఎవరికీ తెలియదు. ఒక తాత, ఒక అబ్బాయి, ఆ నది తప్ప ఎవరూ సీతని గురించి వినలేదు.

# ఆదల్-బాదల్ : మారకం

## పన్నాలాల్ పటేల్

అది హోలీ పండుగ నాటి ఒక సాయంత్రం. పల్లెటూరి పిల్లలు కొంతమంది వేప చెట్టు కింది చేరి ఆడుకుంటూ ఒకరి మీదొకరు దుమ్ము చల్లుకుంటున్నారు.

అమృత్, ఇసాబ్ చేయిచేయి కలుపుకుని వచ్చి వాళ్లతో చేరారు. ఆ రోజే కుట్టించుకున్న కొత్త దుస్తులు - రంగులో, సైజులో, గుడ్డ నాణ్యతలో వొకే రకమైనవి వేసుకుని వున్నారిద్దరూ. వాళ్లిద్దరూ ఒకే తరగతిలో, ఒకే స్కూల్లో చదువుతున్నారు. వీధి చివర ఎదురెదురుగ ఇళ్లలో వుంటున్నారు. వాళ్ల తల్లిదండ్రులు కూడ ఇంచుమించు ఒకే తరగతికి చెందినవారు. ఎప్పుడైనా ఇబ్బందులొస్తే వడ్డీ వ్యాపారి దగ్గర అప్పు చేసేపాటి ఆస్తిపరులు. అమృత్‌కు తల్లీ తండ్రి ముగ్గురు సోదరులు వున్నారు. ఇసాబ్‌కు మాత్రం తండ్రి వొక్కడే వున్నాడు.

స్నేహితులిద్దరూ వచ్చి కాలిబాట మీద కూర్చున్నారు. ఇద్దరూ ఒకేరకమైన దుస్తులు వేసుకొని వుండటం చూసి పిల్లలలో ఒకడు "హే అమృత్, ఇసాబ్ మీరిద్దరూ కవల పిల్లలా మార్చుకున్నారా?" అని అడిగాడు.

అందులో ఒక పిల్లాడికి మరో కొంటె ఆలోచన కలిగింది. "మీరు కుస్తీ పట్టకూడదా? మీరు సమానమైన బలవంతులో లేకపోతే ఒకరు మరొకరి కన్నా ఎక్కువ బలవంతులో మాకు తెలుస్తుంది" అన్నాడు.

"మొదటి అబ్బాయి ఇది మంచి ఆలోచన" "అన్నాడు. అవును. అమృత్! ఇసాబ్! మీ ఇద్దరిలో ఎవరెక్కువో చూద్దాం?" అని కూడ అన్నాడు.

"రండి! ఇది సరదాకోసమే!" అని అరిచాడు మరొక అబ్బాయి.

ఇసాబ్ అమృత్‌వైపు చూశాడు. "వద్దు మా అమ్మ నన్ను కొడుతుంది" అన్నాడు అమృత్.

అతని భయం నిజమే. ఇంట్లోంచి వస్తున్నప్పుడు వాళ్లమ్మ "కొత్తబట్టలు కుట్టించమని ఎంతో అల్లరిచేశావు! వాటిని చించుకున్నా, మాపుకున్నా ఏం

జరుగుతుందో తెలుసా?" అని బెదిరించింది.

అమృత్ తల్లితండ్రుల్ని ఎదిరించిన మాట నిజమే. ఇసాబ్ కొత్త చొక్కా కుట్టించుకుంటున్నాడని తెలియగానే తనకూ సరిగ్గా అట్లాంటి చొక్కాయే కావాలని లేకపోతే స్కూలుకు పోనని మొండిపట్టు పట్టాడు. వాళ్లమ్మ అతనికి నచ్చజెప్పటానికి ప్రయత్నించింది. "అబ్బాయ్! ఇసాబ్ పొలంలో పనిచెయ్యాలి. అతని బట్టలు చిరిగిపోయాయి. నీవి యింకా కొత్తగానే వున్నాయి."

"ఎవరన్నారు?" చొక్కా చిరుగులో వేలుపెట్టి పెద్దదిచేస్తూ అమృత్ గోలపెట్టాడు! వాళ్లమ్మ ఇంకో ఉపాయం ఆలోచించింది. "కొత్త బట్టలు కొనేముందు ఇసాబ్ వాళ్ల నాన్న వాణ్ణి కొట్టాడు. నీకూ దెబ్బలు కావాలా?" అన్నది.

అమృత్ తన పట్టు విడవలేదు. సరే! నన్ను కట్టెయ్యి! కొట్టు! కాని నాకు ఇసాబ్‌లాంటిదే కొత్త చొక్కా తెచ్చిపెట్టాలి" అని మొండికేశాడు.

"బావుంది. వెళ్లి మీ నాన్నను అడుగు" అని వాళ్లమ్మ చేతులు కడిగేసుకుంటూ జవాబిచ్చింది.

వాళ్లమ్మ కాదంటే నాన్నకూడ వొప్పుకోడని అమృత్‌కు తెలుసు. కాని అతను ఊరుకుండే రకం కాదు. అతను బడికి వెళ్లకుండ, అన్నం తినకుండ, రాత్రికి ఇంటికి రాకుండ మారాం చేశాడు. చివరికి వాళ్ళమ్మ మెత్తబడి అతనికి కొత్తబట్టలు కొనిపెట్టటానికి నాన్నను వొప్పించింది. ఇసాబ్ వాళ్లనాన్నగారి పశువుల పాకలో దాక్కున్న అమృత్‌ను ఇంటికి తీసుకువచ్చింది.

ఇంట్లోంచి చక్కగా కొత్తబట్టలు కట్టుకొని బయటకు వచ్చిన తర్వాత బట్టలు మురికి చేసుకునే పని చెయ్యటానికి అతను వెనుకాడాడు. ఏమైనా ఇసాబ్‌తో కుస్తీ పట్టటం అతనికి ఇష్టంలేదు.

అప్పుడే ఆ గుంపులో ఒక రౌడీ అమృత్ మెడచూట్టూ చేతులు వేసి "రా! మనం కుస్తీ పడదాం" అని అమృత్‌ను మైదానంలోకి లాగేడు.

అతని పట్టు విడిపించుకోవటానికి అమృత్ పెనుగులాడాడు. "చూడు, కాలియా! కుస్తీ పట్టటం నా కిష్టంలేదు. నన్నొదిలెయ్" అన్నాడు.

కాలియా వదల్లేదు. అమృత్‌ను నెలమీదికి విసిరాడు. పిల్లలంతా పెద్దగా "అమృత్ వోడిపోయాడు. కాలియా గెలిచాడు! కాలియా గెలిచాడు! హూరేహుర్రే" అని రెచ్చగొడుతూ పెద్దగా అరిచారు.

ఇసాబ్‌కి కోపం వచ్చింది. అతను కాలియా చెయ్యి పట్టుకొని "రా! నీతో నేను

కుస్తీ పడతాను" అన్నాడు.

కాలియా వెనుకాడాడు. కాని మిగిలిన పిల్లలతన్ని ఎగసనదోశారు. ఇద్దరు పిల్లలూ వొకరినొకరు గట్టిగా పట్టుకున్నారు. ఇసాబ్ కాలియాను గట్టిగా పట్టుకొని నెలకరుచుకొనేట్లు విసిరేశాడు. కాలియా పెద్దగా అరవసాగాడు.

హాస్యంగా మొదలైంది కాస్తా తగువుగా ముదిరిందని పిల్లలందరికీ తెలిసిపోయింది. కాలియా వాళ్ల తల్లిదండ్రులు వచ్చి తమను కొడతారని వాళ్లు బెదిరిపోయి తలోకదిక్కూ పారిపోయారు.

అమృత్, ఇసాబ్ అక్కడినుంచి కదిలారు. కొద్ది అడుగుల దూరం వెళ్లగానే అమృత్ కళ్లు ఇసాబ్ చొక్కామీద పడ్డాయి. దాని జేబు ఆరంగుళాల మేర గుడ్డ చిరిగిపోయింది. నడుస్తున్నవాళ్ళు భయంతో హఠాత్తుగా ఆగిపోయారు. చొక్కా చిరుగుల్ని వాళ్ళు పరీక్షగా చూశారు. ఇది చాలనట్టు ఇసాబ్ నాన్న "ఇసాబ్ ఎక్కడ?" అని ఇంట్లోనుంచి గట్టిగా అరుస్తున్నాడు.

వాళ్ల గుండెలు కొట్టుకోవడటం మానివేశాయి. దెబ్బలు తగుల్తాయని తెలుసు. చిరిగిన చొక్కా చూడగానే ఇసాబ్ తండ్రి అతని తాట వొలుస్తాడు. వడ్డీ వ్యాపారి దగ్గర వడ్డీకి డబ్బు అప్పు తెచ్చాడు. జాగ్రత్తగా ఎంపికచేసి, గుడ్డకొని ఆ చొక్కా కుట్టించాడు.

"ఎవరా ఏడిచేది? ఇసాబ్ ఎక్కడ?" అని ఇసాబ్ తండ్రి గర్జించాడు. మెరుపులాగ అమృత్‌కొక ఆలోచన వచ్చింది. ఇసాబ్‌ను ఒక పక్కకు లాక్కువెళ్లాడు. "నాతోరా" అన్నాడు. రెండిళ్ల మధ్యనున్న చిన్న సందులోకి వెళ్లాక, అమృత్ తన చొక్కా గుండీలు విప్పసాగాడు. "త్వరగా నీ చొక్కా తీసెయ్యి. నా చొక్కా వేసుకో" అని ఆజ్ఞాపించాడు.

"మరి నీకో నువ్వేం వేసుకుంటావు?" అని అడిగాడు ఇసాబ్.

"నీ చొక్కా వేసుకుంటాను. త్వరగా కానీ - ఎవరూ మనల్ని చూడకముందే మార్చుకుందాం" అన్నాడు అమృత్.

ఇసాబ్ కూడ చొక్కా గుండీలు విప్పసాగాడు. కాని అమృత్ ఏం చెయ్యాలను కుంటున్నాడో అతనికి తోచలేదు. "చొక్కాలు మార్చుకోవటమా? దానివల్ల ఏం లాభం? నాన్న కొడతాడు."

"నిజమే. ఆయన నన్ను కొడతాడు. కాని నన్ను కాపాడేందుకు అమ్మవుంది" అన్నాడు అమృత్.

తండ్రి కొట్టబోయినప్పుడల్లా అమృత్ అమ్మచాటున దాక్కోవటం ఇసాబ్ అనేకసార్లు చూశాడు. అమ్మచేత ఒకటి రెండు లెంపకాయలు మాత్రం తినక తప్పదు! కాని నాన్న చేత గట్టి దెబ్బలతో పోలిస్తే అమ్మ చిన్న దెబ్బలు ఏపాటి!

ఇసాబ్ వెనుకాడాడు. ఆ సమయానికి పక్కనే ఎవరో దగ్గినట్లు వినపడింది. అబ్బాయిలు త్వరగా చొక్కాలు మార్చుకొని, సందులోనుంచి బయటపడి జాగ్రత్తగా ఇంటిదారి పట్టారు.

అమృత్ గుండె భయంతో కొట్టుకుంటోంది. కాని అతనికి అదృష్టం కలిసి వచ్చింది. ఆ రోజు హోలీ! అల్లరీ ఆగడం జరగటం సహజమే. అతని చిరిగిన చొక్కా చూడగానే తల్లి కోప్పడింది కాని మరేం అడగలేదు. సూదీదారం తీసుకొని చిరుగుల్ని, మళ్లీ కుట్టింది.

వాళ్ళ భయం తగ్గిపోయి చేయిచేయి కలుపుకుని హోలీ పండుగనాడు ఊరి బయట చూసేందుకు వెళ్ళారు.

వాళ్ళు చొక్కాలు మార్చుకోవటం కనిపెట్టిన ఒక అబ్బాయి "అయితే మీరు చొక్కాలు మార్చుకున్నారన్నమాట, హా" అని హేళనచేసి వారి ఆనందమంతా పాడుచేయసాగాడు.

ఆ అబ్బాయి చొక్కాలు మార్చుకోవటం చూశాడని భయపడి వాళ్ళు దూరంగా వెళ్ళిపోయారు. కాని అంతలో మిగిలిన పిల్లలకు కూడా జరిగిందేమిటో తెలిసింది. వాళ్ళు "ఆదల్ - బాదల్ : మారకం! మారకం!" అని పెద్దగా గోలచేయసాగారు.

వాళ్ళిద్దరూ తప్పించుకు పోవటానికి చూశారు గాని ఆ గుంపు "మారకం! మారకం! ఆదల్ - బాదల్" అని అరుస్తూ వెంట పడింది. తమ తల్లిదండ్రులకి తెలుస్తుందని భయపడి వాళ్లు ఇళ్లవైపుకు పరుగెత్తారు.

ఇసాబ్ తండ్రి ఆరుబయట హుక్కా పీలుస్తూ మంచంమీద కూర్చొని వున్నాడు. "మీ రెందుకు స్నేహితుల్ని వదిలిపెట్టి పరుగెత్తి వస్తున్నారు? రండి! నా దగ్గరకు వచ్చి కూర్చోండి" అని పిలిచాడు.

ఆయన గంభీర కంఠం వాళ్లకు ఆందోళన కలిగించింది. "మేం అనుకున్నట్లే జరిగింది. నిజం తెలుసు కాని తెలియనట్లు దయగా వున్నట్లు నటిస్తున్నాడంతే!" అని అనుకున్నారు.

ఇసాబ్ తండ్రి పఠాను. పదేళ్ళ అమృత్‌ను ఆయన గుండెలకి హత్తుకున్నాడు. "వహోలి వదినా! ఈ రోజునుంచి మీ అబ్బాయి అమృత్ మా అబ్బాయి" అని

ఆయన పెద్దగా పిలిచి చెప్పాడు.

వహోలి వదిన ఇంట్లోంచి బయటకు వచ్చింది. "హసన్‌భాయ్! ఒక్క కొడుకునే పెంచలేకుండ వున్నావు. ఇద్దరితో ఎలా వేగుతావు! అంది నవ్వుతూ.

అమృత్‌లాంటి పిల్లలైతే ఇరవైయొక్క మందినైనా పెంచగలను" అన్నాడు హసన్.

పఠాను గొంతు సవరించుకొని అబ్బాయిలిద్దరు సందులోకి వెళ్ళటం చూసిన సంగతి చెప్పాడు. "వాళ్ళేం చేయదలిచారో చూడాలనుకున్నాను."

ఇరుగుపొరుగు అమ్మలక్కలు పఠాను చెబుతున్నది వినేందుకు చుట్టూ చేరారు.

పిల్లలు చొక్కా లెలా మార్చుకొన్నదీ అతను వాళ్ళతో చెప్పాడు. "మీ నాన్న కొడితే ఏం చేస్తా"వని ఇసాబ్ అమృత్‌ను అడిగాడు. అప్పుడు మీ అమృత్ ఏమన్నాడో తెలుసా? "మా అమ్మవున్నది" అని చెప్పాడు.

"నిజమే! అమృత్ జవాబు నాలో మార్పుతెచ్చింది. నిజమైన విలువ ఏమిటో తెలియజెప్పాడు" అన్నాడు పఠాను తడి కళ్లతో.

అమృత్, ఇసాబ్‌లిద్దరి మధ్యవున్న ప్రేమకు స్త్రీలందరు చలించిపోయారు. అదే సమయంలో హోలీమంట దగ్గరకు వెళ్ళి తిరిగి వస్తున్న పిల్లలు అమృత్ ఇసాబ్‌లను చుట్టిముట్టి "అమృత్ - ఇసాబ్ మారకం భాయిం మారకం" అని గోల మొదలుపెట్టారు.

ఈమాటు అమృత్, ఇసాబ్ కంగారు పడలేదు. పైగా ఆదల్ - బాదల్ అని పిలిచినందుకు ఎంతో సంతోషించారు.

ఈ ఆదల్ - బాదల్ కథ ఊరంతా వ్యాపించింది. విషయం గ్రామ పెద్దదాకా వెళ్ళింది. ఆయన ఈ రోజునుంచి మనం వాళ్ళను "అమృత్ ఆదల్, ఇసాబ్ బాదల్" అని పిలుద్దామన్నాడు.

స్నేహితులిద్దరూ చాల సంతోషించారు. ఆ తరువాత గ్రామమే కాదు ఆకాశం కూడ అమృత్ - ఇసాబ్, ఆదల్ - బాదల్; ఆదల్ - బాదల్ అనే కేకలతో ప్రతిధ్వనించింది.

# కేట్ బాల్ (పంగటిపుల్ల) అబ్బాయి

భిషమ్ సహానీ

పాఠశాలలో మా తరగతిలో అనేక రకాల అబ్బాయి లుండేవారు. చిక్కుప్రశ్న ఏదైనా అడిగినప్పుడల్లా హర్బన్స్‌లాల్ కొద్దిగా సిరా తాగుతాడు. అది మొదడుకు పదును పెడుతుందని అతని నమ్మకం. టీచర్ అతని చెవులు మెలివేస్తే "కాపాడండి! చంపేస్తున్నాడు!" అని పెద్దగా అరుస్తాడు. ఎంత పెద్దగా అరుస్తాడంటే, ఇతర తరగుతుల నుంచి విద్యార్థులు, ఉపాధ్యాయులు ఏం జరిగిందోనని పరుగెత్తుకు వచ్చి చూస్తారు. ఇది ఉపాధ్యాయుడికి చాల అవమానం కలిగించే వ్యవహారం. ఉపాధ్యాయుడు బెత్తంతో కొట్టబోతే ఆయన మెడచుట్టూ చేతులు వేసి "క్షమించండి మహారాజా! మీరు అక్బర్ ది గ్రేట్ అంతటి వారు. మీరు అశోక చక్రవర్తి. మీరు నాకు తండ్రి, తాత ముత్తాత అన్నీ మీరే" అని బ్రతిమిలాడతాడు.

దీంతో పిల్లలంతా ముసిముసిగా నవ్వి ఉపాధ్యాయుని గౌరవించటం మానుకుంటారు. హర్బన్స్‌లాల్ కప్పల్ని పట్టుకొని కప్ప కొవ్వు అరిచేతులకు రాసుకున్నారంటే ఉపాధ్యాయుని బెత్తం మిమ్మల్ని ఏమీ చెయ్యదు" అనేవాడు.

కాని తరగతి అంతటిలోను విచిత్రమైనవాడు బోధ్‌రాజ్. మా అందరికీ వాడంటే భయం. వాడెవరి చేతినైనా గిల్లితే, ఆ చెయ్యి పాము కరిచినట్లే వాచిపోతుంది. పూర్తిగా విషపు మనిషి. కందిరీగను వొట్టివేళ్ళతోనే పట్టుకొని, దాని తొండం లాగేసి, దాని కొక దారం కట్టి గాలిపటంలాగ ఎగరవేస్తాడు. పూవు మీద వాలిన సీతాకోకచిలుక మీద హఠాత్తుగా దాడిచేసి వేళ్లమధ్య నలిపేస్తాడు; లేకపోతే దాని కొక సూదిగుచ్చి తర్వాత దాన్ని నోట్‌బుక్‌లో పెట్టుకుంటాడు.

అతన్ని తేలు కుడితే తేలే చచ్చిపోతుందంటారు. బోధ్‌రాజ్ రక్తమంతా విషమే. పాము కాటుకూడ వాడి నేమీ చేయదు. వాడి చేతిలో నిత్యం పంగటిపుల్ల వుంటుంది. వాడి గురి ఎప్పుడూ తప్పదు. వాడి కిష్టమైన పని పిట్టలను గురిచూచి

కొట్టటం. చెట్టుకింద నిలబడి గూరిచూచి కొట్టగానే, మరుక్షణం పక్షి అరుస్తూ గాలిలో తేలిపోతుంది. ఈకలు గాలిలో తేలుతూ కింద పడతాయి. లేకపోతే వాడు చెట్టెక్కి గూట్లో వున్న గుడ్లన్నీ తీసికుని గూడును పూర్తిగా నేలకూల్చేస్తాడు.

కక్షపట్టి సాధించే రకం. ఇతరులను బాధించటం వాడికి ఆనందం. అందరికీ వాడంటే భయం. ఆఖరికి వాళ్లమ్మ కూడ వాణ్ణి రాక్షసు డంటుంది. వాడి జేబుల్లో విచిత్రమైన వస్తువులు - బతికున్న రామచిలుక, కొన్ని పక్షుల గుడ్లు, ముళ్లపంది ముళ్లు వుంటాయి.

బోధ్‌రాజ్ కెవరితోనైనా పోట్లాట వస్తే ఎద్దులాగ కుమ్మేస్తాడు. లేకపోతే తంతాడు. కొరుకుతాడు. బడి అయిపోయాక మేమంతా ఇళ్లకు వచ్చేస్తాం కాని బోధ్‌రాజ్ ఎక్కడెక్కడో తిరుగుతాడు.

చెప్పటానికి వాడి దగ్గర ఎప్పుడూ ఏవేవో కథలు సిద్ధంగా వుంటాయి. ఒక రోజు వాడు "మా ఇంట్లో ఉడుం వున్నది. ఉడుం అంటే ఏమిటో నీకు తెలుసా?" అని అడిగాడు.

"లేదు. ఉడుం అంటే ఏమిటి?"

"ఒక రకం పాకే జంతువు. దాదాపు ఒక అడుగు పొడవుంటుంది. దానికెన్నో కాళ్లు, కోరలు వుంటాయి."

"మేం భయంతో వణికిపోయాం."

"మా ఇంట్లో మెట్లకింద మాకొక ఉడుం వున్నది. ఒక్కసారి గనక అది దేన్నైనా పట్టుకుంటే, ఏమైనా సరే పట్టువిడవదు" అన్నాడు.

మా గాభరా ఎక్కువయింది.

దొంగల దగ్గర ఉడుము లుంటాయి. ఎత్తయిన గోడ లెక్కటానికి వాటిని ఉపయోగిస్తారు. దాని వెనక కాళ్ళకు ఒకతాడు కట్టి పైకి విసురుతారు. ఉడుము గోడమీదికి చేరగానే దాన్ని గట్టిగా పట్టుకొంటుంది. ఎంత గట్టిగా పట్టుకొంటుందంటే పదిమంది మనుష్యులు కూడా ఆ పట్టు విడిపించలేరు. దొంగలు ఆ తర్వాత తాడుమీదుగా పాకి గోడ ఎక్కుతారు.

"ఉడుం తన పట్టు ఎప్పుడు వదిలి పెడుతుంది?"

"దొంగలు పైకి ఎక్కిన తర్వాత దానికి వాళ్ళు, కాసిని పాలు పోస్తారు. వెంటనే అది తన పట్టు సడలిస్తుంది.

అటువంటి కథలు చెప్పేవాడు బోధ్‌రాజ్.

నాన్నగారికి 'ప్రమోషన్' వచ్చి మేం పెద్ద బంగళాలోకి మారాము. ఊరి వెలుపల పాతకాలపు బంగళా అది. ఇటుక రాళ్ళు పరిచిన నేల, ఎత్తైన గోడలు, వాలిన కప్పు, ఎన్నో చోట్లు పొదలున్న తోట వున్నాయి ఇంట్లో. ఎంతో సౌకర్యం వున్నప్పటికీ అది ఖాళీగా, విశాలంగా ఊరికి దూరంగా వున్నది. మా స్నేహితులు నన్ను కలుసుకోవటానికి ఎప్పుడో గాని రారు.

బోధ్‌రాజొక్కడు మాత్రం వస్తాడు. వాడి వేటకు అది మంచిస్థలం. చెట్లమీద ఎన్నో గూళ్ళు వున్నాయి. కోతులు తిరుగుతున్నాయి. పొదల్లో ముంగీసలు కూడ వున్నాయి. ఇంటి వెనకాల ఒక పెద్ద గది వుంది. ఇంట్లో మిగిలిపోయిన సామానును మా అమ్మ దాన్లో పడేసింది. ఈ గది పావురాళ్లకు నిలయమైంది. రోజంతా గదిలో వాటి కువకువలు వినవచ్చు. గాలిపోయేందుకు ఏర్పరిచిన వెంటిలేటర్ పగిలిపోయిన అద్దం వెనకాల ఒక మైనా గూడు కూడ వున్నది.

గదిలో నేలంతా యీకలతో, పిట్టల రెక్కలతో, పగిలిన గుడ్లతో, గూళ్లనుంచి రాలిన గడ్డిపోచలతో నిండివుంటుంది.

ఒకసారి బోధ్‌రాజ్ ముళ్ళపందిని తీసుకువచ్చాడు. దాని నల్లటి నోరు పదునైన ముళ్ళు నాకు భయం పుట్టించాయి. అమ్మకు బోధ్‌రాజ్‌తో నేను స్నేహం చెయ్యటం యిష్టం లేదుగాని, నే ఒంటరివాణ్ణైపోయాననీ, తోడు అవసరమనీ గ్రహించింది. అమ్మ వాణ్ణి దయ్యమని పిలిచి, పక్షుల్ని బాధించవద్దని తరుచు నచ్చచెప్పేది.

ఒకరోజు అమ్మ నాతో "మీ స్నేహితుడికి గూళ్లను నాశనం చెయ్యటం సరదా అయితే మన సామాన్ల గదిని శుభ్రం చెయ్యమను. పిట్టలు గదిని ఎంతో మురికి చేశాయి" అన్నది.

"గూళ్లను పడగొట్టటం చాల క్రూరమని చెప్పావుగదా!" అని అడిగాను.

"పక్షులను చంప మనటం లేదు. పక్షులకు కీడు తలపెట్టకుండ గూడును తొలగించవచ్చు."

ఆ తర్వాత ఒకరోజు బోధ్‌రాజ్ వచ్చినప్పుడు సామాన్లగదికి తీసుకువెళ్లాను. గది చీకటిగా గబ్బు కొడుతూ వున్నది. జంతువుల గుహలోకి ప్రవేశించినట్లుంది.

నేను కొద్దిగా వెనకాడుతూనే వున్నాను. బోధ్‌రాజ్ గూళ్లను నాశనం చేసి, పక్షి యీకలు లాగేసి, గుడ్లు పగలగొడితే ఏమవుతుంది? మా స్నేహాన్ని నిరుత్సాహ పరచిన అమ్మ బోధ్‌రాజ్‌ను తీసుకువచ్చి సామాన్లగదిని బాగు చెయ్యమని ఎందుకన్నదో అర్థం కాలేదు.

బోధ్‌రాజ్ పంగటిపుల్ల తీసుకువచ్చాడు. కప్పుకింద వున్న గూళ్లన్నిటినీ జాగ్రత్తగా పరిశీలించాడు. కప్పు రెండు పక్కలా వారి మధ్యలో రెండు భాగాలను వేరు చేస్తూ ఒక దూలం వున్నది. దూలాని కొక చివర వెంటిలేటరుకు దగ్గరగా మైనాగూడు వున్నది. చిన్న చిన్న గుడ్డ పీలికలూ, దారపు పోగులూ దాన్లో నుంచి వ్రేలాడటం చూశాను. కొన్ని పావురాళ్ళు కువకువమని పరస్పరం కవ్వించుకుంటూ దూలం కిందుగా తిరుగాడుతున్నాయి.

"మైనా పిట్టలు పైన గూడులో వున్నాయి" అని బోధ్‌రాజ్ పంగటిపుల్లను గురిపెట్టాడు.

రెండు పసుపుపచ్చని పిట్టల ముక్కులు గూడులోంచి తొంగిచూడటం గమనించాను.

"చూడు, ఇది గంగామైనా. యీ ప్రాంతాల్లో సామాన్యంగా కన్పించదు. దీని తల్లీతండ్రీ వాటి గుంపులోనుంచి విడివడి ఇక్కడి కొచ్చివుంటాయి" అని బోధ్‌రాజ్ ఆశ్చర్యంగా అన్నాడు.

"వాటి తల్లీతండ్రీ ఎక్కడున్నాయి?" అడిగాను.

"మేతకోసం వెళ్ళి వుంటాయి. తొందరలోనే తిరిగి వస్తాయి" అని బోధ్‌రాజ్ చేయి పై కెత్తాడు. అతన్ని ఆపాలనుకున్నాను. కాని నేను నోరు తెరవకముందే విజ్‌మనే చప్పుడు వినిపించింది. ఇంటి కప్పుమీద వున్న ఇనపరేకుల మీద ఏదో పెద్దరాయి పడింది వంటి చప్పుడైంది.

పిట్టల ముక్కులు కనిపించకుండ పోయాయి. కువకువలు, కిచకిచలు ఆగిపోయాయి. పిట్టలన్నీ భయంతో నిశ్శబ్దంగా వున్నట్లనిపించింది.

బోధ్‌రాజ్ మరొకరాయి విసిరాడు. ఈసారి అది ఇంటి వాసానికి తగిలింది. తన గురి తప్పదని బోధ్‌రాజ్ గర్వం. రెండుసార్లు గురి తప్పినందుకు కోపం వచ్చింది. పిట్ట బోధ్‌రా మీదుగా తొంగి చూసినప్పుడు మూడోసారి ప్రయత్నించాడు. ఈసారి రాయి గూడుకు పక్కభాగంలో తగిలింది. కొన్ని గడ్డిపోచలు, గుడ్డ పీలికలు కిందపడ్డాయి. కాని గూడు కిందపడలేదు.

బోధ్‌రాజ్ మళ్ళీ పంగటిపుల్ల పైకెత్తాడు. హఠాత్తుగా వెంటిలేటర్ నుంచి వచ్చే కాంతికి అడ్డంగా ఒక నల్లటి నీడ గదిలో వ్యాపించింది. ఉలిక్కిపడి మేం పక్కకు చూశాం. పెద్దగద్ద తన రెక్కల్ని విప్పి మావంక చూస్తున్నది.

"ఇది తప్పకుండ గద్ద గూడై వుంటుంది" అన్నాను.

"కాదు, గద్దగూడు ఇక్కడెలా వుంటుంది? గద్ద తన గూడెప్పుడూ చెట్టుమీదే

కట్టుకొంటుంది. ఇది 'మైనా' గూడు."

పక్షి కూనలు రెక్కలు టపటపా కొడుతూ పెద్దగా అరవసాగాయి. మేం ఊపిరి బిగబట్టాం.

గద్ద వెంటిలేటర్ వదిలిపెట్టి వాసం మీద వాలింది. అది తన రెక్కలు ముడుచుకు కూర్చున్నది. అది సన్నని మెడను విదిల్చి తలను కుడి పక్కకు, ఎడమ పక్కకు తిప్పింది.

పిట్టలు భయంతో అరుస్తున్నాయి.

"గద్ద రోజూ యిక్కడికి వస్తున్నది" అన్నాడు బోధ్‌రాజ్.

తెగిపోయిన రెక్కలు, గడ్డిపోచలు పక్షుల మాంసపు ముక్కలు నేలమీద ఎందుకుంటున్నాయో తెలిసింది. గద్ద తరచుగా గూడును నాశనం చేస్తోంది. గద్ద నెమ్మదిగా గూడువైపు జరుగుతోంది. బోధ్‌రాజ్ కన్నార్పకుండా చూస్తున్నాడు. అరుపులు తారస్థాయికి చేరుకున్నాయి.

నేను కుప్ప కూలిపోయాను.

మైనా పిల్లల్ని గద్ద చంపితేనేం? బోధ్‌రాజ్ చంపితేనేం? గద్ద రాకపోతే బోధ్‌రాజ్ తప్పక 'మైనా' గూడును నేలకూల్చేవాడే.

బోధ్‌రాజ్ పంగటిపుల్ల పైకెత్తి గద్దకు గురిపెట్టాడు. "గద్దను కొట్టవద్దు. అది వూరుకోదు. నిన్ను ఎదుర్కొంటుంది" అని అరిచాను. కాని బోధ్‌రాజ్ లెక్కచెయ్యలేదు. రాయి గద్దకు తగలకుండ గురితప్పి కప్పుకు తగిలింది. గద్ద రెక్కలు బాగా విప్పి కిందికి చూసింది.

"మన మిక్కడ నుంచి బయటికి పోదాం" అన్నాను.

"గద్ద పక్షికూనల్ని తినేస్తుంది." అతని మాట వింతగా తోచింది.

బోధ్‌రాజ్ మళ్ళీ గురిచూశాడు. గద్ద వాసాన్ని వదిలిపెట్టి, రెక్కలు విప్పార్చి అర్ధచంద్రకారంలో గిరున తిరిగి, స్తంభంమీద వాలింద. పక్షికూనలు మళ్ళీ భయంతో అరవసాగాయి.

బోధ్‌రాజ్ జేబులోనుంచి కొన్నిరాళ్ళు తీసి నాచేతికి ఇచ్చాడు. "గద్దకు గురిపెట్టు. వరసగా కొట్టు. దాన్నక్కడ కూర్చోనివ్వకు" అని హెచ్చరించాడు. తర్వాత అతను పరుగెత్తి గోడపక్కనున్న బల్ల గదిమధ్యకు లాక్కువచ్చాడు.

పంగటిపుల్ల ఎలా ఉపయోగించాలో నాకు తెలియదు. ఒకసారి ప్రయత్నించాను. కాని గద్ద ఒక స్తంభం మీదనుంచి ఎగిరి మరొక స్తంభం మీద వాలింది.

బోధ్‌రాజ్ బల్లని సరిగ్గా మైనా గూడు కింద చేర్చాడు. తర్వాత ఒక విరిగిన కుర్చీని తెచ్చి బల్లమీద వుంచాడు. కుర్చీమీద ఎక్కి, నెమ్మదిగా జాగ్రత్తగా గూడును ఎత్తి కిందికి దిగాడు.

"మన మిక్కణ్ణించి పోదాం" అని చెప్పి వాకిలివైపు పరుగెత్తాడు. అతన్ని అనుసరించాను.

'గేరేజి' లోకి వెళ్ళాం. దాని కొకటే వాకిలీ, వెనక గోడ కొక చిన్న కిటికీ వున్నాయి. దాని పొడవునా వొక దూలం వున్నది.

"గద్ద యిక్కడికి రాలేదు" అని ఒక పెట్టె మీదికి ఎక్కి గూడును దూలం మీద వుంచాడు బోధరాజ్.

మైనా పిల్లలు అరవటం మానేశాయి. పెట్టెమీద నిల్చొని బోధ్‌రాజ్ మొదటిసారిగా గూడులోకి చూశాడు. రెండు పిట్టల్ని పట్టుకొని ఎప్పటిలాగే జేబులో పెట్టుకుంటా డనుకున్నాను. కాని చాలసేపు వాటివంక చూశాక అతను "కాసిని నీళ్ళు తీసుకురా, పిట్టలకు దాహమవుతున్నది. మనం నెమ్మదిగా వాటి నోళ్ళలో ఒక్కొక్క చుక్కా నీళ్ళు పోద్దాం" అన్నాడు.

నే నొక గ్లాసు నీళ్ళు తెచ్చాను. రెండు పిట్టలూ ముక్కులు తెరిచి ఎగరొప్పుతున్నాయి. బోధ్‌రాజ్ వాటి నోళ్లలో చుక్క చుక్కగా నీళ్ళు పోశాడు. వాటిని తాకవద్దని, తానుకూడ తాకననీ చెప్పాడు.

"అవి యిక్కడ వున్నట్లు వాటి అమ్మా నాన్న కెట్లా తెలుస్తుంది" అని అడిగాను.

"వాటికోసం వెతుకుతాయి".

చాలసేపు 'గేరేజ్'లో వున్నాం. గద్ద మళ్ళీ సామాన్లగదిలోకి రాకుండ 'వెంటిలేటర్' మూసివెయ్యటం గురించి చర్చించాడు. ఆ సాయంత్రమంతా అతనీ విషయం తప్ప మరే సంగతీ మాట్లాడలేదు.

మర్నాడు బోధ్‌రాజ్ వచ్చినప్పుడు అతని దగ్గర పంగటిపుల్లగాని, రాళ్ళుగాని లేవు. ఒక సంచీలో గింజలు తెచ్చాడు. పిట్టకూనలకు వాటిని తినిపిస్తూ గంటలకొద్దీ వాటి చిలిపి చేష్టల్ని చూశాం.

# రాహుల

## త్రివేణి

రాహుల ఇంటికి వచ్చినప్పుడది చాలాచిన్నది. నాయనమ్మకు శుచీ శుభ్రత అంటే మహా పట్టింపు. అంటుసొంటు గురించి చాల గొడవ చేస్తూవుంటుంది. రాహుల ఇంటికి వస్తున్నదని విన్నప్పుడు ఎంతో కంగారుపడింది. నాన్న వార్తాపత్రిక చదవటంలో లీనమై వున్నప్పుడు దగ్గరకు వెళ్లి "చూడబ్బాయ్" అని పిలిచింది. ఆమె రాహుల గురించి ఒక పెద్ద ఉపన్యాసం దంచబోతున్నదని నాన్నకు తెలుసు. కాబట్టి పత్రిక మడిచి ఆమె ఉపన్యాసం వినటానికి సిద్ధమయ్యాడు. నేను పక్కనే నిలబడి జామకాయ కొరుక్కు తింటున్నాను.

"ఈ ఇంట్లో ఏం జరుగుతున్నదో తెలుసా? బ్రాహ్మల ఇంట్లో కుక్కల్ని పెంచుకోవటం ఎక్కడైనా వుందా? అది మురికి జంతువు. మన ఆచారం, సంప్రదాయం కాపాడుకోవాలంటే జాగ్రత్తగా పరిశుభ్రంగా వుండాలి" అన్నది కోపంగా.

"కుక్క తెలివైన జంతువు. ఏదైనా నేర్పితే త్వరగా నేర్చుకుంటుంది. మనం నేర్పటంలో వుంటుందంతా!"

"పొట్టిది! ఆ భ్రష్టుదానికి నువ్వేం నేర్పుతావు! ఎప్పుడే క్షణంలో ఏంచేస్తుందో ఖచ్చితంగా ఎలా చెప్పగలవు? బియ్యంలో మూతి పెడితే, కూరముట్టుకుంటే వంటింట్లోకి వస్తే ఏం చేస్తాం? వంటింటిని శుద్ధి చెయ్యాలంటే ఎంత కష్టపడాలి? ఎంత ఖర్చవుతుంది!

"మనం జాగ్రత్తగా వుండొచ్చు. దాన్ని వంటింట్లో రానియ్యకుండ చూడవచ్చు. ఒకటి రెండు సార్లు గట్టిగా తగల్నిస్తే ఎక్కడికి వెళ్లొచ్చో, ఎక్కడికి వెళ్లగూడదో దానికే అర్థమవుతుంది."

"కావొచ్చు. కాని భోజనాలయ్యాక నేను విస్తళ్ళెత్తి పారవేసేటప్పుడు అది నా మీదికి దూకితే ఏం చెయ్యాలి? స్నానం చేసి శుద్ధి చేసుకోవాలంటే పవిత్ర

గంగానదికి వెళ్లాలి."

"దానికి చిన్నప్పటి నుంచే శిక్షణయిస్తే తప్పకుండ నేర్చుకుంటుంది. నీ దారికి అడ్డం రాకుండ నే చూస్తాగా."

నాయనమ్మకు తృప్తి కలగలేదు. "నువ్వొక నిర్ణయానికి వచ్చినట్లున్నది" అన్నది. "అమ్మా! నిన్ను కంగారు పెట్టటం నా కిష్టంలేదు. కాని అన్నిచోట్ల దొంగతనాలు పెచ్చు పెరిగిపోయాయి. ఒక కుక్క పదిమంది కాపలా వాళ్లతో సమానం. కుక్కకు విశ్వాసం వుంటుంది."

"నీ యిష్టం వచ్చినట్లే కానియ్యి" అని చెప్పి నాయనమ్మ దూరంగా వెళ్ళిపోయింది. నాన్న నా వైపు తిరిగి "ఏమంటావు లీలూ?" అని అడిగాడు.

"కుక్కవుంటే బావుంటుంది. కుక్కవుంటే బాగుండునని నా కెప్పటి నుంచో వున్నది" అని చెప్పాను.

ఒకరోజు చెన్న మేలుజాతి కుక్క నొకదాన్ని తీసుకొని వచ్చాడు. దాన్ని అతను గుండెలకు హత్తుకున్నాడు. నన్ను బయటకు పిలిచాడు.

"చూడు, నేనేం తెచ్చానో! ముద్దుగా వుంది కదూ!" అన్నాడు. పాపం అది భయపడి మాకు దూరంగా ముడుచుకుంది. కారు నల్లగా వుంది. వొంటిమీద ఒక్క తెల్లవెంట్రుకైనా లేదు. నున్నగా, మెత్తగా పట్టులా వున్నది. చిన్న వొంటికి సరిపడనంత పెద్ద చెవులున్నాయి దానికి, భయంతో మెరిసే పచ్చటి కళ్లకు రెండు పక్కలా వేలాడుతున్నాయి. అదంటే చాల అభిమానం కలిగింది.

"చెన్నా, అది ముద్దుగావుంది! చూడు, దాని ముఖం మిణుగురు పురుగులా వుంది. దాన్ని నేను ఎత్తుకుంటాను, రా పాపా" అంటూ చేతులు చాశాను.

"అమ్మాయి కాదు అబ్బాయి."

"అబ్బాయి కెన్నేళ్లు?"

"ఇరవై రోజులే. వాళ్లమ్మ దగ్గర్నుంచి దూరంగా తీసుకువస్తున్నప్పుడు పెద్దగా మొరిగాడు. నువ్వు ఇంకో నెలవరకూ పాలు మాత్రమే పొయ్యాలి. బొచ్చు ఎలావుంది నీకు?"

"అమావాస్య చీకటి రాత్రిలాగుంది" అంటూ కుక్కపిల్లను నా చేతుల్లోకి తీసుకున్నాను. అమ్మను పిలిచాను.

"ఏమిటి గోలంతా?" అమ్మ, నాయనమ్మ వంటింట్లోంచి బయటికి వచ్చాక అమ్మ అడిగింది. నా చేతుల్లో కుక్కపిల్లను చూసిన క్షణంలోనే నాయనమ్మ వెనక్కి

తగ్గి "సిగ్గులేదూ! చూడండి, కుక్కపిల్లను సొంత చంటిబిడ్డను ఎత్తుకున్నట్లు ఎత్తుకున్నది. చూడబోతే పెళ్లీడుకొచ్చింది! కాని దీనికింకా ఏమీ తెలియదు!" నాయనమ్మను ఏడిపించ బుద్ధయింది. కుక్కపిల్లను ముద్దుపెట్టుకున్నాను. "ఓరి దేవుడా! ఈ పాపిష్ఠి కళ్లతో ఇంకా ఏవేం చూడాలో!" తల పక్కకు తిప్పుకొని నాయనమ్మ అరిచింది.

కాని అమ్మకు కుక్కపిల్ల చాలా నచ్చింది. "ముద్దొస్తున్నాడు ఏం పేరు పెడతావు?" అడిగింది. ఆ సమయంలో నేను 'యశోధర' నాటకం చదువుతున్నాను. మనసంతా యశోధర రాహులులతో నిండివుంది. మనసులో మెదులుతున్న 'రాహుల' పేరు చెప్పాను.

అమ్మ ఒక్క క్షణం ఆలోచించి "బావుంది. అది మంచి పేరు" అని అంగీకరించింది. ఆ రాత్రి 'రాహుల' వాళ్ల అమ్మ దగ్గర లభించే వెచ్చదనం, ప్రేమ దొరకలేదు. రాత్రి చాలాసేపు మేలుకునే వుంది.

ఒకమూల రెండు గోతాలు పరిచి నేను దానికి పక్కవేశాను. కాని రాహుల రాత్రంతా మొరుగుతూనే వున్నది. ఎన్నోసార్లు లేచి దాన్ని బుజ్జగించాను. చేతులో వున్నంతసేపు నెమ్మదిగా వుండేది. కాని లేచి దీపం తీసివెయ్యగానే మొరగటం మొదలు పెట్టేది. రాత్రంతా ఇంట్లో వాళ్లెవరికి కంటిమీద కునుకు లేదు. నాయనమ్మకు చాల కోపం వచ్చింది. "ఈ పాడుది నన్ను నిద్రపోనివ్వటం లేదు. నేను యింట్లో ఎలా వుండేది? చివరి రోజుల్లో శాంతి లేకుండ చేస్తున్నది."

నాయనమ్మ గొణుగుడు విన్నాను. చివరకు ఎదురు తిరిగాను. "పోనీ నాయనమ్మ! చిన్నది, వాళ్లమ్మ లేకపోవటాన మొరుగుతున్నది. పెళ్లయినప్పుడు నీకు పదకొండేళ్లేనని చెప్పావు, జ్ఞాపకంవుందా? భర్తయింటికి వెళ్లిన రోజు రాత్రంతా నిద్రపోకుండ ఏడవలేదూ? రాహులకూడ వాళ్ళమ్మను తలచుకొని ఏడుస్తున్నది."

నాయనమ్మకోపం కాస్త కరిగి దయగా మారింది. "తెలివైన పిల్లవు! నేనెప్పుడో చెప్పిన దానిని ఇంకా జ్ఞాపకం పెట్టుకున్నావు. ఆ మాట ఇప్పుడు అప్పజెపుతున్నావు."

రాహుల ఇంట్లో అలవాటుపడటానికి వారం పట్టింది. కాలం గడిచే కొద్దీ మొరగటం మానేసింది. భయం కూడా తగ్గిపోయింది. పాత గుడ్డలు పోగుచేసి మెత్తని వెచ్చని పక్క ఏర్పాటు చేశాను. అన్నం తినటానికి పెద్ద గాజుప్లేటు, తోలుబెల్టు కొన్నాను. వారాని కొకసారి చెన్న దానికి నీళ్లు పోస్తున్నాడు.

రాహుల నేను మంచిస్నేహితులమయ్యాం. నేను బడి నుంచి ఇంటికి రాగానే

దాన్ని షికారు తీసుకువెళుతున్నాను. దానికి నేను తప్ప ఎవరూ తిండిపెట్టకూడదు. అన్నమూ, పాలూ నేనే యిస్తున్నాను. స్నానం మాత్రం చేయించటం లేదు. ఎందుకంటే నీళ్ళు చూడగానే అది పరుగెత్తుతుంది. ఒకరోజు స్నానం చేయించబోతే నన్ను నెట్టివేసి నీళ్లగోతిలో పడవేసింది. తొట్టిపక్కన తోక వూపుకుంటూ నిలబడింది. దానికి స్నానం చేయించటం అదే ఆఖరుసారి.

నాయనమ్మ మడీమైలా పట్టింపు రాహులకు అర్థం కావటం కష్టమైంది. మాలో ఎవర్ని చూసినా ముందు పైకెగిరి దాని ముందరి కాళ్లు రెండూ మామీద పెడుతుంది. బుజ్జగిస్తూ దువ్విన తరువాత మృదువుగా తట్టి మాట్లాడిన తర్వాత వదిలిపెడుతుంది. నాయనమ్మ బయటికి వచ్చినప్పుడల్లా ఎవరో వొకరు రాహులను పట్టుకొని గొలుసుతో కట్టివేయవలసి వచ్చేది. ఒకసారి రాహుల కట్టేసివుండని నాయనమ్మ బయటికి వచ్చింది. అలవాటు కొద్దీ రాహుల ఆమెను పరామర్శ చేయటాని కన్నట్లు మీదికి దూకింది. నాయనమ్మ పెద్దగా కేకపెట్టి ఇంట్లోకి పరుగెత్తింది.

"నేను చేసిన పూజలన్నీ ఏమైపోయాయి? ఈ ముదనష్టపు దానికోసం మైల పడవలసి వచ్చింది. 'శుద్ధి' చేసుకోవాలి" అన్నది నాయనమ్మ.

చెన్న రాహులను రెండు తగల్నిచ్చాడు. నాయనమ్మ మైల వదుల్చుకోవటానికి మంత్రాలు చదివింది. ఉపవాసం చేసింది. బిచ్చగాళ్ళకు అన్నదానం చేసింది. ఆ రోజు నుంచి రాహుల నాయనమ్మ దగ్గరకు పోవటం లేదు. ఆమెను చూసినప్పుడు దూరంగా నిలబడి తోకవూపేది. అది నాయనమ్మకు నచ్చింది. "తెలివైనదే. చెన్న దాన్ని కొట్టినప్పటి నుంచి నా జోలికి రావటం లేదు" అన్నది. నాయనమ్మ వడియాలవీ ఎండబెట్టినప్పుడు రాహుల కాకులు వాటి దగ్గరకు రాకుండ కాపలా కాసేది. ఆ విధంగా నాయనమ్మను కూడ మంచిచేసుకున్నది. మరొకసారి దొంగ యింట్లో జొరబడబోతే మొరిగి అందరినీ నిద్రలేపింది. అప్పటినుంచి నాయనమ్మ దాన్ని పొగడటం మొదలు పెట్టింది. తాము కిందటి జన్మలో చేసుకున్న పుణ్యం వల్ల రాహుల దొరికిందనీ, సరిగా దాన్ని చూడకపోతే భగవంతుడు మెచ్చడనీ నాయనమ్మ నిర్ణయించుకొన్నది. తాను తినే అన్నం రాహులకు కూడ పెట్టేది.

ఒక సంవత్సరంలో రాహుల బాగా పెరిగి పెద్దదై ఎలుగుబంటిలాగైంది. రొట్టె, పాలు తినటమే గాక - చెన్న దానికి వారానికి ఒకసారి వండిపెట్టే మాంసంతో బాగా బలిసింది. వెనక కాళ్ళమీద నిలబడినప్పుడు దాదాపు నా అంత పొడుగున్నది.

గడ్డిపోచ గూడ చూపునుంచి తప్పించుకొని పోకుండ అది జాగ్రత్తగా కాపలా కాసింది. కొత్తవాళ్లకు ఎంత భీకరంగా కన్పిస్తుందో తెలిసిన వాళ్ళతో అంత మర్యాదగా మాలిమిగా వుండేది. నాకు స్నేహితురాలూ, అంగరక్షకురాలూ అయింది. రాహులు కూడావుంటే చీకట్లోనైనా భయం లేకుండ వొంటరిగా వెళ్ళగలను. నేనూ నాయనమ్మా గుడికివెళ్ళినప్పుడు మాతో వచ్చి గుడి బైట మేం వదిలిన చెప్పులు కాపలా కాసేది. నాయనమ్మ పెట్టిన అరటిపండు తినేది.

స్నేహితురాలు మాలతీ నాన్నకు బెంగుళూరు బదిలీ అయింది. వెళ్ళబోయే ముందు ఆ అమ్మాయి నాకు కుక్కపిల్ల నొకదాన్ని యిచ్చింది. అది పుట్టి పదిరోజులే అయింది. దానికి రాణీ అని పేరుపెట్టాం. అది తెల్లగా ఒక్క మచ్చ కూడా లేకుండ వెన్నెలలా వుంది. కళ్ళు లేత నీలం రంగులో వుండేవి. రెండు కుక్కలకూ ఎంత తేడా! మచ్చిక చెయ్యని అడవి మృగం లాగుంది రాహుల; మృదువుగా, స్త్రీలాగా కోమలంగావుంది రాణీ. రాహుల ఉప్పొంగుతున్న సముద్రమైతే రాణీ మైదానం మీద నెమ్మదిగా పారే సెలయేరు.

తోడు దొరికినందుకు రాహుల సంతోషిస్తుందని తెలుసు. రాణీని దాని దగ్గరకు తీసుకువెళ్లి "చూడు, నీ రాణీని!" అన్నాను. రాహుల మూలిగింది. రాణీ ముదుచుకుపోయింది. రాహులను తట్టి కోప్పడ్డాను. "మొద్దా! రాణీతో యిలాగేనా మెలిగేది?" అన్నాను. రాహుల పళ్లెంలో పాలుపోసి రాణీ ముందు పెట్టాను. రాహుల దానివైపు చూసి, కోపంగా మొరిగింది.

నేను చెన్ననుపిలిచి రాహులకు తిండి పెట్టమన్నాను. చెన్న అన్నమూ, పాలూ కలిపి ఒక కొబ్బరి చిప్పలో వేసి దాన్ని రాహుల ముందుపెట్టాడు. రాణీ తన పళ్లెంలో తినటాన్ని చూస్తూ రాహుల తన పళ్లెంవైపు చూడనైనా లేదు. రాణీ తినటం పూర్తయ్యాక కొబ్బరిచిప్పలో అన్నమూ, పాలూతీసి యీ పళ్లెంలో వేసి, దానిముందు పెట్టాను. ఏమి పేచీపెట్టకుండ తిన్నది.

చీకటి పడ్డాక రాణీ వణకసాగింది. జాలివేసి రాహుల పక్కలో పడుకోబెట్టాను. రాహుల కోసం వేరే పక్క వేశానుగాని అది దానిమీద పడుకోకుండ నేలను నాకసాగింది.

కొత్త చోటుకు అలవాటు పడేదాక రాణీని మాలిమి చెయ్యవలసి వచ్చింది. నాయనమ్మ మడీమైలా తెలుసుకొని వంటింట్లోకి పోకుండ వుండేటట్లు శిక్షణ యివ్వవలసివచ్చింది. అందుకని దానితో కొన్నిరోజులు నేను గడపవలసి వచ్చింది.

చెన్న రాహుల సంగతి చూసేవాడు. అంతేగాక రాహుల తన సంగతి తాను చూసుకునేటంత పెద్దవాడయ్యాడు.

రాణీ, రాహుల స్నేహం కోసం ప్రయత్నించింది. దాని అభిమానం సంపాదించటానికి ఎన్నో విధాల పాటుబడింది. కాని రాహులకు దాని పొడే గిట్టలేదు. దగ్గరకు వెచ్చదనం కోసంవచ్చిన క్షణమే, కర్కశంగా కొరకబోయేది.

ఒక సాయంత్రం అరుగుమీద కూర్చొని పుస్తకం చదువుకుంటున్నాను. రాణీ బంతి తోసుకుంటూ ఆడుకొంటున్నది. దగ్గరలో రాహులను చెట్టుకు కట్టివేశాను. అది రాణీ ఆడుకోవటం కనిపెట్టింది. రాణీ బంతిని నోటకరుచుకోవాలని ప్రయత్నిస్తున్నది. బంతి జారిపోయి దూరంగా పోతున్నది. రాణీ దాని వెనక పరుగెత్తి దాన్ని పళ్ళ మధ్య ఇరికించి పట్టుకోవాలని చూస్తున్నది. బంతి రాహుల దగ్గరగా వచ్చింది. రాణీ బంతిని తీసుకోవటానికి వెనుకాడింది. అది తీసుకొనేలోగా రాహుల భయంకరంగా మొరిగి దానిమీద పడింది. రాణీ 'కుయ్యో' మని అరిచి సాయం కోరింది. నేను పుస్తకం విసిరి పడేసి దాన్ని కాపాడబోయాను. రాహుల రాణీ మెడమీద తన కోరపళ్లను దిగవేసి పట్టుకున్నది. రాహులను తన్ని రాణీని వదిలించి, నా చేతుల్లోకి తీసుకున్నాను. అది భయంతో వణికిపోతున్నది. రాహుల మొరుగుతూ, పిచ్చిగా తిరుగుతున్నది. నోటి నుంచి చొంగ కారుతున్నది. నాకు కూడ దాన్ని చూస్తే భయం వేసింది. పాపం రాణీ తీవ్రంగా గాయపడింది. మంచులాంటి తెల్లని బొచ్చుమీద రక్తపు మరకలు పడ్డాయి. రాహుల మీద విపరీతమైన కోపం వచ్చింది. దానికి బుద్ధి చెప్పాలనుకున్నాను. చేతికర్రతో నాలుగు తగలనిచ్చాను. అప్పటి నుంచీ రాణీని జాగ్రత్తగా చూడసాగాను.

ఒక ఆదివారం మధ్యాహ్నం రాహులను చెట్టుకు కట్టివేసి, నిద్రపోవటానికి ఇంట్లోకి వచ్చాను. దిండుమీద తల ఆనించానో లేదో రాణీ 'కుయ్యో'మని బాధతో అరవటం వినిపించింది. బయటికి పరుగెత్తాను. అక్కడ జరుగుతున్నది చూసి కదుపులో దేవినట్లయింది. రాహుల రాణీని పళ్లమధ్య ఇరికించుకొని తీవ్రంగా బాధిస్తున్నది. చాకలి బండమీద గుడ్డలుతికినట్లు నేలకేసి బాదుతున్నది. రాణీ అరిచి అరిచి సొమ్మసిల్లి పోతున్నది. రాహుల కళ్లు అసూయతో కోపంతో ప్రతీకారంతో మండిపోతున్నాయి. దాని దగ్గరకు వెళ్లాలంటే విపరీతమైన భయంవేసింది.

చెన్నను, అమ్మను, నాయనమ్మను బయటకు పిలిచాను. వాళ్ళు పరిగెత్తుతూ బయటికి వచ్చారు. చెన్న రాహుల దగ్గరకు పరుగెత్తి దాన్ని గట్టిగా తన్నాడు.

రాహుల కిందపడి రాణిని విడిచిపెట్టాడు. దాని వొళ్లంతా రక్తమే. రాహుల దాని పొట్ట చీల్చేశాడు. రాణి బాధగా మూలిగి కిందిపడి పోయి కదలటంలేదు.

రాహుల నోట్లోంచి రక్తం కారుతున్నది. దానివైపు తిరిగే సరికి తోకాడించి, కదలకుండ పడివున్న రాణిని చూచింది. తృప్తి చెందినట్లు కనిపించింది.

"చెన్న! రాహులను ఎవరు వదిలి పెట్టారు? గొలుసుతో కట్టేశాను." చెన్న తప్పు చేసిన వాడిలాగ "స్నానం చేయించాలి. విడిపించి సబ్బుకోసం లోపలికి వచ్చాను. తిరిగి వెళ్లబోయేలోగా చిన్నదాన్ని చంపేసింది పాపం!" అన్నాడు.

రాహుల మీద నాకు పట్టరాని కోపం వచ్చింది. కొట్టటానికి ముందుకు అడుగువేశాను.

"దగ్గరకు పోవద్దు. దానికి పిచ్చెక్కింది. నిన్ను కరుస్తుంది" అని అమ్మ అరిచింది.

"పిచ్చా?" కలవరపడ్డాను.

"కావొచ్చు, లేకపోతే రాణిని చంపదు."

"పిచ్చిది కావటానికి వీల్లేదమ్మా! ఇది ఋతువు కాదు" అన్నాను.

"ఈ సంగతులు నీకేం తెలుసు? పిచ్చి ఒక ఋతువులోనే వస్తుందాయేం? దాని దగ్గరకు పోవద్దు" నాయనమ్మ అభ్యంతరం తెలిపింది.

నా కోపం పోయింది. రాహులలో పిచ్చేమీ కనపడలేదు.

"చెన్న రాహలకు విషం తీసుకురా. అన్నంలో విషం కలిపిపెడదాం. పిల్లలున్న ఇంట్లో పిచ్చికుక్క వుండటం చాల ప్రమాదకరం."

"వద్దమ్మా. రాహులకు విషం పెట్టొద్దు" అని బతిమాలుతూ ఏడ్చాను. కాని లాభం లేకపోయింది. నా కన్నీళ్ల వల్ల రాహుల మీద ఎవరికీ జాలికలగలేదు.

మరునాడు చెన్న విషం కలిపిన అన్నం తీసుకొని రాహుల దగ్గరకు వెళ్లాడు. రాహుల తోకాడిస్తూ ఆనందంతో గంతులు వేసింది. దగ్గరకు వెళ్లటానికి చెన్నకు భయం వేసింది. కొంత దూరంలో పళ్లెం పెట్టి ముందుకు జరపసాగాడు. రాహుల అన్నం వైపు చూడనైనా చూడలేదు. నా దగ్గరకు రావటానికి ప్రయత్నించాడు. అది అన్నం ముట్టుకోకపోవటం గమనించిన అమ్మ "లీలా! నీవు ఆ పళ్లెం దాని ముందు పెట్టు" అన్నది.

నేనా బిడ్డలాగ పెంచిన దానికి విషమెలా పెడతాను! పెట్టనన్నాను.

నాయనమ్మ చెన్న వైపు తిరిగి "పళ్లెం దాని ముందుకు నెట్టు. దానికి ఆకలైతే అదే తింటుంది" అన్నది. చెన్న పళ్లేన్ని కుక్క ముందుకు జరిపాడు. అంతకు

ముందు రాత్రి రాహుల అన్నం తినకపోవటంవల్ల ఆకలిగా వున్నది. నా వంక పక్క చూపులు చూసింది, తోకాడించింది, తర్వాత అన్నం తినసాగింది. నేనింక సహించలేకపోయాను. గదిలోకి వెళ్ళి తలుపు వేసుకున్నాను.

ఆ తర్వాత మరెప్పుడూ కుక్కని ఇంటికి తీసుకురాలేదు.

# సుందర్ - 'చుక్క తోక'

## కరూర్ నీలకాంత పిళ్ళై

పన్నెండేళ్ళ సుందర్ ఊళ్ళో ఆవులకాపరి. రోజంతా పనిచేసినందుకు అన్నము, కూర దొరుకుతాయి.

ఒక వేసవికాలపు ఉదయం అతను ప్రొద్దున్నే మూడు ఆవుల్ని మేపుకురావటానికి వెళ్ళాడు. వాటికి అతను "వంకర కొమ్ములది, కాటుక కళ్ళది, చుక్క తోకది" అని పేర్లు పెట్టాడు. అతని భుజంమీద నుంచి అన్నం మూట వేళ్ళాడుతున్నది. సంచిలో చిన్న కత్తిని, పిల్లనగ్రోవిని పెట్టుకున్నాడు. మైలుదూరంలో పచ్చిక మైదానంలో ఆవుల్ని మలుపుతున్నాడు.

పచ్చిక మీద చెట్లు దుబ్బులా దట్టంగా పెరిగాయి. ఆ సమయంలో పెద్ద కరువొచ్చి అంతా ఎండిపోయింది. పశువులకు మేత లేదు. మేతకు ఏదో కొద్ది ఆకులు తప్ప ఏంలేవు.

సుందర్ ఎప్పుడో తప్ప పశువుల్ని బయటకు తోలుకు పోవటంలేదు. వాన కురిస్తే పశువులు కొష్టాల్లోనే ఉంటాయి. కోతల కాలమైతే పెద్దగా పని వుండదు. పశువులు తమంతట తామే వరిగడ్డి మేస్తాయి. వేసవికాలంలో మాత్రం పశువులకు మేత కరువు వొచ్చినప్పుడు వాటిని పచ్చిక మైదానానికి తోలుకు పొమ్మంటారు. ఈ పని సామాన్యంగా పక్షం రోజు కంటే వుండదు. ఈ రెండు వారాల్లోనే అతనికి పశువులతో విడదీయలేని బంధం ఏర్పడుతుంది.

పచ్చిక మేసే మైదానం పక్కనే ఓ చిక్కని అడవి వుంది. దాన్లో ఎన్నో రకాల చెట్లున్నాయి. ఆ చెట్లలో నక్కలు, కోతులు, ముండ్ల పందులు, కుందేళ్ళు, ఏదు పందులు, లేళ్ళు-ఎన్నోరకాల జంతువులు ఆశ్రయం పొందుతున్నాయి. అప్పుడప్పుడు అడవిలో ఏనుగులు కూడ కన్పిస్తుంటాయి. కాని అడవి ప్రభుత్వం వారి అధీనంలో వుంది. పశువుల్ని మేపటానికి అనుమతి లేదు.

ఆ రోజు ఉదయం సుందర్ ఆవుల్ని నిషేధించిన చోటుకు పోనిచ్చాడు. జీడిమామిడి చెట్టుమీద కూర్చొని జీడి గింజలు వొలుచుకు తింటున్నాడు. ఆవులమందలకు పూల పక్కలు పరిచాడు. అవి అడవిలోకి పోతున్నప్పుడు వెనక్కి మళ్ళించటానికి పిల్లంగ్రోవిని వూదాడు. వాటి పక్కలు నిమిరి, అడవిలోకి పోవద్దని నెమ్మదిగా మందలించాడు.

సుందర్ వెదురు బొంగు కొక రంధ్రం చేసి దాన్లో ఒక కాయను దూర్చాడు. దాన్ని ఒక చివరవూదితే కాయ తుపాకి గుండులా దూసుకుపోతుంది. దాన్తో తొండల్ని, ఉడతల్ని తోలాడు. చెట్లమీదుగా పాకాడు. పక్షి గూళ్ళలోకి చూశాడు. ఆకులకు ముళ్ళు గుచ్చి టోపీలు చేశాడు. కొంతసేపు దేవుడి తిరునాళ్ళలో చూసిన గరుడ నృత్యం చేశాడు.

అడవికి పచ్చిక మైదానానికి మధ్య ఒక సెలయేరు వున్నది. దాన్లో ఎక్కువ నీరు లేదు. ఉన్న నీరు ఆవుల్ని కడగటానికి సరిపోదు. పశువులు దప్పిక చల్లార్చుకోవటానికి, అతను అన్నమూ సంకటీ తిని నీళ్ళు త్రాగటానికే చాలీచాలనట్లు సరిపోతుంది.

మధ్యాహ్నం పూట ఆవులు నీడన నిలిచి నెమరు వేస్తుంటాయి. సుందర్ రాతిని చేరబడి వున్నాడు. ఒక కోతి అక్కడికి వచ్చింది. అతను వెదురు గొట్టంలోనుంచి రాతిని విసరి దాన్ని బెదరగొట్టి దూరంగా తరిమివేశాడు. నిద్రమత్తుగా వుండి, నేలమీద ఆకులు పరిచిన చోట జారగిలబడ్డాడు. క్రితం రాత్రి నిద్రలేకపోవటాన ఇప్పుడు నిద్ర ముంచుకొచ్చేసింది.

సుందర్‌కి పట్టిన గాఢ నిద్ర అతనికి దగ్గరగా నక్కలు కూయటంతో చెదిరిపోయింది. ఉలిక్కిపడి లేచాడు. రాత్రయింది. ఎటు చూసినా చిమ్మ చీకటి. అతనికి తన మూడు ఆవులు కనిపించలేదు. బహుశా నక్కలు వాటిని బెదరగొట్టి దూరంగా తరిమివేశాయోమో! లేకపోతే నక్కలు వాటిని చీల్చి వేశాయా? నక్కలు వాటి చెవులను పొదుగుల్ని కొరికి వేసి చావమని వదిలివేశాయా? నక్కలకు సామాన్యంగా పిచ్చికుక్క వ్యాది వుంటుంది. నక్కలు కరిచిన కుక్కలకు పిచ్చెక్కుతుంది. ఆవులకు కూడ తప్పకుండ అంతే అవుతుందేమో ! పిచ్చెక్కిన ఆవును ఎవరేనా ముట్టుకుంటే వాళ్ళకూ పిచ్చి యెక్కుతుందంటారు. లేకపోతే అవి అడవిలో జొరబడి పులి వాత బడ్డాయా? పెద్ద వాళ్ళకు తెలిస్తే ఎలా? నక్కలు తనని పట్టుకుంటే ఎలా?

సుందర్‌కి చాల భయం వేసింది. కాని శాంతంగా వున్నాడు. రాతికి నెమ్మదిగా

ఆవలి పక్కకు జరిగి, కాళ్ళతో, చేతులతో నేలను తడిమాడు. సంచిలో తాను పెట్టిన మూడు రాళ్ళు చేతికి తగిలాయి. తర్వాత రాతి మీది కెక్కి రాళ్ళలో పెద్ద రాతిని నక్కల వైపు విసిరాడు. రాయి సూటిగా వెళ్ళి తగిలింది. రాయి పడినచోట ధడ్‌మన్న చప్పుడు నక్క బాధగా అరవటమూ వినిపించాయి. మరి రెండు రాళ్ళను తన వెదురు గొట్టపు తుపాకి ద్వారా మొదటి దాన్ని విసిరిన వైపు విసిరాడు. ఈ సారి కూడ అవి సరిగ్గా వెళ్ళి తగిలాయి. నక్కలు దూరంగా వెళ్ళి అరవసాగాయి. సుందర్ రాతిమీద నుండి కిందికి దిగాడు. ఐదారడుగులు నడిచాడో లేదో అతని పాదాలు ఒక చెట్టువేళ్ళలో చిక్కుకొన్నాయి. చేతులతో తడిమి, ఒక బలహీనమైన తీగ చెట్టుకు చుట్టుకొని వుండటాన్ని చూచాడు. చెట్టు కొమ్మమీదికెక్కి భద్రంగా కూర్చున్నాడు.

ఉన్నట్లుండి తీతువు పిట్ట కూసింది. “కార్చిపారెయ్యండి, కార్చిపారెయ్యండి” అని అరిచినట్లు వినిపించింది. భయం ఎక్కువయింది. దేవుడే తనని కాపాడాలని ధైర్యం తెచ్చుకున్నాడు. నెలవంక కాంతి కొద్దిగా ప్రసరించటం వల్ల బాగా చూడగలిగాడు. చెట్టు కానుకొని ఒక కోతి చేరబడి వున్నట్లు గమనించాడు. జాగ్రత్తగా చెట్టుకొమ్మలమీద జరిగి కోతికి సరిగ్గా పైభాగానికి జరిగాడు. తర్వాత సంచిలో రాళ్ళను దాని నెత్తిమీద వేశాడు. కోతి బాధగా అరిచి పారిపోయింది. దాని జతగా వుండే కోతులు కొమ్మలమీద వున్నవి కూడ అరిచి, చెట్టు మీదనుంచి కిందకు దుమికేశాయి. సుందర్ తప్పించుకు పోవటానికి అదే మంచి అదను. చెట్టుమీదనుంచి కిందికి దిగి, తన దగ్గరున్న కత్తితో ఒక కర్రను చెక్కి దాంతో పొదరిళ్ళను దారినుంచి పక్కకు తొలగించాడు. వెనుదిరిగి రాతి దగ్గరకు వెళ్ళి దానిమీద ఎక్కి కొద్దిసేపు పడుకున్నాడు. అప్పటికి నెలవంక కనిపించకుండాపోయి ఆకాశంలో కొద్ది నక్షత్రాలు మాత్రం మినుకుమినుకు మంటున్నాయి.

సుందర్ ధ్యాసంతా ఆవులమీదే వున్నది. పాపం అవి చీకట్లో దోవ తప్పి వుంటాయి. వాటికి సాయం ఎవరూ లేరు. తన పిల్లన గ్రోవి వూదాడుగాని నక్కల కూతల్లో కలిసి పోయిందాపాట.

ఆకలి దప్పిక బాధిస్తున్నాయి. పండ్లుకోసుకు తినవచ్చు కాని చీకట్లో కళ్ళు కన్పించటంలేదు.

కాస్సేపటికి అతని కొక దీపం కన్పించింది. మనుష్యులా లేకపోతే కొరివి దయ్యాలేమోనని భయం వేసి సుందర్‌కి చెమట్లు పట్టేశాయి.

గుడ్డి వెలుతురు మాత్రమే వున్నది. హఠాత్తుగా నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ పెద్ద చప్పుడైంది. సుందర్ చెవులొగ్గి విన్నాడు. చెట్టు పడిపోయిన శబ్దం కాదది. ధైర్యమంతా కూడగట్టుకొని కాళ్ళూ చేతులు ఉపయోగించి రాతిమీదనుంచి దిగి దీపం వైపుకు వెళ్ళాడు.

నలుగురైదుగురు మనుష్యులు ఒక మృత జంతువు తోలు వొలుస్తున్నారు. నాలుగు నెల్ల కిందట పెయ్యి దూడను పెట్టిన తన చుక్కతోక ఆవు అది. సుందర్ చెట్టు వెనుక దాక్కొని ఏం జరుగుతున్నదో చూడ సాగాడు. ఒక సీసానిండా వాళ్ళు మిణుగురు పురుగుల్ని దీపంలా పెట్టుకున్నారు. అతను నరికిన ఆ ఆవు తలవైపు సరిగ్గా పరీక్షగా చూసి అది తన కిష్టమైన చుక్కతోక ఆవు కాదనీ, ఒక ముసలి తెల్ల ఎద్దు తల అని తెలుసుకున్నాడు. బరువు తగ్గినట్లయి హాయిగా నిట్టూర్పు విడిచాడు. దాన్ని చూడటంతో అతనికి ధైర్యం వచ్చింది. చేయవలసిందల్లా మిణుగురు పురుగులున్న సీసా దొంగిలించటమే. దొంగలు దాన్ని గుడ్డతో మూసి ఒక పక్క మాత్రం తెరిచి వాళ్ళకు కావలసిన వేపే తెరుస్తున్నారు. వాళ్ళు ఆ దొంగ పనిచేస్తున్నప్పుడు సుందర్ చప్పుడు కాకుండా సీసాను తీసుకొని దానిమీద గోనె పట్ట కప్పి చెట్టు దగ్గరకు తిరిగి వెళ్ళిపోయాడు.

ఈ గుంపులో వొకడు "ఇక్కడ దీపం కాస్త చూపించు" అని అరవటం వినిపించింది. రాతిమీద పెట్టిన దీపం కోసం వొకడు ప్రక్కకు తిరిగాడు. అది లేదక్కడ. సీసా ఎక్కడికి పోయింది! వాళ్ళలో వాళ్ళు వాదించుకొని పోట్లాడుకోసాగారు.

"నేనిక్కడే పెట్టాను. ఖచ్చితంగా యిక్కడే పెట్టాను."

"జాగ్రత్తగా చూడు! అక్కడే వుంటుందది."

"నే నిక్కడే యీ రాతిమీదే పెట్టాను."

"ఎవరో మనల్ని చూశారు. మనం ఉన్నపళంగా దొరికిపోతాం. తప్పించుకు పోదాం." చేతికందిన మాంసాన్ని దొరకబుచ్చుకొని వాళ్ళు వెనుదిరిగి పరుగెత్తారు. చచ్చిన జంతు కళేబరాన్ని వదిలి వాళ్ళు చిందరవందరగా పారిపోయారు. హఠాత్తుగా వాళ్ళకు పిల్లన గ్రోవి పాట వినిపించగానే వాళ్లు బిర్రబిగుసుకు పోయారు. కత్తులు జార విడిచేసి చెట్టెక్కటానికి పరుగెత్తి పోయారు.

పిల్లన గ్రోవి పాట ఒక నక్క చెవులకు సోకింది. అది తల ఎత్తి అరవసాగింది. మిగిలినవి కూడ దాంతో గొంతు కలిపాయి. అవి మాంసం వాసన పట్టాయి. జంతు కళేబరం మీద వాలాయి. చెట్టు మీదనుంచి దొంగల గుంపు నిస్సహాయంగా,

దిగులుగా, తాము చంపిన ఎద్దు మాంసాన్ని నక్కలు చీల్చి తినటం చూచారు.

సుందర్ యిప్పటికి కాస్త స్తిమిత పడ్డాడు. చీకట్లో చూడటానికి అతని కళ్ళిప్పటికి అలవాటు పడ్డాయి. తన ఆవుల్ని పిలుస్తూ పిల్లనగ్రోవిని ప్రయోగించసాగాడు. అడవిలో పక్షులు, మృగాలు అలజడి పడ్డట్లు కనిపించాయి. పక్షులు కువకువమని కిచకిచలాడాయి. చిన్న జంతువులు వాటిని అనుసరించి కూశాయి. బెదిరిన లేడి అరుపు అంతటా వినిపించింది. కాని అతని ఆవుల జాడలేదు.

భయం అతని కాళ్ళకు రెక్కల్ని యిచ్చినట్లయి పరిగెత్తసాగాడు. ముళ్ళు, ముళ్ళతీగలు అతని కాళ్ళకు చేతులకు గీసుకుపోయి, గాయ పరిచాయి. హఠాత్తుగా అతను ఒక చెట్టు వేళ్ళు కాళ్ళకుతగిలి బోర్లా పడ్డాడు. అదృష్టవశాత్తు దగ్గరున్న మిణుగురు పురుగుల సీసా పగల్లేదు. దాని గుడ్డి వెలుతురులో తన మోకాలు కింద బాగా గీసుకుపోయిన గాయాన్ని, రక్తం కారటాన్ని చూచాడు. రక్తం ఆగటానికి సంచి గుడ్డను గాయానికి కట్టుకట్టాడు. చాల బాధగా వుండి లేచి నిలబడలేకపోయాడు.

రక్తం వాసన పట్టి క్రూరమృగాలు గనక వస్తే, బతికుండగానే తినివేస్తాయని సుందర్ భయంతో వణికిపోయాడు. లేకపోతే వంటికి చీమలు పట్టి తినివేస్తాయి! ఎంతఘోరం!

గాయాల్ని మందులకు పనికొచ్చే చెట్టు ఆకులతో శుభ్రం చేసుకున్నాడు. మిగిలిన కొద్ది బలాన్ని పుంజుకొని ప్రియమైన చుక్కతోకను పిలిచాడు. అతని అరుపు చిన్న గొణుగుడు కంటె పెద్దగా రాలేదు. పూర్తిగా అలిసిపోయి సుందర్ నిద్రపోయాడు.

జరిగింది చాల సామాన్యమైన విషయమే. ఆవులు కడుపునిండా మేత మేశాయి. నెమరువేసిన తర్వాత సుందర్‌తో ఇంటికి వెళ్దామని సూచిస్తూ అంకెవేశాయి. సుందర్ గాఢమైన నిద్రపోతూ వాటి అంకెల్ని పట్టించుకోలేదు. చుక్కతోక అతని కాలు నొక్కితే దాన్ని గట్టిగా తన్నాడు. ఆవులు సుందర్ లేకుండానే పల్లెకు తిరిగి వెళ్ళాయి. కట్టు గొయ్యలకు వాటిని కట్టి వేశారు.

రాత్రయినా కూడ సుందర్ ఇంటికి రాకపోతే తండ్రి అతని కోసం ఎదురు చూడసాగాడు. ఆవులు తిరిగి వచ్చాయని తెలుసుకొని సుందర్ దేవాలయంలో ఉత్సవం చూడటానికి వెళ్ళి వుంటాడని తలిచి, ఇంటికి వచ్చేశాడు.

మరునాటి ఉదయం చుక్కతోక ఆవు ఎవరు పాలు తీయబోయినా తియ్యని వ్వలేదు. ఎవరు దగ్గరికి వచ్చినా మొండి కేసి తన్నింది. గ్రామస్తులు దానికి జబ్బు చేసిందనుకున్నారు. ప్రతివారూ దానికి జబ్బేమిటో చెప్పసాగారు.

"దానికి పాము కరిచింది."

"అడవిలో విషపు మొక్క ఆకులు తిని వుంటుంది."

చివరికి ఇంటి ఇల్లాలు దానికి రోజూ వేసే కొబ్బరి చెక్క వేయవద్దనీ, కుడితి పెట్టవద్దనీ గంజిలో ఉప్పు వేసి తాపమని చెప్పింది.

దాని పాలు తీయలేదు. దూడను కూడ ఆకలితో వుంచేశారు. పశువుల పాకలో రెండింటినీ వేర్వేరుగా కట్టివేశారు.

కొద్దిసేపయ్యాక ఆమె ఉప్పువేసిన ఓయ్యాపు గంజి తీసుకొని పశువుల పాకలోకి వెళ్ళింది. 'చుక్కతోక' ఆవు అక్కణ్ణించి అదృశ్యమయింది.

ఇంటి యజమానురాలు ఆందోళనపడి అందరినీ కోప్పడింది. "ఆవును పాకలో నుంచి బయటికి పోనియ్యవద్దని చెప్పలేదా? సుందర్ నా మాట కాదని బయటికెందుకు తోలుకు వెళ్ళాడు?" అన్నది.

వాళ్ళు మేకుకు కట్టివేసిన కట్లుతాడు తెగి వుండటం చూశారు. "చూడండి, అది తప్పించుకు పోయింది. ఇంకా ఎక్కువ దూరం పోయివుండదు."

చుక్కతోక ఆవుకోసం అన్ని చోట్లా వెతికారు. ఎక్కడా ఆవుగాని, ఆవులకాపరి సుందర్ గాని కన్పించలేదు. సుందర్ తండ్రి చుక్కలతోక ఆవు యజమానురాలు వెతకటానికి అడవికి బయలుదేరారు. ఇతరులు కూడ వాళ్ళతో కలిసి వెతకసాగారు.

చుక్కతోక ఆవు క్రితం రాత్రి సుందర్ నిద్రపోతూ వున్నవైపు బయలుదేరింది. అతనిప్పుడు అక్కడలేడు. చుక్కతోక ఆవు అతని కోసం పిచ్చిగా వెతకసాగింది. ముందు అది సుందర్ సంచిని చూసింది. ఆ సంచి చూసిపోయి, చిరిగిపోయి వున్నది. తర్వాత మళ్ళీ వెతగ్గా సుందర్ కన్పించాడు. అతను ఒంటినిండా గాయాలతో. నిద్రపోతున్నాడు. ఆవు దీర్ఘంగా నిట్టూర్పు విడిచి అతని శరీరం నాకసాగింది.

అతని గాయాలమీద ముసిరివున్న యీగల్ని, చీమల్ని నాకి వేసింది. ఆవు పొదుగు భారమై చేపు వచ్చి, దాన్లోంచి పాలు కారసాగాయి. అది పడుకొని తన పొదుగును అతడు అందుకోవటానికి వీలుగా సుందర్ ముఖంవైపు తిప్పింది. అతను పొదుగును నోట్లో పెట్టుకొని అచ్చం దూడ కుడిచినట్లే పాలు కుడవసాగాడు. నెమ్మదిగా అతని కాళ్ళకు చేతులకు శక్తి వచ్చింది. వాళ్ళను వెతకటానికి వచ్చిన వాళ్ళు చుక్కతోక ఆవును, సుందర్‌ను ఆ విధంగా చూసి ఆశ్చర్యచకితులయ్యారు.

# నువ్వు ప్లాస్టర్ ఫినేవే గదా!

## బి. ఆర్. భగవత్

నందూనవత వోర్లీలో వుండేవాడు. అతను నిజమైన బొంబాయి నివాసి. బనేష్ ఫినే (ప్లాస్టర్ ఫినే అని పిలిచేవారు.) అనే అబ్బాయి పూనాలోని విద్యాభవన్ విద్యార్థి. "ఈ ప్రపంచమంతా నా ఇల్లే" అనేది అతని సిద్ధాంతం. అట్లా తిరుగుతూ వుండే బనేష్‌ను దాదాపు తన వాకిలి ముందు కలుసుకోవటం నందూకు వింతగా అనిపించింది. అనుకోని ఆ అవకాశం చిత్రమైన పర్యవసానం ప్లాస్టర్ ఫినేపై పడింది. అదీ నందూ మూలంగా!

నిజానికి బనేష్ నందూ ఇంటికి ఆహ్వానింపబడలేదు. వాళ్ళిద్దరికీ పరిచయం కూడ లేదు. ప్లాస్టర్ ఫిన్ అందరికీ తెలిసినట్లే నందూకు తెలుసుననుకోండి. అతని ధైర్యం, ప్రయోజనకరమైన సాహసకృత్యాలు బనేష్ నందూనవత అద్భుతమైన కథలల్లే కల్పనాశక్తిని గూర్చి విన్నాడు. కథలు చెప్పే నందూ కాల్పనిక ప్రపంచాన్ని సృష్టించగలడు.

ఈ ఇద్దరు యువవీరులూ మొదటిసారిగా నందూ ఇంటి దగ్గరలో వున్న దివ్యమైన ఒక భవనంపైన కలుసుకున్నారు.

పెద్ద పిల్లల గుంపు అక్కడికి చేరింది. ప్రఖ్యాతమైన ఖోకా మందుల కంపెనీ చిత్రలేఖనంలో పోటీని నిర్వహించింది. జాకీ దగ్గు మందులను ప్రచారం చెయ్యటానికి అన్ని రకాల ప్రచార పద్ధతులను ప్రయత్నిస్తున్నారు. ఆ ప్రచార పద్ధతులలో చివరగా తమ శక్తినంతా వుపయోగించి బోలెడన్ని బెలూన్లు వదిలారు.

కదిలే రబ్బరు బూరలు కొండమీద సరస్సులో తేలే తామర పూలలాగా వున్నాయి. వందల లెక్కలో వున్నాయి. రబ్బరుతో చేసినవీ, ప్లాస్టిక్‌తో చేసినవీ రెండూ వున్నాయి. వాటి ముందు రంగులతో వ్రాసిన మాటలూ బొమ్మలూ తదేకంగా చూస్తూ చాలమంది పిల్లలు కూర్చున్నారు. ఊరికే కూర్చోవటంగాదు. తాము

ప్రదర్శించిన వస్తువులలోని కళను ప్రయోగాత్మకంగా చూపించాలి. కాన్వాసు గుడ్డమీద గాని ప్లాస్టిక్ మీదగాని కళను ప్రదర్శించాలి.

బాలురు, బాలికలూ అనేక వరసల్లో కూర్చున్నారు. ఒకరు వ్రాసింది మరొకరు నకలు చేయకుండ ఒక వరుస తూర్పుకు తిరిగి వుంటే ఇంకొక వరుస పడమటికి తిరిగి వున్నది.

రబ్బరు బూరమీద ఆకర్షణీయమైన బొమ్మ చిత్రించి, దానిమీద 15 మాటలకు మించకుండ బాగా ఆకట్టుకునే పదాలు ఎర్ర రంగుతో వ్రాయాలి. యిదీ వారి పోటీ.

పిల్లలు వ్రాసే వాక్యాలు జాకీ మందును ప్రశంసించేవిగా వుండాలి. న్యాయనిర్ణేతలు అక్కడ చిత్రించబడిన రబ్బరు బూరలలో ఉత్తమమైన దాన్ని ఎన్నికచేసి, ఎన్నికైన వారికి బహుమతి ఇస్తారు. అంతేగాదు. ఎన్నికైన బొమ్మను, దానిపైన వాక్యాలను ఒక పెద్ద రబ్బరు బూరపై వ్రాసి ఆకాశంలోకి ఎగురవేస్తారు.

బొంబాయి నగరమంతా ఆ ప్రచార చిత్రాన్ని చూస్తారు. జాకీ మందు బిళ్ళలనీ, విజేత కళనీ కూడ చూస్తారు.

ఖోకా కంపెనీ వారి పెద్ద అందమైన రబ్బరు బూర డాబామీద మధ్యగా తాళ్ళతో బిగించాళు.

బనేష్ ఫినే బొంబాయిలోని మాతుంగాకు అత్త యింట్లో సెలవులు గడపటానికి వచ్చాడు. పత్రికలో ప్రకటింపబడిన పోటీని చూసి పాల్గొనాలనుకున్నాడు.

"నేను జ్ఞానేశ్వర్‌ను కాదని తెలుసు. వేల కొద్దీ పంక్తులు పద్యరూపంలో వ్రాయలేను. కాని పది పంక్తులు కలిపి వ్రాయటానికి, పెద్ద రచయిత కానవసరంలేదు" అన్నాడు అత్తతో.

"నీవు పాస్టర్ ఫినేవే గదా! నాకు ఆమాత్రం తెలియదా!" అని వాళ్ళ అత్త సమాధానమిచ్చింది. కానీ నీవు వ్రాసే వాక్యం మాత్రం నిజంగా బాగుండాలి. అది గెలిచేటట్లుండాలి! అంతేగాని అది కేవలం... అంటూనే దగ్గు రావటంతో ఆపేసింది. జాకీ దగ్గు బిళ్ళలకు మొదటి ఖాతాదారు దొరికింది.

"ఆపు" బనేష్ నోరు తెరుచుకొని అత్తవైపు ఎగాదిగా చూచాడు. కూర్చబోతున్న మాటలు పూర్తయ్యేలోగా "ఏమిటి సంగతి" అని అడిగింది అత్త మళ్ళీ దగ్గుతూ".

"నాకు ఒక ఆలోచన తట్టింది. నా బొమ్మ ఒక కప్ప. అది ఎవరో ఒకళ్ళగొంతులో ఇరుక్కుపోతుంది. అతను 'క్రోక్-క్రోక్' అని అరుస్తుంటాడు. తరువాత పంక్తి ఇది - దగ్గు ఆగకపోతే! జాకీ కంపెనీ దగ్గు బిళ్ళను చప్పరిస్తే

మేలు చేస్తుంది" చూడు 15 మాటలు కూడ లేవు.

అత్తయ్య దగ్గుతూ గదినుంచి వెళుతూ "పిచ్చిగా ప్రవర్తించకు" అన్నది.

పోటీ మొదలైంది. నందూనవత కూడ హాజరయ్యాడు.

నందూ హృదయం మంచిదేకాని పెద్ద పెద్ద కథలు చెప్పే అలవాటుంది. ఒకసారి మొదలు పెట్టాడంటే, దాన్లో అల్లుకు పోయి తను స్వయంగా వాటిని నమ్మేవాడు. కాని ఎప్పుడో అప్పుడు కథలు బయట పడి నందూ సిగ్గుతో కృంగిపోయేవాడు. ప్రాస్టర్ ఫినే సాహసకృత్యాలగురించి విన్నప్పుడు నందూకు కోపం వచ్చేది.

"ఆ ప్రాస్టర్ ఫినే తెలివి మితిమీరుతోంది" ఆయాసపడుతూ అన్నాడు నందూ. తనలాంటి ధైర్యస్థుడు ప్రపంచంలో ఎవరూ లేనట్లు! చూపేందుకు అవకాశం వస్తుంది నాకు లేదు, అంతే ప్రాస్టర్ ఫినే ఎక్కడికి వెళితే అక్కడ జనం - అదీ రోడ్డుకు రెండో వైపులా వుండి చూస్తారు. అదీ దౌర్భాగ్యం!

"అతన్ని ఆహ్వానించటం కోసం" అతని స్నేహితుడు ముసిముసిగా నవ్వాడు. "నేను వాళ్లను కలుసుకోను."

"నీవు ఎప్పుడూ పెద్ద సాహసకృత్యాలు చేసినట్లు నటిస్తావు" స్నేహితు డతణ్ణి ఎత్తిపొడిచాడు.

"ఇకచాలు" నందూ కోపంగా మౌనంగా వుండిపోయాడు. కాని అతను ప్రాస్టర్ ఫినే అంటే అసూయ పడుతున్నాడనటంలో సందేహం లేదు. ఏదో వొక రోజున అతన్ని ఒకటి రెండుసార్లు హద్దులో పెట్టగలనని నందూ ఎదురుచూడలేదు. రబ్బరు బూరపై ఒక పెద్దమనిషి చిత్రాన్ని ఊహించి చిత్రించాడు. దాని అర్థాన్ని సూచించే మాటలు ఎర్ర రంగులో కింద వ్రాస్తున్నాడు. "శ్రీ జాక్‌కు ఊపిరాడకుండ" వున్నప్పుడు అని రాశాడు. తరువాత ఆలోచిస్తూవుండిపోయాడు. తరువాత ఏమిటి? ఏదో వొకటి అల్లటం ఇక్కడ కుదరదు. ఇది నిజ జీవితం. బ్రష్ నోట్లో పెట్టి కనుబొమలు చిట్లించి, ప్రేరణ కోసం చుట్టూ చూశాడు. అప్రయత్నంగా అతనికి పరిచితమైన గళ్ళ చొక్కా, నొక్కుల జుత్తూ, పెద్ద కళ్లూ - ఇంకా ఏమిటంటే ఆ కళ్లు తన వైపు గుచ్చి చూస్తున్నాయి. ఓ-ఓ-ఓ- ఇతనెవరు? ఇంకెవరు? పేరు పొందిన ప్రాస్టర్ ఫినే! నందూ వెక్కిరించాడు. పెద్దగా వెక్కిరించటంతో బనేష్ అది విన్నాడు.

"హల్లో నువ్వెవరు?" అడిగాడు

"నందూనవతా అంటారు" అని తనను తాను పరిచయంచేసుకుంటూ ముక్తసరిగా

జవాబు యిచ్చాడు.

"నిన్ను కలుసుకున్నందుకు సంతోషం కుమారి నందూ నవతా" అన్నాడు పాస్టర్ ఫినే.

"కుమారీనా?" అన్నాడు పిడికిలి బిగించి నందూ.

"ఓ నీ ఉద్దేశ్యం నీవు కుమారివి గాదనా? నీవు శ్రీనందూ గారివి" ఇకిలిస్తూ అన్నాడు బనేష్. "నాకెలా తెలుస్తుంది. ఈ రోజులలో ఆడపిల్లలు కూడ పొడులు పంట్లామూలు వేసుకుని జుట్టు కత్తిరించుకుంటున్నారు. కాని మగ వాళ్ళెప్పుడూ పెదాలకు రంగు వెయ్యరు."

"రంగా?" ఆశ్చర్యంగా అన్నాడు నందూ పారిపోయినట్లుగా.

అతను ఒక వేలు పెదవులపై రుద్దుకొని రంగు చేతికి అంటుకోవటం గుర్తించాడు. బహుశ అతని పెదిమలు రంగుతో ఎరుపెక్కి వుంటాయి.

తోటిపిల్లలు చూస్తున్నారు. కొందరు పెద్దగా పగలబడి నవ్వారు. కొందరు అతి కష్టంమీద నవ్వు ఆపుకున్నారు.

నందు సిగ్గుతో కుంచించుకుపోయాడు. ఇంతలో అక్కడికి రసఫ అధికారి వచ్చాడు. అందరినీ గద్దించి తరువాత ప్రత్యేకమైన కోపంతో నందూ వైపు తిరిగాడు.

"నువ్వు పోటీలో పాల్గొంటున్నావా? లేక నాటకానికి రంగులు వేసుకుంటున్నావా?" గుర్రుమన్నాడు.

తన పెదిమలని భుజాలతో తుడుచుకుంటూ "క్షమించండి సార్" అని నందూ గొణిగాడు. "ఆ పాస్టర్ ఫినేను పాతేస్తాను" కోపంగా తనలో తానే గొణుక్కున్నాడు. పిల్లలంతా రబ్బరు బూరలపై చిత్రించటం పూర్తి చేసి దానిపై తమ పేరు చిరునామావున్న కాగితాన్ని అంటించారు. రసఫ అధికారి రబ్బరు బూరల్ని గదిలోకి తీసుకువెళ్ళాడు.

పిల్లలంతా కంపెనీ పెద్ద రబ్బరు బూర చుట్టూ పోగయ్యారు. దానివైపు మెచ్చుకోలుగా చూస్తూ చుట్టూ తిరిగారు.

బలమైన గాలి వీచి నీలం - తెలుపు చారలతో వ్రేళ్ళాడివున్న పెద్ద బూర గాలిలోకి కొట్టుకుపోయింది. దానిమీద రెండు మాటలు మాత్రమే వున్నాయి. 'ఖోకా జాకీ!' అందరూ పైకి చూస్తున్నారు. రబ్బరు బూర అడుగున ఏం జరుగుతున్నదీ గమనించలేదు. బనేష్ గూడ పైకి చూస్తున్నాడు.

రబ్బరు బూరలకు కట్టిన తాళ్ళు రెండు మూడు ఇత్తడి రింగులకు అమర్చబ

డివున్నాయి. ఒక కుర్రాడు మాత్రమే అది గమనించాడు. నందునవతా కిందకు వంగి త్వరగా లావుపాటి తాడు ముడిని వదులుచేశాడు.

"ఎంత లావుగా వుందో తాడు" అన్నాడు. పాస్టర్ ఫినే మందంగా గట్టిగా కూడ వున్నది. "నైలాన్‌తో చేసింది." అన్నాడు నందూ. బనేష్ పక్కనే నిలబడివున్నాడు. "ముట్టుకుని చూడు" అన్నాడు.

బనేష్ తాడును పట్టుకున్నాడో లేదో నందూ ముడి వదులు చేశాడు. తాడు జారిపోయి బలమైన గాలి తెర ఒకటి రబ్బరు బూరను ఆకాశంలోకి ఎగిరేటట్లు చేసింది. పాస్టర్ ఫిన్ చేయి ఒక ఇత్తడి రింగులో ఇరుక్కుపోయి వున్నది. ఆ చెయ్యి బయటకు తీసుకోలేక పోయాడు. తడబాటులో రెండో చేతితో కూడ తాడును పట్టుకున్నాడు. తన బలాన్నంతా ఉపయోగించి బూరను కిందకు లాగాడు. కాని పైకి లేచే వేగం ఎక్కువగా వుండి లాగలేక పోయాడు. బూర ఆకాశంలోకి ఎత్తుగా ఎగిరి దాంతో వ్రేలాడుతూ పాస్టర్ ఫినే కూడ వెళ్ళాడు.

ఊహించని విధంగా పాస్టర్ ఫినే బూరతో పాటు పైకి వెళ్ళటాన్ని చూసి పిల్లలు తమ కళ్ళను తామే నమ్మలేక పోయారు. నందూ గొంతు భయంతో తడి ఆరిపోయింది. బనేష్ మీద ఎంత కోపమున్నా, కావాలని బనేష్ పైకెగిరేటట్లు చెయ్యలేదు. బూర పైకెగిరేటప్పుడు అతన్ని కొంచెం ఇబ్బంది పెడదామనుకున్నాడు. బనేష్ ఇత్తడి రింగుల్ని పట్టుకున్నాడు. అది కూడ మంచి ఆలోచన కాదనుకోండి. తరువాత బనేష్‌ను క్షమాపణ అడిగేవాడు. నందూ అక్కడ వాళ్ళంతా ఇబ్బందిలో పడటం చూసి ఆనందించాడు. కాని అది మించిపోయి చాలా దూరం వెళ్ళింది.

"దేవుడు కాపాడుగాక! అతను ఎగిరిపోయాడు."

"కిందకు లాగండి! వెనక్కు లాగండి!"

"తాడు గట్టిగా లాగండి. పోలీసు లెక్కడ? అగ్నిమాపకదళాన్ని పిలవండి." అక్కడ పూర్తి అయోమయం ఏర్పడింది. అందరూ అందరికీ సలహాలిస్తూ భయభ్రాంతులై తోసుకుంటున్నారు.

బారులు తీరిన కార్లు వోర్లీ సముద్రతీరంలో ఎర్రలైట్లు వెలిగినప్పటిలాగా ఆగి పోయాయి. కారు హరన్ మోతలు, వంద గుళ్ళల్లో శంఖాలు మ్రోగినట్లుగా మ్రోగసాగాయి.

పాస్టర ఫినేని తీసుకుపోతున్న బూర యింకా పైపైకి పోతున్నది - పడమటిగాలి తెర వీచి నిలువుగా ఎగురుతన్న బూరను పడమటి దిక్కుకు తోసుకుపోయింది. ఆ

దృశ్యం ఎలాంటి బాలుడి రక్తాన్నైనా చల్లబడేటట్లు చేసేంత భయం కలిగించింది. ప్రొస్టర్ ఫినే చాలా భయంకరమైన సన్నివేశాన్ని ఎదుర్కొన్నాడు గాని ఇంతభయం పుట్టించేది చూడలేదు.

అతడొక సారి 'సీఫా' యుద్ధభూమిలో పారాచూట్ లో దిగాడు. తల తిరిగిపోయింది. కాని ఇష్టపూర్వకంగా అలా చేశాడు. అదీ తిరిగి భూమి మీదికి చేరుతాననే నమ్మకంతో! ఇప్పుడు అతనికి ఆ నమ్మకం కలగడంలేదు. ఆ బూర అతణ్ణి ఎక్కడకు తీసుకు పోతుందో దేవుడొక్కడికే తెలుసు. అదీ ఎంత దూరమో! ఎంతవరకో! ఎక్కడ దించుతుందో!

ప్రొస్టర్ ఫినే శరీరమంతా చెమట దిగ కారుతున్నది. కిందకు చూడగానే అతడి తల తిరిగింది. భయ కంపితుడయ్యాడు. ఇప్పు డతను అందరినీ నవ్వించే పిల్లల వినోద కథల్లో 'సూపర్‌మేన్' కాడు. భయపడిన పసివాడు మాత్రమే. చేతులు తిమ్మిరెక్కినట్లనిపించింది. ఒక చేతి గుప్పిట్లో తాడు వున్నది. రెండవ చేయి ఇత్తడి రింగులో ఇరుక్కుపోయివుంది. ఆ రింగు వదిలిపెడితే అదే చివరి ఘడియ అని తెలుసు. నేలమీద పడితే దోసెలాగ పల్చగా చదునైపోతాడు. ఓదేవుడా! నన్ను కాపాడు! అని ఏడ్చాడు.

బూరకు రంధ్రం వుండి దాని ద్వారా గాలి నెమ్మదిగా బయటకు పోతుందని, అప్పుడు దానికి జతచేసి వున్న బుట్ట నేలకు దిగుతుందని అతనికి జ్ఞాపకం వచ్చింది. కాని ఇది అలాంటి బూర కాదు. అలాంటి ప్లగ్ ఏదీ లేదు. గాలిని ఎలా బయటికి పంపగలడు?

అతని దగ్గర పంగటి పుల్ల వుంది. ఇంకా పిప్పరమెంట్లు వున్నాయి. కాని పంగటిపుల్ల జేబులోనుండి తీసి ఎలా వాడగలడు? చేతులు రెండూ తాళ్ళల్లో ఇరుక్కుపోయివున్నాయి.

బెలూన్ నగరం అంచుల్ని దాటి సముద్రంపైపు కొట్టుకుపోయింది.

అక్కడ హాజీ ఆలీ సమాధి నౌకలు, కెరటాల మీద నుండి వచ్చేనురగ వున్నాయి. ఒకవేళ సముద్రంలో పడితే గాయపడతాడేమో గాని బతికి బయట పడగలడు. కిందనుంచి ఎవరైనా తుపాకీ పేల్చి బూరను పగలగొడితే బాగుండుననుకున్నాడు. ప్రొస్టర్ ఫినేకి మూర్ఛ వచ్చేంతపనయింది. బనేష్ గట్టిగా ఇత్తడి రింగును ఒక చేత్తో పట్టుకున్నాడు. ఇంకొక చేత్తో బెల్టును తీయటానికి ప్రయత్నించాడు. కాని అది అంత తేలికకాదు, చివరికి ఎలాగైతేనేం సాధించాడు.

బనేష్ బెల్టు చివరను గట్టిగా పట్టుకొని కొరడాతో కొట్టినట్లు శబ్దం చేస్తూ టకటక పగలగొట్టాడు. బెల్టు బకిల్ తో గట్టిగా రబ్బరు బూరను కొట్టాడు. దాని పిన్నుతో ప్లాస్టిక్ బూరకు రంధ్రం పెట్టడానికి 1,2,3,4,5,6 సార్లు కొట్టవలసివచ్చింది. బెలూన్‌కి ఒక పక్కన రంధ్రం పడింది. దానిలో గాలి పెద్ద శబ్దంతో బయటకు నెట్టుకు వచ్చింది. నేరుగా నెమ్మదిగా బూర కిందకు రావటం మొదలుపెట్టింది. కింద చేపలు పట్టే పడవల్లో వున్న జాలర్ల కళ్ళు సముద్రంలో చేపల మీద లేవు. అవి ఆసక్తిగా ఆకాశంలో వున్న దురదృష్టవంతుడైన బాలుడి వైపు చూస్తున్నాయి. అతని కేమవుతుందో! వాళ్ళు సహాయపడగలరా?

లేదు. వాళ్లెలా సహాయ పడగలరు? సముద్రమంటే వాళ్ళ రాజ్యం. కాని ఆకాశం కాదుగదా!

కాని వాళ్ళు ఆ బూర పడటానికి వీలుగా స్థలాన్ని సిద్ధం చేసి వుంచారు. త్వరగా చేపలు పట్టే వలను చదరంగా బిగురుగా వుండేటట్లు పరిచారు. ఆ బాలుడికి ఇదొక్కటే ఆశ.

ఆ బూర సూటిగా దాన్లో పడింది. వల దాన్ని అందుకోగలిగింది.

* * *

"నే నెక్కడున్నాను?"

"ఖంగ్‌ఖంగ్‌ఖంగ్. నువ్వు ఇంట్లో వున్నావు. భయపడ నవసరం లేదని చెప్పారు." అన్నది అత్త.

వారంటే అతనికి మామగారు. వాళ్ళ మామగారు బొంబాయిలో పేరున్న డాక్టరు.

"నీకేం దెబ్బలు తగల్లేదుగదా? తగిలాయా, బనేష్?"

"లేదు. నాకు అది తలచుకుంటేనే జబ్బు పడ్డట్టు వుంటుంది. అక్కడ ఎవరు ఏడుస్తున్నారు, అత్తా? నాకు ఎవరివో వెక్కిళ్ళు వినిపిస్తున్నాయి!"

"అతను నీ స్నేహితుడు"

"ఎవరు? నందూ, నందూనవతానా! ఏమైంది నీకు?"

"బనేష్ - నేను చాల బాధ పడుతున్నాను. ఇదంతా నా తప్పు."

"నీ తప్పా?"

క్లుప్తంగా నందూ తను చెసిన దంతా కథలాగా చెప్పాడు. "నేను చాలా చెడ్డవాణ్ణి - అపకారం చేసేవాణ్ణి, గాడిదను నన్ను క్షమిస్తానని చెప్పవా పాస్టర్

ఫినే! నాకు ఎలాగూ బహుమతి రాదు. ఒక వేళ వచ్చినా తీసుకోను. నేను తీసుకోనని ప్రమాణం చేస్తున్నాను."

బనేష్ కూర్చుని నందూ వైపు కళ్ళు పెద్దవి చేసుకుని వింతగా చూశాడు. అప్పుడే వాళ్ళ మామయ్య లోపలకి వచ్చారు. "ధైర్యస్థుడివి మాస్టర్ ఫినే!" "నీకు తెలివి వచ్చిందన్నమాట. అలా చేసినప్పుడు పడిపోకపోతే ఏమయ్యేదో నీకు తెలుసా? వైమానిక దళం నిన్ను కాపాడేది! ఏర్పాట్లు చెయ్యమని అన్ని చోట్ల నుండి ఫోన్లు వెళ్ళాయి. నీకు తెలుసా? ఇప్పుడే ఖోకా కంపెనీ వారినుంచి ఫోన్ వచ్చింది. వాళ్ళు నీకు ఒక ప్రత్యేక బహుమతి ప్రకటించారు. వాళ్ళకు ఇంతకు ముందెప్పుడూ జాకీ దగ్గు బిళ్ళలకు యిలాంటి పెద్ద ఎత్తున ప్రచారం జరగలేదు."

"ఆ బహుమతి నిజానికి నాకు రాకూడదు. నందూనవతాకే!"

నందూ కళ్ళలో నీళ్ళు నిండాయి. బనేష్ కళ్ళు చిలిపిగా మెరిశాయి.

# స్వర్గానికి ఏడుమెట్లు

## ఎస్. కె. ఆచార్య

ఒక రోజు ఉదయం దినపత్రిక తెరవగానే యీ క్రింది మాటలు నన్ను ఆకర్షించాయి. "హల్లో! యువకులారా! అంతరిక్ష యాత్రికులు కావాలసి కలలు గంటున్నారా?" నా చూపులు ఆ వార్తమీద పడగానే ఉద్రేకంతో ఎగిరి గంతెయ్యబోయాను. అది ప్రకటనే అనుకోండి.

సామంత చంద్ర శేఖర్ అంతరిక్ష పరిశోధనా కేంద్రం - బొంబాయి అంతరిక్ష యాత్రికులు కావాలి. అంతరిక్ష యాత్రికులు కాగోరిన యువకులు అర్జీలు పెట్టుకోవచ్చు. సామంత చంద్ర శేఖర్? భారత దేశంలో గొప్ప వాడైన ఖగోళ శాస్త్రవేత్త కదూ సామంత చంద్రశేఖర్!

ఒక వెదురు గొట్టంతో ఆకాశాన్ని సూక్ష్మంగా పరిశీలించి ముందుగా నక్షత్రాల గురించి, ఇప్పటి శాస్త్రవేత్తలు అతిశక్తివంతమైన టెలిస్కోపులతో చూసి చెప్పినట్లు ఖచ్చితంగా చెప్పినవాడు అతనేగదూ?

కలమూ కాగితం కొరకు చూశాను. ఆ ఉదయమే ఒక ఉత్తరం బొంబాయికి మా కళాశాల ఆవరణలో గల పెద్ద మామిడిచెట్టుకు వేలాడే తపాలా పెట్టెలో వేశాను. ఆ రోజుల్లో కళాశాల విద్యార్థిని, అంతే కాదు ఊరిలోని విమానాల క్లబ్బులో సభ్యుడిని, చిన్న హెలికాప్టరు నడపటానికి అనుమతి కూడ పొందాను. చిరపరిచితమైన ఆకాశం ఏమాత్రం అద్భుతంగా లేదు. ఆకాశంలోకి ఎగరాలని వుంది. కాని హెలికాప్టరు రాకెట్ కాదుగదా! భూమి వాతావరణాన్ని దాటి తెలియని నల్లని అంతరిక్షానికి ఎగరాలంటే ఒక 'రాకెట్', ఒక అంతరిక్షనౌక కావాలి.

దినపత్రికలో ప్రకటనపై నాకన్ను పడగానే రాకెట్‌ను గురించి కలలు కన్నాను. పిలుపు రాగానే బొంబాయి బయలుదేరాను. కానీ ఆ ఉద్యోగం కొరకు వరుసలో నిలుచొనివున్న అభ్యర్థులను చూడగానే గుండె జారిపోయింది. దేశం నలుమూలల

నుంచీ అభ్యర్థులు వచ్చారు. వాళ్ళతో చేతులు కలిపినప్పుడు గుండె యింకా జారిపోయింది. వాళ్ళందరూ నిజంగా గొప్పవాళ్ళు - వ్యాయామంలో శరీరాన్ని గట్టి పరుచుకున్న వాళ్ళు; కుస్తీ పట్టగలవాళ్ళు; బాగా బరువులు ఎత్తగలిగిన వాళ్ళు. వారితో పోలిస్తే చాలా అల్పుణ్ణి.

ఆ వీరులు నా చెయ్యి పట్టుకున్నారు. నన్ను పై నుంచి కిందికి చూసి నవ్వు ఆపుకున్నారు. నేను పొడవైన వాణ్ణి కాదని తెలుసు. కాని వాళ్ళ చిన్నచూపు నన్ను నిలబెట్టింది.

మనసులో నాకున్న అర్హతలను లెక్కపెట్టుకోవటం మొదలుపెట్టాను. మంచి ఆటగాడిని. ప్రతి సంవత్సరం కళాశాలలో బహుమతులు అందుకున్నాను. బహుశ వాటి విలువ కొంచెమే కావచ్చు. ఇంకో అర్హత కూడ వున్నది. చాల సంవత్సరాల క్రితం ఒక శిక్షకునిద్వారా ప్రాణాయామం, యోగాసనాలు వెయ్యటంలో గట్టి శిక్షణ పొందాను. గాలి పీల్చటం, ఆసనాలు వేయటం మొదలైన వాటిలో పూర్వకాలపు ఋషులు అందించిన విధానాల్ని నేర్చుకున్నాను. ఆ శిక్షణ ఆత్మ విశ్వాసాన్ని యిచ్చింది.

టంగ్‌మని ఎక్కడో గంట మోగింది. వెంటనే డాక్టరులాగా బట్టలు ధరించి ఒకరు వచ్చారు. ప్రయోగశాలకు తీసుకుపోయే చిట్టెలుకల మందలాగా ఆయన మమ్మల్ని తీసుకుపోయారు. ఆయన ధరించిన తెల్లటి పొడవు చేతులచొక్కాను ముందుకు లాక్కుంటూ "ఈ పెట్టెలను చూడండి. స్వర్గానికి తీసుకుపోయే ఏడుమెట్లు. వాటిని ఎక్కగలిగితే స్వర్గలోకపు తలుపు తట్టవచ్చు. ఇంకా ఎక్కువ దూరమే వెళ్ళవచ్చు. ఈ శిక్షణలో గెలిచినవారు అంతరిక్షంలోకి ఎగరటానికి ఎన్నికో బడతారు. ఇప్పుడు చూడండి" అన్నారు.

డాక్టరు చూపించేది అర్థం చేసుకునేసరికే తెలియని చోటుకు నెట్టబడ్డాను. ఒక తలుపు ధడాల్ మని కొట్టుకుంది. వెంటనే ఒక ఎర్రటి దీపం ఆరిపోయి నేను పడిపోతున్నట్లు అనిపించింది. నేను నేరుగా వెళ్ళి ఒక దయ్యం కడుపులో వెళ్ళి పడ్డాను. అంతా నల్లగా చీకటిగా పూర్తి నిశ్శబ్దంగా వుంది. నా వెన్నెముకలో వొణుకు పుట్టింది. హఠాత్తుగా దయ్యం కదలగానే భయపడ్డాను. దాదాపు మూర్ఛపోయాను. కాని చిన్నప్పటి కథ ఒకటి గుర్తురాగానే, చీకట్లోకి చూస్తూ నాలో నేను యిలా గొణుక్కున్నాను. "గుర్తుంచుకో, నీవు ధ్రువుడివి. పూర్వకాలం భారతదేశంలో వున్న బాలజ్ఞానివి."

వెంటనే తేరుకున్నాను. చీకటిలో తడుముకొని ఒక కుర్చీని వెతుక్కొని కూర్చుని మామూలుగా గాలి పీల్చుకున్నాను. ధ్యానాన్ని మొదలుపెట్టాను. పెట్టెనిండా వ్రేలాడుతున్న తీగలున్నాయి. అవి నా కదలికలను బయటనుండి గమనిస్తున్న డాక్టరుగారికి తెలియజేస్తాయని తెలుసు. నన్ను పొంచి చూస్తున్న విద్యుత్ తీగలు పిరికివాడినని తెలియజేయటం నాకు ఇష్టంలేదు. అంతరిక్షమనబడే ఆ అంతు తెలియని స్థలంలోని చీకటికి, నిశ్శబ్దానికి భయపడుతున్నానని. తెలియకూడదు. "వీల్లేదు." లోలోపల అనుకున్నాను. "అంతరిక్ష యాత్రికుడిగా వుండటానికి మొదటి పరీక్ష తీసుకునే ఆధునిక మానవుడివి."

ఎంతకూ పూర్తికాని ఆ రాత్రి సమయంలో రెండుసార్లు మాత్రమే కుర్చీని వదలి వెళ్ళాను. ఒకసారి ఆకలయినప్పుడు పెట్టెలోకి చూచి, గుడ్డి వాళ్ళ కొరకు వ్రాసిన లిపిని గుడ్డివాడు చదివినట్లు చిక్కు వ్రాతను విడదీసి అందులోని సమాచారాన్ని వివరంగా అర్థం చేసుకున్నాను. "పాలు" అని వ్రాసిన చీటీ అందించిన ఒక సీసాను చూశాను.

అక్కడ నాకోసం ఆహారం వున్నది. తాగాను.

రెండవసారి మూత్ర విసర్జనకు లేచాను. అక్కడ కుండ పెట్టి వుండటం చూశాను.

ఎప్పుడు దయ్యపు పెట్టె తెరుచుకొని డాక్టరు కనిపిస్తాడో ఖచ్చితంగా తెలియదు. బయటనుంచి వచ్చే కాంతీ, శబ్దమూ ఒక్కసారిగా తిరిగి భూమిమీదకు చేరుకున్నానని తెలియజేశాయి. సంతోషంగా "ఖచ్చితంగా ఒక వేయి సంవత్సరాలు భూమికి దూరంగా వున్నాను" అని అరిచాను.

కాని డాక్టరు శిక్షను తగ్గించినట్లుగా "48 గంటలు మాత్రమే అయినా ప్రారంభం బాగున్నది" అని ప్రకటించారు.

రెండవసారి డాక్టరు దయ్యానికి అప్పగించటమేగాక నాకు తోడుగా సైతాన్‌ను కూడ వుంచారు. రెండవపెట్టెలో సైతాన్‌కు పెద్ద చెయ్యివున్నది. దానికి డాక్టరు నన్ను కట్టివేశారు. వెల్లకిలా ఒక విశాలమైన పడకలాగా వుండే దూలంమీద పడ్డాను. అది.... ఆ చక్రము ఊపిరాడనంత వేగంగా గిరగిరతిరుగుతూ దూలాన్ని చక్రంలా తిప్పుతూ గాలిమరలాగా ముందుకు పరుగెత్తిస్తున్నది. అది ఎలా వుందంటే మనిషి వక్షస్థలాన్ని ఒక గట్టి తాడుతో కట్టి గాలిలో గిరగిరా తిప్పుతూ మనిషి రక్షించమని అడిగే వరకూ తిప్పినట్లుంది.

సైతాన్‌తో నన్ను విసరివేయమని చెప్పకముందే డాక్టర్ నా కొక ఉపాయం చెప్పాడు. "ఇటు చూడు, ఇక్కడ ఒక మీట వున్నది. దానిని నొక్కితే దీపం ఆరిపోయి మళ్ళీ వెలుగుతుంది. సైతాన్ చేతిలో క్షేమంగా వుండి సంతోషంగా తిరగగలిగినంతసేపు యీ మీటను నొక్కుతూ వుండు, అది నీకు ఇంకా వేగం కావాలని మాకు తెలుపుతుంది. ఒక వేళ దీపం ఆరిపోక పోతే నీవు చనిపోయావనుకుంటాము. అదీ సంగతి" అన్నాడు.

డాక్టరు గొంతుతడి ఆరిపోయింది. ఎక్కడినుంచో ఒక యంత్రపు రొద మొదలైంది. వెంటనే గుండెపై ఏదో ఎగిరి నట్లనిపించింది. అది సైతాన్ అయివుండవచ్చు. తరువాత నా గుండెను పిండినట్లయింది. రక్తం తలవరకు వేగంగా ప్రవహించింది. రక్తం బరువుగా వేడిగా కరిగిన సీసంలాగ మారినట్లనిపించింది. తర్వాత ఒక ఏనుగు గుండె మీదకూర్చున్నట్లు అనుభూతి కలిగింది. అతి తీవ్రమైన నొప్పిని, చిత్రహింసను అనుభవించాను. కాని ఇంకా చేతిలో మీటను నొక్కుతూనేవున్నాను. వేళ ఎంతయిందీ, స్థలమూ - అన్నీ మర్చిపోయాను. చివరికి చక్రము ఆగిపోయింది. డాక్టరు లోపలికి చొచ్చుకొనివచ్చాడు.

"హల్లో! నువ్వు యింకా అక్కడే వున్నావా? అని మెల్లిగా అడిగాడు."

"గంటకు డైబ్బైవేల మైళ్ళు పోతున్నావు - ఒకే దిక్కులో పోతున్నావనుకో" అన్నాడు.

తరువాత కంప తొడుగు లాంటి మూడవ పెట్టె దగ్గరకు పోయేటప్పుడు ప్రాణాయామం నేర్పిన గురువు గారిని తలచుకున్నాను. తర్వాత పెట్టె పేరు 'జాతుతగృహ' - లక్కగృహం. ఆ పేరు వినగానే అదిరిపడ్డాను. వెంటనే అక్కడ ఏం జరగబోతున్నదో గ్రహించగలిగాను. పురాణాల్లో పంచ పాండవులు ఐదుగురు ఒకసారి లక్కగృహంలో వుంచబడ్డారు. అది వారి క్రూరులైన కౌరవసోదరులచే తగలబెట్టబడింది. డాక్టరు నన్ను దానిలోకి నెట్టి విసురుగా తలుపు వేయగానే అలాంటి అనుభవమే కలుగుతుందని అనిపించింది.

నా భయాలు నిజమేనని ఋజువయ్యాయి. పెట్టె కొంచెం కొంచెం వేడెక్కటం మొదలయింది. కాని నేను కదలకూడదు. మంటలు తీవ్రంగా నా ముఖానికి తగిలాయి. చెమట ముత్యాల్లా కిందకు కారింది. అప్పుడే షవర్ నుంచి బయటకు వచ్చినట్లుంది. వీలయినంత శాంతంగా కూర్చుని అంతరిక్షయాత్రికుని లాగ అంతరిక్షనౌక చాలా ఎత్తునుంచి దిగి వస్తున్నట్లు ఊహించుకోసాగాను. అది తిరిగి

భూమి వాతావరణంలోకి ప్రవేశిస్తున్నది. దాని ముందు భాగం గాలికి ఎదురు కొట్టుకుంటూ రుద్దుకుంటూ వెళుతున్నది. రాపిడి వలన కలిగిన విపరీతమైన వేడికి దాని ముందు భాగం మండింది. వెంటనే మంటలు నాల్కలు చాచి మొహాన్ని తాకుతున్నట్లనిపించింది. చివరికి డాక్టరుగారి గొంతు విన్నాను. "103° ఫారన్‌హీట్ మాత్రమే మరీ ఎక్కువ కాదు, తరువాత పరీక్షకు సిద్ధంగా వుండు.

డాక్టరు నన్ను 'నాదగృహ' అనే పెట్టెలోకి తరువాత నెట్టారు. అదే "ధ్వని గృహము."

నా జన్మలో ఎప్పుడూ అలాంటి పిచ్చి శబ్దాన్ని వినలేదు - కేకలు మూలుగులు, ఏడ్పు శబ్దాలు ధభ్‌మనే ధ్వనులు - అన్నీ ఒక్కసారి ఒక్కసారే వెయ్యిరైళ్ళు, ఇంజన్లు వెనక్కి పరుగెత్తినట్లు - పెద్ద వడగాలిలో వినిపించే ఈలలు - కూతలు దెయ్యపు పాటలు.

నన్ను అక్కడికి తోయక ముందే దయగల డాక్టరు నా చెవుల్లో పెట్టారనుకోండి. కాని వాటిని లెక్కచేయకుండా ఆ శబ్దం నన్ను నిర్దయతో సుత్తితో కొట్టినట్లు కొట్టింది. వొణక సాగాను. ఎలక్ట్రిక్ హీటర్ తీగలు ఎలా ఎర్రగా వుంటాయో అలాగే నా వెంట్రుకలు వేడికి ఎర్రగా అయ్యాయి. అప్పుడే బయలుదేరటానికి సిద్ధంగా వున్న రాకెట్స్ నుంచి వచ్చినట్లుగా శబ్దపు స్థాయి పెరగసాగింది.

డాక్టరు ఎప్పుడు పెట్టెలోనికి వచ్చాడో గమనించలేదు. "నీవు తరువాత మెట్టుకి సిద్ధంగా వున్నావా? అని అడిగాడు.

నెమ్మదిగా పైకి లేచాను. మంటలలో తపస్సు చేసుకుంటున్న ఋషిలాగా అప్పటివరకూ కూర్చుని వున్నాను.

తరువాత రెండు పరీక్షలు, ఇంకా యిలాంటివే వింత పెట్టెలు రెండింటిలో జరిగాయి. ఐదవ పెట్టెకు డాక్టరు 'డాన్స్‌పెట్టె' నాట్యం చేసే పెట్టె అని పేరు పెట్టారు. లోపలికి విసిరివేయబడ్డాను. కష్టం మీద నిలబడగలిగాను. మళ్ళీ నేలమీద నిలువలేక జారిపడ్డాను.

తరువాత పెట్టె గుండ్రంగా తిరగటం మొదలుపెట్టింది. అప్పుడప్పుడు పల్టీలు కొడుతూ పెట్టె ఆ విధంగా నాట్యం చెయ్యగానే నా శరీరం కూడ దానితోపాటు నాట్యం చేసింది. చివరికి అది నెమ్మదిగా ఆగింది. పాదాల్ని గట్టిగా భూమిపై పెట్టగలిగాను గాని నా తల ఇప్పుడు తిరగటంలేదు. దాన్ని లక్ష్యపెట్టకుండ ప్రశాంతంగా వున్నాను. తల ఎప్పుడూ పైకే పెట్టుకోవాలి. అంతరిక్షయాత్రికుడిలాగా,

లేకుంటే అంతరిక్ష నౌకను నడుపుతూ, నడిపే విధానాన్ని మర్చిపోతే అంతరిక్షనౌకను తప్పు మార్గంలో నడిపిస్తాను. ''

ఆ తరువాత పెట్టె యింకా వింతగా వుంది. దానిలో కాలుపెట్టి మరుక్షణమే నా శరీరపు బరువునంతా పీల్చేసింది. అందుకే డాక్టరు దానికి 'బరువు లేని పెట్టె' అని పేరు పెట్టాడు.

ఇది చాల వింత అనుభవం. ఒక క్షణం తర్వాత జబ్బుపడి నట్లయ్యాను. ఐనప్పటికీ అంతరిక్ష నౌకలో వున్నట్లు ఊహించుకున్నాను. అంతరిక్షంలో మనిషి తేలికగా బరువు లేకుండ వుండే ప్రపంచంలో జీవించాలి. అక్కడ అతని శరీరం బరువు కోల్పోతుంది.

ఆ పెట్టె తెరుచుకున్నది. ప్రాణాయామ స్థితిలో నేను కూర్చుని వుండటం చూశాడు.

ఏడవది స్వర్గానికి వెళ్ళే చివరిమెట్టు మాత్రమే మిగిలి వున్నది. చాల కష్టమే గాని. అంతరిక్షంలో వున్నట్లే వున్నది.

డాక్టరు అంతరిక్షయాత్రికుడు వేసుకునే 'సూటూ', ముఖానికి తగిలించుకునే 'మాస్క్', పెట్టాడు. అంతరిక్షయాత్రికులు ఫోటోల్లో వింత ఎంతగా కనిపిస్తారో నేను అంత వింతగా వుండి వుంటాను.

డాక్టరు ప్రాణ వాయువు వుండే గదిలో వుంచి ఇలా ఆజ్ఞాపించాడు. "గట్టిగా లోపలికి గాలి పీల్చు. దీనికి ప్రాణవాయువు అవసరం."

తరువాత అతను నా భుజానికి ఒక సంచిని వేళ్లాడదీశాడు. దానిలో కొన్ని నట్లూ, తీగలు అటూ ఇటూ కదులుతున్నాయి. "గాలి లేని అంతరిక్షంలో ఎంత ఎత్తుకు ఎగరగలవో ఇప్పుడు లోపలికి వెళ్ళి చూపించు" అన్నాడు.

భయం పుట్టించే ఆ పెట్టెలోకి వెళ్ళాను. అందులో ఒక క్యూబిక్ సెంటీ మీటరు గాలి కూడ పీల్చుకోవటానికి లేదని తెలుసు.

మరుక్షణంలో ఝుూమ్మని శబ్దం వినిపించింది. పెట్టెలో గాలి నెమ్మదిగా తోసివేసే పంపు పనిచేయటం మొదలుపెట్టింది. నేను ధరించిన అంతరిక్షపు 'సూట్' వ్యాకోచింప సాగింది. ఊపిరాడలేదు. నిజానికి వ్యాకోచించిన 'సూటు' నా శరీరాన్ని కాపాడుతున్నది.

ఈ మధ్యకాలంలో ముఖానికి కట్టిన 'మాస్క్' గుండా రెండు విషయాలు గమనించాను. గడియారంలాంటి డిళ్ల, దాని ముళ్ళు ఏవో అంకెలను చూపించే

దాన్ని చూశాను. ఆ ముల్లు చూస్తుండగా కదిలింది. ఏదో 10,000 నుంచి 20 వరకూ ననుకుంటాను. అప్పటికప్పుడే ఒక ఊపుతో 30 వరకూ పెరిగి, దాదాపు నిటారుగా నిలబడింది. గడియారపు ముల్లు కాలాన్ని సూచించటం లేదు. ఎత్తును తెల్పుతున్నది. తరువాత నా కళ్ళు 'మాస్క్' గుండా ఇంకొక చిత్రమైన వస్తువును నా సీటు పక్కగా చూపాయి.

అది ఎందుకు పనికిరాని గ్లాసు నీళ్లలాగా కనిపించింది. గడియారపు ముల్లు ఒకే విధంగా కదలటం కొనసాగి బిళ్ళవరకూ పోయింది. ఉన్నట్లుండి గ్లాసులోని నీరు మరగ నారంభించి, ఆవిరై ఆవిరి చల్లగా మారింది. గడియారాన్ని పరీక్షించాను. దాని ముల్లు 60 వేలు దాటబోతున్నది.

నిజంగా సముద్రతీరం నుంచి 60 వేల అడుగుల ఎత్తులో వున్నానా? నేనున్న పెట్టె భూమి నుంచి ఒక్క అడుగు ఎత్తు కూడ లేదు. ఎప్పుడూ పాటలాగా సుత్తితో కొట్టినట్లుగ చెవులకు వినిపించేది. ఇది గాలిని తీసివేసే పంపు చేసే పనే! నేను ధరించిన అంతరిక్షపు 'సూట్' నా చుట్టూ వున్న శూన్యత కొలతను తెలుపుతున్నది. ఆ గాలి లేని ప్రదేశంలో నీరు ఆవిరిగా మారటం చిన్న వింత. అంత అరుదైన వాతావరణంలో నీరు తన ద్రవస్థితిని నిలుపుకోలేదంతే!

ముల్లు డెబ్బై ఐదుకు కదిలింది. మరో విధంగా చెప్పాలంటే నేను సముద్రమట్టం నుంచి 75 వేల అడుగుల ఎత్తులో వున్నట్లు లెక్క. ఆ ఆలోచనే నాకు కళ్ళు తిరిగేటట్లు చేసింది.

అప్రయత్నంగా నాకొక కొంటె ఆలోచన కలిగింది. కొంచెం కాలక్షేపంగా వుంటుంద నిపించింది. నా కుడి చేతి కున్న తొడుగును లాగేశాను. కానీ జరిగిన విషయం చూసినప్పుడు భయంతో వణికిపోయాను.

చెయ్యి గుమ్మడికాయంత లావుగా వాచింది. దాన్ని చూడగా గ్లాసులోని నీటిలాగే నాలో రక్తం కూడ శరీరంనుంచి తన్నుకొని వచ్చి ఆవిరిలాగా మారేటట్లు కనిపిస్తున్నది.

జరుగుతున్న విశేషాన్ని డాక్టరు చూస్తూనే వుండి వుంటారు. 'హిస్' మనే శబ్దంతో గాలి నా పెట్టెలోనికి తోసుకు వచ్చింది. గాలిని తోడే పంపు నిశ్శబ్దంగా వుంది. నా అంతరిక్ష కవచం ముడుచుకుపోయింది. నా చేయి తిరిగి మామూలుగా అయింది. అది రక్షించబడింది. నా జీవితం కూడ రక్షింపబడింది.

డాక్టరు నా చేతిని తట్టారు. ఆ అదిలింపును పరిహాసానికి లాగా తీసుకొని

"అంతరిక్ష కవచం లేకుండ స్వర్గానికి వెళ్ళిన భారతీయుడెవరో మీకు తెలుసా? అని అడిగాను.

డాక్టరు నా వైపు వింతగా చాశారు. "పాండవులలో పెద్దవాడైన యుధిష్ఠిరుడు" అన్నాను గర్వంతో.

ఈ మాటలకు డాక్టరుగారి కండ్లు మెరవగా నా వైపు దయుగా చూసి "బాగుంది. చాల బాగుంది. నీవు యుధిష్ఠిరుడి లాగే ఎన్నుకో బడ్డావు. అన్ని పరీక్షలలో ఉత్తీర్ణుడవై నావు" అన్నారు.

వందమంది అభ్యర్థులలో చివరికి ముగ్గురు మాత్రమే ఎన్నుకోబడ్డారని తెలిస్తే సంతోషిస్తావనుకుంటాను. ఆ ఎన్నుకున్న వారిలో గొప్ప మనుష్యులెవ్వరూ లేరు.

"ఆ గొప్ప వారి కేమయింది. అని ఆరా తీశాను.

డాక్టరు మాకు గొప్ప మనుష్య లవసరంలేదు. నీలాంటి సామాన్య యువకుల కోసం చూస్తాము" అన్నారు.

ఔను, నేను సామాన్య మానవుడిని. చాలా సామాన్యుడిని. కాని ఇంటికి తిరిగి వచ్చి మా గురువుగారికి కథ మొత్తం వినిపిస్తే ఆయన చిరునవ్వు నవ్వి "ఇది కొత్త ఏమీ కాదు. నీ శరీరాన్ని, మనస్సును, ఆత్మను బాగా తెలుసుకో! ప్రపంచం సామాన్య మానవులతో అలసిపోయి వుంది. దానికి ఇంకా ఇంకా శక్తిమంతులైన మానవులు కావాలి" అని చెప్పారు.

# బమ్‌బహదూర్

## గురుబక్ష్ సింగ్

'బమ్‌బహదూర్' ఏనుగుకు మావటి వాడైన మతాదిన్ ఏనుగు రోజురోజుకూ మితిమీరిపోతున్నదని యువరాజుకు ఫిర్యాదు చేశాడు. వైద్యుని ఆజ్ఞప్రకారం అది ఆడ ఏనుగు నుంచి అనారోగ్య కారణంగా వేరు చేయబడింది. కాని ప్రతి సాయంకాలం ఆడ ఏనుగును షికారుకు తీసుకు రాకపోతే బమ్‌బహదూర్ రంకెలు వేస్తూ పెద్ద పెద్ద ధ్వనులు చేసేది. ఆగడం చేస్తూ తన తొండం దాని వీపు మీద పెట్టకపోతే బయటకు రావటానికి నిరాకరిస్తుంది. ఒకవేళ మతాదిన్ ఆక్షేపిస్తే కోపాన్ని చూపిస్తుంది.

"విచారపడకు మతాదిన్" మన బమ్‌బహదూర్‌కు బడాయి చూపించాలని ఇష్టం. అవకాశం కొంత కాలంనుంచి రాలేదు. వచ్చే బుధవారం నేను నా భార్యను ఇంటికి తీసుకు వచ్చేటప్పుడు బమ్‌బహదూర్‌కి అలంకారాలన్నీ పెట్టి రైలు స్టేషన్‌కు తీసుకురా. దానిపై కూర్చొని అంతఃపురానికి వస్తాము" అని యువరాజు అతనికి ఆశ కల్గిగేలాగ చెప్పాడు.

బమ్ పేరుకు తగ్గట్లు పరాక్రమమైనదే గాక, యువరాజుగారు మెచ్చుకునే విధంగా హుందాగా వుంటుంది. రాజ్యంలో ప్రతి ఉత్సవంలోను, ప్రతి ఊరేగింపులోనూ అందరి దృష్టి ఆకట్టుకొనేలాగా మహారాజుగారు మంచి శ్రద్ధ తీసుకునేవారు. బాగా అలంకరించినపుడు మర్యాదగా ప్రవర్తిస్తుంది. బాగా శిక్షణ పొందిన సైనికుడి కంటె బాగా నడుచుకుంటుంది. అదే బమ్‌బహదూర్ శాలలో వున్నప్పుడు ఇతరుల్ని భయపెట్టగలదు. మానవ గుణాలను గ్రహించటంలో మిక్కిలి నేర్పరి కావటంవల్ల శాలలో కావలివారు ఏమాత్రం లోపం చేసినా, లేదా నిజాయితీగా లేకపోయినా కోపంతో రెచ్చిపోయేది.

"బమ్ చాల మర్యాదగలది. మీకు తెలుసా! మావటివాడు దాని మేత దొంగతనంగా శత్రువైన అడివికోడికి వేసేవాడు. మొదట్లో బమ్ ఏనుగులన్నిటిలోకి

చాలనాణ్యమైనదనే కీర్తి తెచ్చుకున్నది" అని అప్పుడప్పుడు సేవకులు అనుకోవటం వినిపిస్తూ వుండేది.

యువరాజు ఉదయపూర్ నుంచి కొత్తగా పెండ్లైన తర్వాత వధువుతో తిరిగి వస్తున్నాడు. రైలు స్టేషన్ పండగ రోజులాగా అలంకరింపబడింది. బజార్లో చాలా కార్లు బారులు తీర్చివున్నాయి. గుర్రపు రౌతులు అందరూ ఒకే దుస్తులతో అందంగా అరేబియన్ గుర్రాలపై కూర్చున్నారు. అప్పుడు బమ్‌బహదూర్ వైభవంగా అలంకరింపబడి అక్కడ నిలబడింది. విశాలమైన మెరిసే పట్టు బుటా దాని వీపుమీద కప్పబడింది. చిన్న బంగారు గంటలు, బంగారపు అంబారిపై గణగణమని మ్రోగాయి. చివరకు దాన్ని దంతాలపై కూడ బంగారు పూత పూశారు. దానిమీద మతాదిన్ తన ఎత్తును పైనుంచి కొలుచుకుంటూ ధీమాగా కూర్చున్నాడు.

యువరాజు, మహారాణి అంబారి ఎక్కగానే పెద్ద హర్షధ్వానాలు చెలరేగాయి. బమ్‌బహదూర్ నమస్కరించినట్లుగా తొండం పైకెత్తింది. ఊరేగింపు మొదలయింది. బమ్ ఎంతో ఠీవిగా నడిచింది. అపారమైన సొగసులతో అధికారంతో అటూ ఇటూ కదులుతూ రాజు దంపతులను అంతఃపురద్వారం వరకు వీపుమీద మోసుకు వెళ్ళి దించింది.

మిగిలిన అతిధులను పెండ్లి కుమార్తెకు పరిచయంచేసే ముందు యువరాజు ఏనుగుతో "బమ్‌బహదూర్, ఈమె నీ కొత్త మహారాణి. బహుశ నీవు నాకంటే ఎక్కువ కుతూహలంగా ఎదురుచూస్తున్నావేమో" అన్నాడు. బమ్‌బహదూర్ తన తొండం పైకెత్తి మహారాణికి నమస్కరించింది.

మహారాణి ప్రేమాభిమానాలకు మారుపేరు. దాదాపు యువరాజు అంత ఎత్తు వుంటుంది. విశాలమైన నుదురు, నిండైన పెదవులు, నల్లని పెద్ద మెరిసే కళ్లు. ఆమె కళ్ళతో చూచినట్లే మాట్లాడగలదుకూడ. ఆమె చూపు ఎవరిపైబడితే వాళ్ళు పూర్తిగా మంత్రించినట్లే వుండిపోయేవారు. శ్రుతి చేసివున్న సంగీత వాయిద్యం ఏ చిన్న కదలికకైనా ఏ విధంగా రాగాలాపన చేస్తుందో వాళ్ళు అదే విధంగా మోహితులయేవారు.

బమ్‌బహదూర్ తొండం ఎత్తి ఆమె అందానికి నమస్కారం చేసింది. "బమ్ నా ఏనుగు మాత్రమే గాదు, నాకు స్నేహితుడు కూడ. మే మిద్దరం ఒక్క రోజే పుట్టాము" అన్నారు యువరాజు.

రాణి బమ్‌బహదూర్ వందనం అందుకుని రెండు చేతులు జోడించింది బదులుగా బమ్‌బహదూర్ వాటిని తుండం చివరతో కొంచెంగా తాకింది. మళ్ళీ క్రమశిక్షణగల

సైనికునివలె రాణిగారి వంక చూస్తూ శ్రద్ధగా కదలకుండా నిలుచున్నది.

బమ్ గుండెల్లో ఉప్పొంగుతున్న మనోభావాల్ని గుర్తించి "మన బమ్‌కు ఏనుగు శరీరమున్నదిగానీ, ప్రేమికుడి కుండే ఆత్మ వున్నది. దాని కళ్ళు చాల తెలివైనవి" అని యువరాజు చిన్నగా కొంటెగా నవ్వుతూ యువరాణి వైపు చూచి "ముఖ్యంగా అందమైనవారి ముఖం చూచినప్పుడు" అన్నాడు.

మహారాణి తన కళ్లు తిప్పి యువరాజు, వైపు తరువాత బమ్ వైపు చూచింది. అదే ప్రేమభావాన్ని ఇద్దరి కళ్ళల్లోను చూచి తాను ప్రపంచంలో కంతటికీ అధికురాలనుకున్నది.

చాల రోజులదాకా యువరాజు పెళ్ళి ఉత్సవాలలో మునిగిపోయి, ఆనవాయితీగా ప్రతివారం ఏనుగుల శాలకు వెళ్ళటం మానుకున్నాడు. ఈ మధ్యకాలంలో బమ్‌బహదూర్‌కి మావటివానిపై గల ఆగ్రహం ఎక్కువ కాసాగింది. మావటివాడి ఆజ్ఞలకు అది చాల బాధపడింది. బరువు తగ్గిపోవటం మొదలు పెట్టింది. రోజూ లభించే ఆహారం కంటే ఎక్కువ ఆహారం లభిస్తున్నది.

ఒక రోజు మావటివాడు సమయం కనిపెట్టి, మరొకసారి యువరాజుగారికి పెరిగిపోతున్న దాని మూర్ఖత్వం గురించి ఫిర్యాదుచేసి, దాన్ని జంతు ప్రదర్శనశాలకు పంపవలసిందిగా సూచించాడు. దాని స్థానంలో జంతు ప్రదర్శనశాల నుంచి మరొక పిల్ల ఏనుగుకు అవసరమైన శిక్షణ యిచ్చి దాన్ని పట్టపుటేనుగుగా చేయాలని చెప్పాడు.

"లేదు, బమ్‌లో ఏ లోపం లేదు." కోపంతో గట్టిగా అరిచారు యువరాజు. "నేను శ్రద్ధ చూపటంలో ఉపేక్ష చేశాను. కాబట్టి బమ్ బ్రతికి వున్నంతకాలం ఎవ్వరూ ఆ స్థానాన్ని ఆక్రమించలేరు.

ఆ రాత్రి యువరాజు మహారాణితో బమ్ భక్తి విశ్వాసాలను తెలిపే అనేక ఉదాహరణలను చెప్పి, తాను రాజ్యవ్యవహారాలలో మునిగివుండటం చేత స్నేహితుడ్ని అశ్రద్ధ చేయుటం జరిగిందని చెప్పాడు. మహారాణిని కనీసం వారానికొక్కసారైనా గజశాలకు వెళ్లి బమ్ విషయాలు కనుక్కోమని చెప్పాడు.

మహారాణి వెంటనే అంగీకరించింది. ఆ మరునాడే ఆమె మంచి పిండితో చేసిన 10 సేర్ల లడ్డూలతో ఏనుగులశాలకు వెళ్ళింది. బమ్ లోలోపల సంతోషించింది. మహారాణి తన చేతులతో రుచికరమైన లడ్లు దాని నోట్లో పెట్టినపుడు శరీరం సంతోషంతో వణికింది. తన చిన్న తోకను తిప్పి చెవులు కదిలించింది. తొండంతో సున్నితంగా మహారాణి చేతులు దువ్వి కాళ్ళను తాకింది. యువరాజు అక్కడ

వుండివుంటే బమ్‌కు మహారాణి నడుం చుట్టూ తన తొండాన్ని చుట్టి రాణిని తన తలవరకూ ఎత్తాలని వుందని తెలుసుకునేవాడు.

మహారాణి "బమ్‌బహదూర్, ఇది యువరాజుగారి కోరిక. ఒకవేళ వారు నిన్ను చూడటానికి వారంవారం రాలేకపోతే, నేను ఆయున బదులు రావాలి. అదేగాక నీనుంచి ఆయన ఏ విధమైన ఫిర్యాదు వినకూడదని కోరుతున్నారు" అన్నారు.

బమ్‌బహదూర్ తొండాన్ని పైకెత్తి దాని చివరతో మహారాణి గారి పాదాల వద్ద నేలపైన గుండ్రంగా గీసింది. "ఏలినవారికి విన్నపం. బమ్ మీరు కోరినట్లుగా ప్రవర్తిస్తానని ప్రతిజ్ఞ చేస్తున్నది" అని మావటి వాడు వివరించాడు.

మహారాణి చాల సున్నితమైన హృదయం కలది. ఎవరైన నమస్కరించినప్పుడు వారు మనిషైనా, జంతువైనా, పై తరగతివారైనా, కింది తరగతివారైనా ప్రతిసారీ అప్రయత్నంగా రెండు చేతులూ జోడించి నమస్కరిస్తుంది. మొదటి పరిచయంలో బమ్ యువరాణి ముకుళించిన చేతుల్ని మాత్రమే తాకింది. ఈసారి తనను తాను అదుపులో పెట్టుకోలేక తుండాన్ని ఏ అలంకారము లేని ఆమె ముంజేతులను చుట్టి వెంటనే తమ అంతస్తులలోని తేడాను గుర్తించి వెనకడుగు వేసింది.

మతాదిన్‌కు ఇది ఇష్టం లేక బమ్‌ను గద్దించాడు.

"అలా వీల్లేదు. వీల్లేదు" అని మహారాణి అభ్యంతరం చెప్పి "నువ్వు నా ముందు బమ్‌ను ఎప్పుడూ తిట్టకూడదు" అన్నది.

ఆ రోజు మతాదిన్ ఉత్సాహం తక్కువగా వున్నాడు. బమ్ మాత్రం చాల ఉత్సాహంతోను, సంతోషంతోను వున్నది. మతాదిన్ వైపు కోపంగా కూడ చూడలేదు.

ఆ సాయంకాలం మతాదిన్ అది రాత్రి తినే మేత నుంచి కొన్ని లడ్లను దొంగిలించాడు. బమ్‌కు బాగా కోపం వచ్చి ఆహారాన్ని అంటుకోలేదు. మరునాటి ఉదయం మతాదిన్ కొద్దిగా భయపడి దానికి కొలతగా ఇచ్చే తిండిలో తక్కువైన భాగాన్ని నింపాడు.

మహారాణి చెప్పిన మాటను నిలుపుకొని ప్రతివారం బమ్‌ను చూసేది. ఆమెకు ఎదురయ్యే ఆహ్వానం మిక్కిలి ఆనందం కలిగించేది.

కొండల్లో నివసించేది, ఒక తొండం విసురుతో తన చిన్న దేహాన్ని పెళుసుగా అణగద్రొక్కగలది, వారమంతా తన కోసం ఎదురు చూస్తూ, చూడగానే ఆనందం పొంగిపోతుందని తలచుకుంటే ఆమెకు ఎంతో సంతోషం కలిగేది. బమ్ ఆమెను లాలించి ముద్దాడేది. తన తొండం చివరను ఆమె చేతులపై పెట్టి ఆమె పాదాలను

తాకేది.

ఆ జంతువునుంచి లభించే ప్రేమకు మహారాణిగారి గుండె గర్వంతో నిండిపోయేది. బలమైన స్తంభములను సైతం పిండి చేయగల బమ్ మహారాణిగారి ముందు చిన్నపిల్లవాడి వలె ప్రవర్తించేది. ఆమె చేతులు, పాదాలు ముద్దుపెట్టుకుంటున్నపుడు దాని నోరు కూడా పసిపిల్లవాడి లాగా చొల్లుకార్చేది. ఆమెకు వీలైనంత దగ్గరగా నిలబడాలని దాని కోరిక. ప్రతిసారీ ఆమె దానికి ఏదైన తినిపించటం పూర్తికాగానే, తన తొండాన్ని ఆమె సన్నని కటిభాగం చుట్టూ చుట్టి తల ఎత్తుకి పైకి ఎత్తేది. పసిపిల్లవాడిని తల్లి ఎంత మృదువుగా ఎత్తుకుంటుందో అలా అది అంతకంటే ఎక్కువగా చేసేది. మహారాణి దాని సంకెళ్లు తీస్తే బమ్ ఏనుగుల శాలంతా దూకేది. ఆమెను తిరిగి అంతఃపురానికి తీసుకు వెళ్లి తరువాత తొండాన్ని పైకి లేపి నమస్కరించి ఆమె పాదాల్ని ముద్దాడి తరువాత వేగంగా ఆమె కటిభాగం చుట్టూ చుట్టేది. చీర మడత వొక్కటి కూడ దాని స్థానం తప్పి పోకుండా మహారాణిని మరు నిముషంలో నేల మీద దింపేది.

రాజుగారు రాచకార్యాలలో మునిగిపోయారు. తరుచుగా అంతఃపురం వదలి వెళ్ళవలసి రావటంతో ఏనుగులశాలకు వెళ్ళటానికి ఏమాత్రం వీలయ్యేది కాదు. మరొకవైపు మహారాణి తరుచు బమ్‌ని చూడసాగారు. చూసేందుకు వెళ్ళే ముందురోజే తయారుచేయవలసిన మిఠాయిలు ఎవో చెప్పి అవి వేర్వేరు రుచులతో తయారుచేయించేవారు. బమ్‌కు స్వయంగా తన చేతులతో తినిపించేవారు. ఆ జంతువు నుంచి పొందే ప్రేమ అంతకుముందు మానవులనించి పొందిన దానికంటె ఎంత విలువైనదో అని తలపోసేవారు.

ఈ మధ్యకాలంలో బమ్‌కు మహారాణి మీద ఎలా ప్రేమ బలపడిందో అట్లాగే మతాదిన్ మీద అసహ్యం పెరిగిపోయింది. మతాదిన్ ఇల్లు కట్టుకునే స్థలం ఒకటి యువరాజు నుంచి పొందాడు. ఆ స్థలంలో అతను చిన్న గుడిసె లేపి, చుట్టూ చిన్న తోట వేశాడు. తన సౌకర్యాలు చూసుకుంటూ బమ్‌కు ఇచ్చే ఆహారాన్ని ఉపేక్షించాడు రెండురోజుల వరకూ బమ్‌బహదూర్ ఆహారాన్ని ముట్టుకోవటానికి నిరాకరించి, మతాదిన్ వైపు ఒక్కసారి కూడ చూడలేదు.

ఒక రోజు యువరాజు వేటకు వెళ్లాలని నిర్ణయించుకున్నాడు. అంతకు ముందు ఎప్పుడైనా పులివేటకు వెళ్తే బమ్‌బహదూర్ పై సవారి చేస్తూ వెళ్లేవాడు. ఈసారి మతాదిన్ బమ్ మానసిక స్థితి వివరించాడు. గత రెండు రోజులుగా బమ్ నలతగా వున్నదని మతాదిన్ యువరాజుతో చెప్పి తనపై దయవుంచి యీసారికి శిక్షణ

పొందిన యింకొక ఏనుగును తెప్పించుకోవలసిందిగా కోరాడు.

వేటకు వెళ్లే పరివారం ఏనుగుల శాలమీదుగా వెళ్లింది. బమ్ అది కిటికీగుండా చూచి నిరసనగా పెద్దగా బాకా ఊదినట్లుగా ఏడ్చింది. ఎవరూ దాన్ని పట్టించుకోలేదు. దానితో అది కష్టపెట్టుకుని మౌనంగా వుండిపోయింది.

పరివారం వేటకు వెళ్ళటం చూశాక మతాదిన్ తన తోటలోకి వెళ్లి మొక్కలు, పూలమళ్లూ వాటిలో మునిగిపోయాడు. వాడికి వచ్చే జీతం తక్కువే అయినా కొంతవరకు సుఖంగానే బతుకుతున్నాడు. ఆ రోజు మొత్తం బమ్‌ముఖం మాడ్చుకొని కోపంగా వున్నది. కడుపులో మంటను నెమరు వేసుకున్నది. ఒకరవ్వ ఆహారాన్నిగూడ అంటుకోలేదు. మధ్యాహ్నం ఆ శాలలోని పనివాళ్ళు దాని వింత స్థితిని గమనించి, మతాదిన్‌కు చెప్పారు. మతాదిన్ వచ్చి పెద్దగా కోప్పడటం మొదలుపెట్టాడు. మతాదిన్ వైపు చూడనైనా చూడకుండా అది అటు వైపుకు తిరిగింది. ఒక గట్టి దెబ్బ వేయుబోయేముందు మతాదిన్ దాని కాళ్ళకు వుండే సంకెళ్ళు గట్టిగా వున్నాయో లేదో చూసుకున్నాడు. దాని మేత తిన్నదో లేదో చూడటానికి అటు తిరగగానే బమ్ తొండం ఒక్కసారే మెరుపులాగా పైకి లేచి మతాదిన్‌ను నేలపై కాళ్ళూ చేతులు చాపుకొని పడుండేలాగా చేసింది.

స్థూలమైన దాని పాదాన్ని మతాదిన్ గుండెలపై వుంచింది. కన్ను తెరిచేలోగా మతాదిన్ ముద్దలాగా నలిగిపోయాడు. బమ్ తన సంకెళ్ళు పగులగొట్టుకున్నది. పనివారంతా అకస్మాత్తుగా భయపడి అటు ఇటు పరిగెత్తారు.

బమ్‌బహదూర్ ఏనుగుల శాలనుంచి బయటపడి మతాదిన్ తోటవైపు వెళ్లింది. చెట్లనీ పీకివేసి పూలమళ్ళపై పడింది. మతాదిన్ పిల్లలు భయపడి గుడిసె నుంచి బయటకు పరుగెత్తారు. బమ్ గుడిసెను పీకి కుప్పలాగ చేసింది.

బమ్‌బహదూర్ పిచ్చిగా పరుగెత్తి పారిపోయిన వార్త మహారాణికి చేరింది. పోలీసు సూపరింటెండెంట్ దాన్ని చంపెయ్యటానికి అనుమతి కోరాడు.

"కానీ మీరు ఇప్పుడు మతాదిన్ వొక్కడికే హాని చేసిందని చెప్పారు?" అని రాణిగారు ఎదురు ప్రశ్నించారు.

"రాణిగారూ! నా కందిన సమాచారాన్ని బట్టి అది మతాదిన్ సోదరుని ఇంటికి వెళ్లిందని తెలిసింది. అది అతనిని గూడ వదలదని ఖచ్చితంగా చెప్పగలను."

"మతాదిన్ సోదరుడా? అతనేం చేస్తాడు?"

"రాణిగారు! అతను ఏనుగులశాలకు సంరక్షకుడు."

"సరే అయితే అతను కూడ మతాదిన్ అంతటి దొంగ అయివుంటాడు.

బమ్‌బహదూర్‌ని చంపవలసిన అవసరమేమున్నది. దయచేసి నన్ను ఒక్కసారి దాని దగ్గరకు తీసుకువెళ్ళండి" అన్నారు మహారాణీ.

మహారాణీ తన మందిరానికి వెళ్ళి తాను చివరిసారి బమ్‌బహదూర్‌ను చూడటానికి వెళ్ళినప్పుడు కట్టుకున్న చీర కట్టుకున్నారు.

"రాణీగారూ! మీరు ఆపదలో ఇరుక్కుంటున్నారు. ఇది చాల ప్రమాదం." అని పోలీసు అధికారి హెచ్చరించాడు.

"నేను చెప్పినట్లు చెయ్యండి" అని మహారాణీ ఆజ్ఞాపించారు. "నా కారు తీసుకు రండి. మీకు కావలసినంతమంది బందోబస్తు మీరు తీసుకోవచ్చు."

కొంచెం సేపటికి మహారాణీగారి కారు వేగంగా రోడ్డుమీద పరుగెత్తింది. వెనుక రక్షక దళం వెంబడించింది. అదే రోడ్డు ఆ చివరనుంచి బమ్‌బహదూర్ వచ్చింది. ఒక మంచి నీటికుండ దగ్గర ఆగి తన తొండంనిండా నీరునింపుకొని తిరిగి బయులుదేరింది. ఎవరైనా ధైర్యం చేసి దగ్గరకు వస్తే వారికి లభించే బహుమతి మురికినీటి జల్లే! బమ్ ఇంకెవ్వరికీ ఏ హానీ చెయ్యలేదు.

వారిద్దరి మధ్య ఫర్లాంగు దూరం వుండగానే మహారాణీ కారు ఆపి దిగారు. పోలీసు సూపరింటెండెంట్‌ను తనతో రావద్దని వారించారు.

"మీరు మీ రక్షక దళాన్ని సిద్ధంగా పెట్టుకోవచ్చు" అని ఆజ్ఞాపించారు. నేను నా రెండు చేతులూ పైకి ఎత్తితే కాల్చటానికి గుర్తులాగా భావించవచ్చు.

కాని ఎట్టి పరిస్థితులలోను మీ అంతట మీరు కాల్చవద్దు. బమ్‌బహదూర్‌కి పిచ్చెక్కి పారిపోలేదని నా కనిపిస్తున్నది" అన్నారు మహారాణీ.

బమ్‌బహదూర్ కారు చూసి ఆగిపోయింది. దాని కళ్లు గురిపెట్టబడ్డ తుపాకీల వైపు తిరిగాయి. పారిపోవటానికి నిశ్చయించుకొని పరుగందుకొని కారు దగ్గరకు రాగానే దారిలో మహారాణీ నిలుచుని వున్నారు. సూపరింటెండెంట్ తన పరివారాన్ని కాల్చటానికి సిద్ధంగా వుండమని హెచ్చరించారు.

మహారాణీ అటు తిరిగి పెద్దగా "నేను చెప్పేవరకూ ఎవరూ కాల్చవద్దు" అని హెచ్చరించారు.

తరువాత ఆమె బమ్‌బహదూర్‌ను కలుసుకోవటానికి పరుగెత్తారు. మహారాణీకి ఏనుగుకు మధ్య యాభై గజాలే వుంది. సూపరింటెండెంట్ అతని దళం ముందుకు ఉరికారు. బమ్‌బహదూర్‌కి ఏ దారి లేకుండ ఆగిపోయింది. ఇంక ఏమాత్రం ముందుకు పోవద్దని మహారాణీ అక్కడి మనుష్యులను ఆజ్ఞాపించారు. చిన్న అడుగులు వేసుకుంటూ మహారాణీ ఏనుగును సమీపించారు. చివరికి

బమ్‌బహదూర్ ఆమెను చూసింది. తన తొండాన్ని నమస్కరించినట్లుగా పైకి లేపింది. మహారాణి చేతులు జోడించి తిరిగి నమస్కరించారు. కాని గతంలో లాగా అది ఆమె చేతులను తాకలేదు.

"నా ప్రియమైన బమ్‌బహదూర్! నేను రోజు నీ తొండాన్ని మురికిగా చూస్తున్నాను. నీవు నన్ను తాకక పోయినా, నీ తొండం నా శరీరాన్ని తాకినట్లే అనుకుంటున్నాను. నీవు ఇంత విచారకరమైనదశకు ఎందుకు వచ్చావు" అని ప్రేమతో అన్నారు మహారాణి.

మహారాణిగారి పాదాల ముందు బమ్ తన తొండం చివరతో అనేకసార్లు గుండ్రంగా గీసింది. అది దాని గుండెలో వేదనను నిరూపిస్తున్నట్లుగా వున్నాయి. నాకు ధైర్యశాలియైన బమ్‌బహదూర్ గుండెల్లో ఏం జరుగుతున్నదో తెలుసు." అన్నారు మహారాణి చాల దయగల గొంతుతో. "నాకు తెలుసు నువ్వు పిచ్చిదానివి కాదని. పగ నీ అందమైన ఆత్మను కాల్చివేసింది. పగ, ద్వేషము మనుష్యులను ఏమి చేయగలదో నాకు తెలుసు.

బమ్‌బహదూర్ ఆమె పాదాలముందు మరొకసారి గుండ్రంగా గీసింది. మహారాణి ఏనుగు కళ్ళలోకి చూశారు. వాటిలో కన్నీరు కనిపించింది. "మతాదిన్ సోదరుని ఇంటి దగ్గర ఏం చేస్తున్నావు బమ్‌బహదూర్? అతను కూడ నిన్ను గాయపరిచాడా?"

బమ్‌బహదూర్ తన కుడి కాలును పైకెత్తి మళ్ళీ నేలమీద మోపింది. దాని కాలంతా రక్తంతో తడిసి వుండటం మహారాణి చూశారు.

ఆమె దానితో మాట్లాడటం కొనసాగించారు: "బమ్‌బహదూర్! ఎవరైతే ధైర్యశాలులైన వారి గుండెల్లో విషాన్ని ఎక్కిస్తారో, వాళ్ళు మృత్యువుతో ఆడుకున్నట్లే!"

"నేను ఇకనుంచి నిన్నెవ్వరూ బాధపెట్టకుండా చూస్తాను. ఇంకెవ్వరూ నిన్ను దోచుకోకుండా చేస్తాను. నిన్ను చెడుమనుష్యులనుంచి రక్షిస్తాను. వాళ్ళు మనుష్యుల్లాగే కన్పిస్తారు గాని హృదయంలో నిజమైన రాక్షసులు."

బమ్‌బహదూర్ నిశ్శబ్దంగా విన్నది. మహారాణి ఇంకా ఇలా అన్నారు: "ప్రియమైన బమ్‌బహదూర్! కోపం నీ గుండెలోని ప్రేమను ఎట్లా మింగివేసిందో అర్థం చేసుకోగలను. నీవు మతాదిన్ పిల్లలుండే గుడిసెను ఎలా పీకేశావు? వాళ్ళు నీకేం అపకారం చెయ్యలేదుగదా! మళ్ళీ నీవు వాళ్ళకు దాన్ని తిరిగి ఏర్పరచాలి."

బమ్‌బహదూర్ రెండుసార్లు గుండ్రంగా రాణిగారి పాదాల ముందు గీసింది. మహారాణి మళ్ళీ యిలా అన్నారు: "నాకు తెలుసు. నీవు అలా చేసినందుకు

దిగులుపడుతున్నావు. మళ్లీ దాన్ని తిరిగి ఏర్పరచితే నన్ను సంతోషపరచిన దానవవుతావు. ఆహారంలో సగంతో జీవిస్తానని ఒప్పుకుంటే ఆ ఖర్చుతో మళ్ళీ ఆ గుడిసెను నిర్మిస్తాను. నీకు ఇష్టమేనా?"

బమ్‌బహదూర్‌కు ఏమి అర్థమయిందో మనకు తెలియదు. వృత్తాలు గీయటమే దానికి తెలిసిన భాష, మళ్లీ చాల వృత్తాలు గీసింది.

మహారాణీ దాని తొండం పైన బురదంతా అట్టకట్టుకు పోవటాన్ని గమనించారు. తన చెయ్యి చాపి తొండాన్ని దువ్వారు. ఇంతకుముందు ఏనుగు తన ప్రేమను మహారాణికి తెలియజేసింది. ఇప్పుడు మహారాణీ తాము దాన్ని ఎంతగా ప్రేమిస్తున్నారో చెప్పటానికి ప్రయత్నిస్తున్నారు. అక్కడ అది ఒక బతికున్న కొండలాగ నిలబడింది. ప్రేమ, అందమూ చెదిరిపోతాయని అది కదలటానికి ఇష్టపడలేదు.

మహారాణీ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ బమ్‌బహదూర్‌ని తనను అనుసరించమని సైగ చేశారు. ఆమె ముందు నడిచారు. ఏనుగు ఆమెను అనుసరించింది. ఆ వెనుక పోలీసు అధికారి, వారి దళమూ వెళ్లారు. బమ్‌బహదూర్‌ను, అలా ఏనుగుల శాలవరకూ తిరిగి తీసుకొని వచ్చారు.

ఏనుగుల శాల అధికారులు మారారు. బమ్‌బహదూర్‌కి తప్ప, అన్ని ఏనుగులకు పూర్తి ఆహారాన్ని యిచ్చారు. ఇంకెప్పుడూ బమ్‌బహదూర్ తాను ఆ శాలకు రాజైనట్లు ప్రవర్తించలేదు.

మహారాణీ చాలరోజుల వరకూ ఏనుగు శాలకు వెళ్ళలేదు. కొంతకాలం తరువాత ఆమె బమ్‌బహదూర్‌ను పిలిపించి దానితో మాట్లాడారు. నీవు సగం భోజనానికి అలవాటు పడ్డట్లున్నావు. ఇంతకు ముందు కంటే ఆరోగ్యంగా, సంతోషంగా కన్పిస్తున్నావు. నువ్వు ఇప్పుడు నీ పాపాన్నుంచి బయటపడ్డావు.

"ఎప్పుడూ సంతోషంగా వుంటావు."

బమ్‌బహదూర్ మహారాణీని తొండంతో పైకి లేపి తన తలపై కూర్చోపెట్టుకున్నది.

# స్టాంప్ ఆల్బమ్

## సుందర రామస్వామి

రాజప్పకు తన పలుకుబడి ఉన్నట్లుండి తగ్గిపోయినట్లు అనిపించింది. గత మూడురోజులుగా అందరూ నాగరాజన్ చుట్టూ చేరుతున్నారు.

నాగరాజన్‌కు గర్వం నెత్తికెక్కిందని వాళ్లకు చెప్పటానికి చాల ప్రయత్నించాడు రాజప్ప కాని ఎవరూ అతని మాటలు వినలేదు. నాగరాజన్ మామయ్య సింగపూర్ నుంచి పంపిన స్టాంప్ ఆల్బమ్‌ను ఉదారంగా అందరికీ యిచ్చాడు. పిల్లలు నాగరాజన్ చుట్టూచేరి ఆల్బమ్‌ను తమ కళ్లతో తినివేసినట్లుగా ఉదయం స్కూల్ గంట కొట్టేవరకూ చూశారు. మధ్యాహ్నం భోజనాలు చేసే సమయంలో అతని చుట్టూ చేరారు. సాయంకాలం అతని ఇంటిమీదకు దండెత్తారు. నాగరాజన్ వచ్చిన వాళ్లందరికీ విసుగు లేకుండ ఆల్బమ్ చూపించాడు. వాళ్లలో ఒక ఒడంబడిక చేసుకున్నాడు. అదేమంటే "ఎవ్వరూ ఆల్బమ్‌ను తాకరాదు." తన వొడిలో ఆల్బమ్‌ను పెట్టుకొని పేజీలు తిప్పుతూ వారిని చూడనిచ్చాడు.

అమ్మాయిలకు కూడ ఆ ఆల్బమ్ చూడాలని కోరిక కలిగింది. వాళ్లలో ధైర్యస్తురాలు పార్వతి నాగరాజన్ దగ్గరకు వచ్చి స్నేహితురాళ్ల తరఫున ఆల్బమ్ అడిగింది. నాగరాజన్ దానికి అట్టవేసి ఇచ్చాడు. అమ్మాయిలందరు చూసి సాయంత్రానికి ఆల్బమ్ తిరిగి యిచ్చారు.

ఇప్పుడు ఎవరూ రాజప్ప ఆల్బమ్ ప్రసక్తి తీసుకురావటం లేదు. అతనంటే శ్రద్ధ తగ్గింది.

ఒకప్పుడు రాజప్ప ఆల్బమ్‌ని అందరూ మెచ్చుకునేవారు. తేనెటీగ కష్టాలు పడి ఎలా తేనెను సేకరిస్తుందో రాజప్ప కూడ అదేవిధంగా కష్టపడి స్టాంపులు సేకరించాడు. అతనికి ఆల్బమే జీవిత సర్వస్వం. ఉదయమే ఇంటినుంచి బయలుదేరి స్టాంపులు సేకరించే పిల్లల వద్దకు వెళతాడు. రెండు పాకిస్థాన్ స్టాంపులకు ఒక

U.S.S.R. స్టాంపు మారకం వేస్తాడు. సాయంకాలం స్కూల్ పుస్తకాలు ఒక మూల పడేసి, రెండు బిస్కత్తులు లాగుజేబులో కుక్కుకుని ఒక కప్పు కాఫీ త్వరగా గుటకవేసి బయటకు పరుగెత్తేవాడు. నాలుగు మైళ్లదూరంలో ఒక అబ్బాయి దగ్గర కెనడా స్టాంపు వున్నది. ఒక రెవెన్యూ ఆఫీసర్‌గారి కొడుకు ఆల్బమ్‌ను 25 రూపాయలకు కొనాలనుకున్నాడు.

దానికి బదులు రాజప్ప అతనితో "మీ బుల్లి తమ్ముడ్ని మూప్పై రూపాయలకు అమ్ముతావా" అని అడిగాడు. ఆ ఎదురు దెబ్బకు మిగిలిన అబ్బాయిలు మెచ్చుకొన్నారు.

కాని ఇప్పుడతని ఆల్బమ్ ఎవరూ చూడటంలేదు. అంతే కాదు. నాగరాజన్ ఆల్బముకీ రాజప్ప ఆల్బముకీ అసలు సాపత్యమే లేదన్నారు.

రాజప్ప నాగరాజన్ ఆల్బమ్ చూడటానికి నిరాకరించాడు. ఇతర పిల్లలు పొగిడి నప్పుడు, ముఖం పక్కకు తిప్పకునేవాడు. కాని ఓరగా చూడాలని ప్రయత్నించేవాడు. అది అందమైనదే! అందులో రాజప్ప వద్ద నున్న స్టాంపులే లేకపోవచ్చు. అంతేగాక రాజప్ప దగ్గర వున్నన్ని లేకపోవచ్చు. కాని దానికి అదేసాటి. ఏ షాపులోనూ అలాంటి ఆల్బమ్ లేదు.

నాగరాజన్ మామయ్య మేనల్లుడి పేరు మొదటి పేజీమీద పెద్ద అక్షరాలలో ఎ. యస్. నాగరాజన్ అని వ్రాశాడు. దానిమీద శాసనం లాగా యీ కింది మాటలు వ్రాశాడు. "ఏ నీచుడైనా సిగ్గులేకుండా యీ ఆల్బమ్ దొంగిలించాలని చూస్తే పైన నా పేరు చూడమనండి. ఇది నా ఆల్బమ్, ఇది నా ఆస్తి. గడ్డి ఎంతకాలం పచ్చగా వుంటుందో, తామర ఎంతకాలం ఎర్రగా వుంటుందో, సూర్యుడు ఎంతవరకూ తూర్పున ఉదయించి పడమట అస్తమిస్తాడో, అంతదాకా యీ ఆల్బమ్ నా ఒక్కడిదే!"

ఈ మాటలు, అబ్బాయిలు తమ ఆల్బమ్‌లో చూసి వ్రాసుకున్నారు. అదే విధంగా అమ్మాయిలు కూడ పుస్తకాల్లోను, నోట్సు పుస్తకాల్లోను వ్రాసుకున్నారు.

రాజప్పకు మండిపోయి "మీ రెందుకలా గుడ్డిగా చూసి వ్రాసుకుంటున్నారు" అన్నాడు. అబ్బాయిలు రాజప్పవైపు తేరిపారజూచారు. కృష్ణన్ అనే అబ్బాయి మాత్రం అందుకు "పో, పో అసూయాపరుడివి" అని ఎత్తిపొడిచాడు. "అసూయా? నాకా? నా కెందుకుండాలి! నా ఆల్బమ్ ఇంతకన్నా చాల పెద్దది! అంతేకదా?"

"నీ ఆల్బమ్‌లో ఇలాంటి స్టాంపులు లేవు. ఈ ఇండోనీషియా స్టాంపు ఎంత అందంగావుందో చూడు! పట్టుకొని వెలుగులో పెట్టిచూడు!"

"అతని దగ్గర నా దగ్గర వున్న స్టాంపులు లేవు."

"ఆహా! ఏదీ అతని వద్ద లేనిది ఒక్కటి చూపించు."

"నా దగ్గర లేని స్టాంపు వొక్కటి మీరు చూపండి. పది రూపాయల పందెం వేసుకుందాము"

"నీ ఆల్బమ్ చెత్తబుట్టలోకి పనికి వస్తుంది" అని కృష్ణన్ దెప్పిపొడిచాడు. పిల్లలందరూ 'చెత్త ఆల్బమ్, చెత్త ఆల్బమ్!' అని పాట పాడారు.

రాజప్ప వాళ్లతో వాదం పెట్టుకోవటం వ్యర్థమని గ్రహించాడు. రాజప్పకు, స్టాంపులు సేకరించుకోవటానికి ఎంతకాలం పట్టిందో! ఒక్కొక్క స్టాంపు వరుసగా సేకరించుకున్నాడు. అంతలోనే యీ పోస్ట్‌మాన్ నాగరాజన్‌కు సింగపూర్ నుంచి ఆల్బమ్ తెచ్చి యిచ్చాడు. ఒక్క రాత్రిలోనే నాగరాజన్ ముఖ్యుడై పోయాడు. అబ్బాయిలకు రెండు ఆల్బమ్‌లకున్న తేడా తెలియటం లేదు. ఎంత వివరించి చెప్పినా, కొంచెం కూడ మార్పురాదు.

రాజప్ప లోలోపల మండిపోయాడు. స్కూల్‌కు వెళ్ళటమంటే అయిష్టం ఏర్పడింది. అబ్బాయిలకు తన ముఖం ఎలా చూపించటం? సామాన్యంగా ప్రతి శని, ఆదివారాలు స్టాంపులకోసం వేటాడేవాడు. ఈ వారం మాత్రం ఇల్లు కదలలేదు. మునుపయితే ఆల్బమ్‌లో పేజీలు మళ్ళీ మళ్ళీ తిప్పకుండ వొక్కరోజు గడిచేది కాదు. రాత్రిపూట కూడ దొంగతనంగా మంచం దిగి వెళ్ళి ఆల్బమ్ చూసుకునేవాడు. కాని రెండు రోజులు గడిచినా ఆల్బమ్ ముట్టుకోలేదు. దాన్ని చూస్తేనే కోపం వచ్చేది. నాగరాజన్ ఆల్బమ్‌తో పోలిస్తే తన ఆల్బమ్ చిరిగిన బట్టల మూటలాగా కనిపించింది.

సాయంకాలం రాజప్ప నాగరాజన్ ఇంటికి వెళ్ళాడు. ఈ అవమానాన్ని యిక భరించకూడదని మనస్సులో అనుకున్నాడు. నాగరాజన్‌కు ఎలాగో వొక ఆల్బమ్ వచ్చింది. అంతేగదా! నాగరాజన్‌కు స్టాంపులు సేకరించటంలో మజా ఏం తెలుసు? స్టాంపు ఎంత పెద్దదైతే దానికి అంత విలువ అనుకుంటున్నాడేమో! లేక పెద్ద దేశాల స్టాంపులు ఎక్కువ విలువైనవనీ, చిన్న దేశాల స్టాంపులకు విలువ తక్కువనీ అనుకుంటున్నాడేమో! నాగరాజన్ దేముంది. అతనికి స్టాంపుల సేకరణలో కేవలం ఆసక్తి మాత్రమే వున్నది. తను చాల తేలికగా విలువ తక్కువ స్టాంపులను అరచేత్తో అతనిపై విసరి మంచి స్టాంపులు చేజిక్కించుకొని వెళ్ళిపోగలడు. అలా ఎందరినో వెర్రివాళ్ళను చేశాడు. స్టాంపుల సేకరణ ప్రపంచం అంతటా జిత్తులమారితనం, మోసం వ్యాపించివున్నాయి. నాగరాజన్ యీ విషయంలో యిప్పుడే ప్రవేశం.

రాజప్ప తిన్నగా మేడమీద నాగరాజన్ గదికి వెళ్ళాడు. అతను తరుచుగా వాళ్ళ యింటికి వెళతాడు. కనుక ఎవరూ అతన్ని ఆపలేదు. రాజప్ప నాగరాజన్ వ్రాతబల్ల వద్ద కూర్చున్నాడు. కొంతసేపటికి నాగరాజన్ చిన్న చెల్లెలు కామాక్షి వచ్చి "లోపలకురా! అన్నయ్య ఊళ్ళోకి వెళ్ళాడు" అని చెప్పి "అన్నయ్య కొత్త ఆల్బమ్ చూచావా?" అని అడిగింది. రాజప్ప ఏదో గొణిగాడు. "చాలా బాగుంది. కాదా? స్కూల్లో ఇంకెవ్వరికీ ఇలాంటిది లేదని నా నమ్మకం"

"అలా ఎవరు చెప్పారు?"

"అన్నయ్య"

"అది పెద్ద ఆల్బమ్ మాత్రమే. అంతకు మించి ఏమీకాదు. సైజుకు మాత్రమే అది పెద్ద." కామాక్షి ఏమీ సమాధానం చెప్పకుండా వెళ్ళిపోయింది.

రాజప్ప వ్రాతబల్లమీద పెట్టిన పుస్తకాలను పరీక్షగా చూశాడు. అతని చేతితో పైపైన తాళాన్ని లాగి చూచాడు. కాని అయిష్టంగానే లాగిచూశాడు. గట్టి తాళం. ఎందుకు తీయగూడదు? తాళం చెవి పుస్తకాలమధ్య వుంది. రాజప్ప మెట్లవరకూ వెళ్ళి చుట్టూ పరికించి చూసి వచ్చాడు. అక్కడ ఎవరూ కనిపించలేదు. సొరుగు తీశాడు. నాగరాజన్ స్టాంప్ ఆల్బమ్ సరిగ్గా పైనే వున్నది. మొదటి పేజీ తిప్పాడు. దానిమీద వ్రాసిన శాసనం చదివాడు. గుండె కొట్టుకో సాగింది. డ్రాయర్ సొరుగుమూసి తాళం వేశాడు. హడావుడిగా మెట్లుదిగి ఇంటికి పరుగెత్తాడు.

ఇంటికి చేరగానే పుస్తకాల అలమారా వెనుక ఆల్బమ్‌ను దాచాడు. శరీరం మంటలమీద ఉనట్లనిపించింది; గొంతుక ఎండిపోయింది; రక్తం తల కెక్కినట్లయింది.

చివరికి సాయంకాలం 8 గంటలకు ఎదురింట్లో వుండే అప్పు వచ్చి నాగరాజన్ స్టాంపు ఆల్బమ్ కనపడటం లేదని చెప్పాడు. నాగరాజన్ అప్పు కలిసి సాయంకాలం ఊళ్ళోకి వెళ్ళి తిరిగి వచ్చేసరికి ఆల్బమ్ పోయింది. రాజప్ప ఏం మాట్లాడలేదు. అప్పు వెళ్ళిపోగానే గదిలోకి వెళ్ళి తలుపు బిగించుకున్నాడు. పుస్తకాల అల్మైరా వెనుకనుంచి ఆల్బమ్ బయటకు తీశాడు. మంచులాగ చల్లబడింది. ఎవరైనా కిటికీలో నుంచి చూస్తే ఏమవుతుంది? తిరిగి ఆల్బమ్‌ను పుస్తకాల అల్మైరా వెనక్కు త్రోసివేశాడు.

అతికష్టంమీద భోజనం అయిం దనిపించాడు. యింట్లో వాళ్ళు అది గమనించి "వొంట్లో బాగా లేదా?" అని అడిగారు.

నిద్ర మనశ్శాంతి నిస్తుందేమొ! మంచం మీద పడుకున్నాడు. కాని నిద్ర

మాత్రం రాలేదు. ఎవరైనా ఆకస్మాత్తుగా అక్కడ దాచిపెట్టిన ఆల్బమ్ తను నిద్రపోతున్నప్పుడు చూస్తే ఏమవుతుంది? లేచి ఆల్బమ్ తీసుకొని దిండుకింది పెట్టుకున్నాడు.

ఉదయం అప్పు వచ్చి కనిపించే వరకు రాజప్ప నిద్ర లేవలేదు. అప్పు అప్పుడే నాగరాజన్ దగ్గరనుంచి వచ్చాడు.

"నిన్న నువ్వు వాళ్ళింట్లో వున్నట్లు చెప్పాడు."

రాజప్ప గుండె జారిపోయినట్లయింది. మౌనంగా వుండిపోయాడు.

"కామాక్షి చెప్పింది నిన్న నేనూ నాగరాజన్ ఊళ్ళోకి వెళ్ళినప్పుడు అతినికోసం వచ్చింది నువ్వొక్కడివేనని."

రాజప్ప అప్పు గొంతులో అనుమానాన్ని పసిగట్టాడు.

"నాగరాజన్ రాత్రంతా ఏడుస్తూనే వున్నాడు. అతని తండ్రి బహుశా పోలీసుల కోసం కబురు పంపుతాడేమో?"

రాజప్ప ఒక్క మాట కూడ అనలేదు.

నాగరాజన్ తండ్రి పోలీస్ సూపరింటెండెంట్ ఆఫీసులో పనిచేశాడు. అతను చిటికిన వేలు పైకెత్తితే చాలు పోలీసు బలగం మొత్తం ఆల్బమ్ కోసం గాలించేస్తారు.

రాజప్ప అదృష్టం కలిసి వచ్చి, అంతలో అప్పు తమ్ముడు తన అన్నను పిలుచుకు వెళ్లటానికి వచ్చాడు. అతను వెళ్లాక రాజప్ప చాలసేపు తన మంచం మీద కదలకుండ కూర్చున్నాడు. రాజప్ప తండ్రి ఫలహారం ముగించుకొని సైకిలు మీద ఆఫీసుకు వెళ్లిపోయాడు.

అంతలో ఎవరో ముందు తలుపు తట్టారు. ఒకవేళ పోలీసులేమో? రాజప్పదిండు కింద నుంచి ఆల్బమ్‌ను బయటికి లాగి మేడమీదకు పరుగెత్తి దాన్ని అక్కడ పుస్తకాల షెల్ఫ్ వెనుక విసిరాడు. ఇప్పుడు పోలీసులు వెతకటానికి వస్తే ఎలా? షెల్ఫ్ వెనకనుంచి మళ్లీ తీసి, తన చొక్కాకింది దోపుకొని కిందకు వచ్చాడు.

ఎవరో యింకా తలుపు కొడుతున్నారు. రాజప్ప తల్లి వంటింట్లో నుంచి "నీవు వెళ్ళి తలుపు తీయకూడదా" అని కేకవేసింది. అలాగే ఇంకొంచెంసేపు మ్రోగితే వెళ్ళి తలుపు తీసింది.

రాజప్ప ఇంటి వెనుక వైపుకు పరుగెత్తాడు. స్నానాల గదిలోకి వెళ్ళి తలుపు వేసుకున్నాడు. స్నానాల గదిలో ఒక పెద్ద నీళ్ళు కాచే పొయ్యివుంది. రాజప్ప ఆల్బమ్‌ను ఆ మంటలోకి విసిరేశాడు. ఆల్బమ్ తగలబడి, దాంతో విలువైన స్టాంపులు,

ఎక్కడా దొరకని స్టాంపులు కాలిపోయాయి. రాజప్ప కళ్ళనిండా నీళ్ళు నిండాయి.

"నాగరాజన్ నిన్ను చూడాలని వచ్చాడు, త్వరగా రా!" అని కేక పెట్టింది తల్లి.

రాజప్ప చొక్కా తీసివేసి తడి తువ్వాలు చుట్టుకొని స్నానాల గదినుంచి బయటకు వచ్చాడు. శుభ్రమైన చొక్కా, లాగు వేసుకొని మేడమీదకి వెళ్లాడు. నాగరాజన్ కూర్చీలో కూర్చొని వున్నాడు.

"నా స్టాంప్ ఆల్బమ్ పోయింది" నాగరాజన్ గొంతు దుఃఖంతో పూడుకుపోయింది. అతని ముఖం దుఃఖంతో నిండి వున్నది. కళ్లు ఎర్రగా వాచి వున్నాయి.

"ఎక్కడ పెట్టుకున్నావు?" రాజప్ప అడిగాడు.

"డ్రాయర్‌లోనే పెట్టాను. సొరుగుకు తాళం కూడా వేశాను. కొంచెంసేపు బయటకు వెళ్లి తిరిగి వచ్చేటప్పటికీ అది పోయింది." కన్నీళ్ళు ముఖం మీదుగా కారిపోయాయి. రాజప్ప తప్పుచేసినట్లుగా అతి కష్టంమీద స్నేహితుడి వైపు చూసి "ఏడవకు" అని చిన్నగా గొణిగాడు. కానీ ఓదార్చే కొద్దీ నాగరాజన్ ఇంకా ఎక్కువ ఏడ్చాడు.

రాజప్ప కిందకు పరుగెత్తి నిమిషంలో తిరిగి వచ్చాడు. చేతుల్లో తన స్టాంపు ఆల్బమ్ వుంది.

"నాగరాజన్! ఇదిగో నా ఆల్బమ్, ఇది నీదే! నావైపు అలా చూడకు! నిజంగా యీ ఆల్బమ్ నీదే!"

"తమాషాకి అంటున్నావు."

"లేదు. నిజంగా ఇస్తున్నాను. ఈ రోజునుండి యిది నీదే. ఉంచుకో"

నాగరాజన్ తన కళ్ళను తానే నమ్మలేక పోయాడు. రాజప్పేనా, ఆల్బమ్ యిస్తున్నది! కాని రాజప్ప తీసుకోమని బతిమాలుతున్నాడు.

"మరి నీ కెలా?" నాగరాజన్ అడిగాడు.

"నాకు ఇంక ఏమాత్రం వద్దు."

"ఒక్క స్టాంపు గూడా వద్దా?"

"వద్దు వొక్కటి గూడా వద్దు"

"స్టాంపులు లేకుండా ఎలా బతుకుతావు?"

రాజప్ప కళ్ళు నీళ్ళతో నిండాయి.

"ఏడవకు రాజప్పా! నీ ఆల్బమ్ నాకు ఇచ్చివేయ నవసరంలేదు. నీవే వుంచుకో!"

"లేదు నీవు వుంచుకో. ఇది నీ కోసమే. ఇంటికి తీసుకువెళ్ళు. దయచేసి

తీసుకుపో" అన్నాడు బిగ్గరగా.

నాగరాజన్ ఓడిపోయాడు. ఆల్బమ్ తీసుకొని కిందకు వచ్చాడు.

రాజప్ప చొక్కా చివర్లతో కళ్ళు తుడుచుకుంటూ అతని వెంట వెళ్ళాడు.

తలుపు దగ్గర నిలబడ్డారు. నాగరాజన్ "థాంక్స్" చెప్పి శలవు తీసుకున్నాడు.

నాగరాజన్ తిరిగి చూశాడు.

"దయచేసి... దయచేసి ఆ ఆల్బమ్ యీ ఒక్క రాత్రికి నాకు ఇవ్వు. మళ్ళీ నీ చేతికి రేపు ఉదయం ఇస్తాను."

నాగరాజన్ వొప్పుకుని వెళ్ళిపోయాడు.

రాజప్ప మెట్లు ఎక్కి గదికి వెళ్ళి తలుపు వేసుకున్నాడు. ఆల్బమ్ గట్టిగా పట్టుకొని గుండెలో దుఃఖాన్నంతా వెళ్ళగక్కినట్లు ఏడ్చాడు.

# పొదుపు

## రంధి సోమరాజు

ముత్యాల దీవి, ఒక కుగ్రామం. ఆ వూరికి రైలుమార్గం లేదు. ఆ వూరి వారు పట్నం పోవాలంటే పెద్ద చిక్కే ! అయిదారు మైళ్ళు నడిచివెళ్తే కాలువ తగుల్తుంది. ఆ కాలువ ఒడ్డుకు వెళ్ళేందుకూ సరియైన రోడ్డు లేదు. వర్షాకాలం మోకాలు లోతు బురద దిగబడుతుంది. కాలువ ఒడ్డు కెళ్ళిన తరువాత, ఒక రాత్రంతా పడవలో ప్రయాణం చేయాలి. ఆ తరువాత నాలుగుమైళ్ళు జట్కాలో ప్రయాణం చేస్తే పట్నంతో సంబంధమున్న గోర్తివాడనే ఓ పల్లెటూరు తగుల్తుంది. అక్కడనుంచి 40 మైళ్ళు బస్సులో ప్రయాణం చేస్తే పట్నం చేరుకోవచ్చు. ఆ పట్నంనుంచి మహానగరమైన మద్రాసు చేరాలంటే సుమారు 400 మైళ్ళు ప్రయాణం చేయవలసివుంటుంది.

ఇంత మారుమూల ప్రదేశంలో ఉన్న ఆ ముత్యాల దీవిలో అప్పారావనే ఓ పదేళ్ళ పిల్లవాడొక డున్నాడు.

అప్పారావు పల్లెటూళ్ళో ఉంటున్నప్పటికీ తెగఖర్చు చేస్తూ ఉంటాడు. వాడి దుబారా ఖర్చుకు ఓ మితమనేది లేకుండా పోయింది.

ఆ వూళ్ళో చిన్న కాఫీ హోటలొకటి ఉంది. అప్పారావు రోజూ అక్కడకు వెళ్ళి ఇడ్డెన్లూ, పెసరట్లూ మేసేవాడు. ఈ వేళనక, ఆ వేళనక కాఫీ తాగేవాడు. ఆ వూరికి అమ్మకానికి వచ్చే మిఠాయుండలు, చేగోడీలు, జంతికలు, పునుగులు కొనుక్కొని అస్తమానూ నమిలేవాడు. ప్రక్కవూళ్ళో జరిగే సంతకు తోడిపిల్లలతో పారిపోయి జేబులోవున్న డబ్బులన్నీ చిరుతిళ్ళకు ఖర్చుపెట్టేసేవాడు.

ఈ ఖర్చు లీలావుండగా, వాడికి రోజురోజుకూ క్రొత్తబట్టలు కుట్టించవలసివచ్చేది. బట్టలు పొదుపుగా వాడుకోవడం తెలిసేదికాదు. వాటిని తోళ్ళలా మాపేవాడు. పిల్లలతో కుస్తీలుపట్టి, వాళ్లతో గొడవలుపడి, గుడ్డలు చింపుకొనేవాడు. రోజూ తండ్రిని క్రొత్తబట్టలు కుట్టించమని మారాం చేసేవాడు.

ఒక్కడే కొడుకవడంవల్ల వాడి కోరికలు తీర్చకుండా వాడిని ఏడిపించటానికి

ఆ తండ్రి మనసా ప్పేదికాదు. కాని ఇలా వాడ్ని నెత్తికెక్కించుకోవడంవల్ల ఇంకా వాడెన్ని చెడుగుణాలకు అలవాటు పడతాడో అని అతడు ఓ మూల బయపడుతూనే వుండేవాడు.

దీనికి తగ్గట్టుగా అప్పారావు రోజుకో పెన్సిలు పారేసేవాడు. పుస్తకాలు చింపుకొని క్రొత్తపుస్తకాలకోసం గొడవచేసేవాడు. వాడికి డబ్బువిలువ యేమాత్రం తెలిసేదికాదు.

ఈమధ్య వాడు తల్లిదగ్గర ఏడ్చియేడ్చి డబ్బులు గుంజుకొని ప్రక్కవూళ్ళో ఉన్న ఓ టూరింగు సినిమా చూసివచ్చాడు.

వీడి ఆటలు మరీ మితిమీరి పోతూండేప్పటికి సూరయ్యకు మతిపోయింది.

'వీడిప్పుడే ఇలా దుబారాఖర్చుల కలవాటు పడిపోతున్నాడు. వీణ్ణి రేపొద్దుట ఎలాగూ పట్నంలో చదివించవలసివస్తుంది. నా ఎదుటే ఈ పల్లెటూళ్ళో వీడిలా పాడై పోతుంటే అక్కడ ఇంకెంత పాడైపోతాడో మరి చెప్పనే అక్కర్లేదు' అనుకున్నాడు.

డబ్బు గురించి, దాని విలువ గురించి దాన్ని ఎంతజాగ్రత్తగా వాడుకోవాలో, డబ్బు లేకపోతే ఎన్ని ఇబ్బందులు పడవలసివస్తుందో మొదలైన విషయాలన్నీ వాడికి మెల్లిగా చెప్పిచూశాడు. కాని వాడు తండ్రిఎదుట ఇవన్నీ జాగ్రత్తగా వింటున్నట్లే నటించేవాడు. వీధిలోకి రాగానే అన్నీ మరచిపోయేవాడు.

ఈమధ్య వాడు సిగరెట్టుకూడ కాల్చడం మొదలుపెట్టాడు. ఈ విషయం తెలియగానే సూరయ్య కుమిలికుమిలి ఏడ్చాడు. 'అయ్యో ! వీడు పూర్తిగా పాడైపోతున్నాడు. చేతులార వీణ్ణి నేనే పాడుచేశాను. గట్టిగా చితగ్గొట్టి బుద్ధి చెప్పవలసింది. మెత్తగా చెప్పడంవల్ల లాభం వుంటుం దనుకోవడం తప్పయింది' అని బాధపడ మొదలుపెట్టాడు.

ఒక రోజున స్కూలుమాష్టరుగార్కి తన కొడుకు సంగతంతా చెప్పి, "ఇక మీరేవాడిని ఓ దారికి తీసుకురావాలి...." అని ఎంతో బాధపడి చెప్పాడు. ఇలా చెపుతూన్నప్పుడు సూరయ్య ఎంత సిగ్గుపడ్డాడో చెప్పలేం.... తనకొడుకు పాడైపోతున్నాడని చెప్పడానికి ఏ తండ్రికి పాపం సిగ్గుకలుగదు!

కాని కథ ఇంతదూరం వచ్చినతరువాత ఎవరైనా ఏమిచేయగలరు? చేతులు కాలిన తరువాత ఆకులు పట్టుకోవడంవల్ల ఏమి లాభం? అయినా కాలినపుళ్ళు మాన్పుకోడానికి ప్రయత్నించాలిగదా!

ఆ మాష్టరుగారు సూరయ్య చెప్పినదంతా విని "సరేనండి...నేను ప్రయత్నించి

చూస్తాను" అన్నారు.

ఓ రోజున ఆయన అప్పారావును దగ్గరగా పిలిచి, "ఇవ్వాళ మధ్యాహ్నం మా ఇంటి కొకసారి రారా..." అన్నారు.

అప్పారావు, 'మాష్టారు ఎందుకు పిలిచారు చెప్మా...' అనుకున్నాడు. ఏమి ప్రశ్నలు వేస్తారో అని హడలిపోయాడు. కొత్తపాఠం వచ్చిందో లేదో అని ఒకసారి ఆ పాఠాన్ని తనకు తనే అప్పజెప్పుకొని ఫరవాలేదు అనుకున్నాడు. ఎక్కాలు అడుగుతారేమో అని బిక్క మొగం పెట్టాడు. నోటిలెక్కలు అడిగితే చిక్కే అనుకున్నాడు. భయపడుతూ, భయపడుతూ మెల్లిగా పిల్లిలా సుందరం మాష్టారుగారింటికి వెళ్లి లోనికి వెంటనే వెళ్లకుండా అక్కడే అలా గుమ్మందగ్గర నిలబడిపోయాడు.

అప్పారావును గుమ్మంలో చూడగానే మాష్టారు ఎంతో ప్రేమతో, 'రారా...లోపలికిరా...అక్కడే నిలబడిపోయావేం...' అన్నారు.

ఈ మాటవినగానే అప్పారావు కాస్త స్థిమితపడ్డాడు. దడదడ కొట్టుకుంటున్న వాడిగుండెలు కాస్త శాంతిపడ్డాయి.

మాష్టరుగారు వాడ్ని పిలిచి, చాపమీద తనదగ్గరే వాడ్ని కూర్చుండ బెట్టుకున్నారు. 'ఏరా...పరీక్షలు దగ్గరికొస్తున్నాయి...బాగా చదువుతున్నావా...' అన్నారు.

అప్పారావు 'బాగానే చదువుతున్నానండీ' అన్నట్లు తల ఊపాడు. తల ఊపడమంటే ఊపాడేగాని ఆ తరువాత మాష్టరుగారు ఏమడుగుతాడో అని వాడిగుండెలు పీచుపీచు మనడం మొదలు పెట్టాయి.

కాని ఆ మాష్టారు ఆ తరువాత వాడ్ని ఆవిషయమై ఏమీ ప్రశ్నించనేలేదు. ఆయన ఏదో వార్తాపత్రిక తీసుకొని చదవుకోవడం మొదలు పెట్టాడు.

ఆ పేపరు వెనక చిత్రమైన ఓ పెద్దబొమ్మ ఉంది. దానిలో చంద్రమండలానికి ఓ రాకెట్ ఎగిరిపోతోంది. ఆ బొమ్మను చూడగానే అప్పారావుకు ఆ రాకెట్‌లో కూర్చొని చంద్రమండలానికి ఎగిరి వెళ్ళిపోతున్నట్లే అనిపించింది. ఆ బొమ్మను చూస్తూవుంటే వాడి ఊహలు క్షణం నిలకడగా నిలబటంలేదు.

ఆ బొమ్మక్రింద, కొద్ది సంవత్సరాలలో మానవులు చంద్రమండలానికి హాయిగా ప్రయాణం చేయగలరు అని ఉంది. శాస్త్రజ్ఞులు ఈ ప్రయాణం సుఖవంతం చేయడానికి కావలసిన ఏర్పాట్లన్నీ చేస్తున్నారు, అని ఉంది.

అప్పారావు మెల్లిగా మాష్టరుగారి వైపు చూశాడు. అప్పుడే మాష్టరుగారు వాడి వైపు చూశారు. ఇద్దరి చూపులు ఒక్కసారి కలుసుకున్నాయి. అప్పారావు ఎందుకో

సిగ్గుపడ్డాడు. ఏదో అడగాలనుకుంటూ అడిగేందుకు జంకుతున్నట్లు కనిపించాడు.

వెంటనే సుందరం మాష్టారు, 'ఏరా...ఏమిటి...' అన్నారు.

అప్పారావు మెల్లిగా, 'మనం చంద్రుడి దగ్గరకు వెళ్లగలమాండీ...' అన్నాడు. అంటూనే అమాయకంగా నవ్వాడు. మాష్టారు ఏమి చెప్తారో వినాలని చెవులు రిక్కించాడు. అప్పుడు వాడికళ్లు రెండు చుక్కల్లా తళ తళ మెరిశాయి.

వెంటనే మాష్టరుగారు, ఈ బొమ్మ చూశావేమిటిరా...దీన్ని రాకెట్ అంటారు. ఇది మనల్ని చంద్రమండలం లోనికి తీసుక పోతుంది. దీన్ని అమెరికాలో తయారుచేస్తున్నారు.

అప్పారావు తలలో ఏవేవో ఊహలు ఇంద్రధనుస్సులా మెరిశాయి. వెంటనే వాడు 'అయితే ఆ రాకెట్ ఎక్కాలంటే మనం అమెరికా వెళ్లాలాండి...' అన్నాడు.

మాష్టారు 'ఔనురా...అది ఎక్కాలంటే మనం అమెరికా వెళ్లవలసిందే...'

క్షణం ఆలస్యం చేయకుండా అప్పారావు 'అమెరికా ఎక్కడుందండి మాష్టారు...' అన్నాడు. వాడికి వెంటనే అమెరికా వెళ్ళిపోవాలనిపించింది. ఆ సమయంలో ఆ రాకెట్‌లో కూర్చొని, చంద్రమండలానికి ఎగిరి పోతున్నట్లే వాడి కనిపించింది.

లండన్ మీదుగా వెళ్తే అమెరిగా మనకు సుమారు పదివేల మైళ్ళదూరాన ఉంటుందిరా...విమానంలో ప్రయాణం చేస్తే మూడునాలుగురోజుల కన్నడకు చేరుకోగలం. ఓడలో అయితే సుమారు పాతిక రోజులుపడుతుంది.

వెంటనే అప్పారావు, 'మరి మనం విమానం ఎక్కాలంటే ఎక్కడ ఎక్కాలండి? మన ఊళ్ళోకి వస్తుందాండి విమానం?' అన్నాడు.

ఈ మాటలకు మాష్టరుగారు నవ్వుకున్నారు. తియ్యగా, 'మన ఊరిలో విమానం ఆగదురా...అది విమానాశ్రయాలుండే చోటనే ఆగుతుంది. పెద్ద పెద్ద పట్టణాలు, మహానగరాలు ఉండేచోట విమానాశ్రయాలుంటాయి. మనం విమానం ఎక్కాలంటే బొంబాయి కాని, మద్రాసు కాని వెళ్ళి ఎక్కాలి. దీనంతటికీ బోలెడు డబ్బవుతుంది. అసలు మనం బొంబాయి వెళ్ళాలంటేనే ఎంతో అవుతుంది' అని ఆయన ఆగిపోయారు.

అప్పారావు, 'ఎంతవుతుందండి...?' అన్నాడు. వాడికి తొందరెక్కువయింది.

'చాలా ఔతుందిరా...ఎంతో జాగ్రత్తగా మనం డబ్బు కూడబెడితేనేగాని ఇలాంటి వింతలు మనం చూడలేం...'

ఎంతవుతుందో తెలుసుకోవాలనే కుతూహలం అప్పారావు మనసులో తాటిచెట్టంత

ఎత్తున పెరిగింది. మాష్టరుగారివైపు తమాషాగాచూసి, 'అస లెంతవుతుందండి..' అన్నాడు.

మాష్టారు వాడివైపు సూటిగా చూసి, 'ఏం నీకు వెళ్ళాలని ఉందేమిటిరా...బాగా డబ్బు కూడబెట్టు. పెద్దయిన తరువాత వెళ్దువు గాని...' అని, 'గొర్తిపాడు వెళ్ళాలంటే పడవకు పావలా పుచ్చుకుంటారు తెలుసా...' అని ఆగిపోయారు.

'అవునండీ...అక్కడనుంచి జట్కా ఎక్కి ఊళ్ళోకి వెళ్ళేందుకు అరణాలు పుచ్చుకుంటారు. అక్కడనుంచి బస్సెక్కి పట్నం వెళ్ళేందుకు రూపాయిపావలా పుచ్చుకుంటారండి.'

'ఔనురా...మరి ఆ రోజున పట్నంలో భోజనాలకు, రిక్షాలకు, రైలుస్టేషనులో కూలీలకు కొంత డబ్బవుతుంది. కాలుతీసి కాలు పెట్టాలంటే డబ్బు మంచి నీళ్ళలా ధారపొయ్యాలి. అక్కడనుంచి సుమారు రెండు మూడు రోజులు ప్రయాణంచేస్తేగాని బొంబాయి చేరం. బొంబాయికి టిక్కెట్టే రూ. 25/- లేక 30/- రూపాయిల మధ్య ఉంటుంది.

'అయితే మాష్టారూ...మొత్తం ఓ వంద రూపాయి లుంటే సరిపోతాయాండీ...' అప్పారావు వందరూపాయిలైతే ఎలాగైనా సంపాదించెయ్యగల నన్న దీమాతో మాట్లాడేశాడు.

మాష్టరుగారు పక పక నవ్వారు. 'ఓరి పిచ్చి పుల్లయ్యా...విమానం ఊరికే ఎక్కిపోవాలను కున్నావటరా... బొంబాయిలో విమానం ఎక్కి అమెరికా వెళ్ళేందుకు ఐదారు వేల రూపాయిలకు తక్కువ అవదు. మీ ఇంటినీ, మీ పొలాలనూ అమ్మితే అందులో సగం రాదు. ఇక కొన్ని లక్షల మైళ్ళదూరాన ఉన్న చంద్రమండలానికి రాకెట్‌లో ఎగిరి వెళ్ళాలంటే కొన్ని లక్షల రూపాయిలవుతాయి తెలుసా...అంతడబ్బు నువ్వెక్కడి నుంచి తేగలవు?'

అప్పారావు తల ఈ మాటలతో గిర్రున తిరిగింది. 'అయ్యబాబో...అంత డబ్బేనండీ' అన్నాడు. ఎంతో నిరుత్సాహపడిపోయాడు.

'అవునురా...ఎంతో డబ్బుంటే గాని ఇలాంటి వింతలు చూడలేం. అయినా ఇంకోమార్గం లేకపోలేదు. దానికంత డబ్బు అక్కర్లేదు కాని, కనీసం కొన్ని వేల రూపాయిలైనా ఉండాలి.'

నిరాశపడిపోయిన అప్పారావులో మళ్ళీ ఆశలు చిగురించాయి. 'అదేమిటండి మాష్టారు...' అన్నాడు.

నువ్వు పెద్ద పెద్ద చదువులు చదివితే శాస్త్ర విజ్ఞానంలో డిగ్రీలు సంపాదిస్తే అప్పుడు మన భారతప్రభుత్వమే చంద్రమండలంలోని వింతలు పరిశీలించి ప్రజలకు చెప్పేందుకు నిన్ను తమ స్వంత ఖర్చుమీద పంపిస్తుంది. అప్పుడు నువ్వు అలాంటి రాకెట్లు మన భారతదేశంలోనే తయారయేట్లు కృషి చేస్తే ప్రజలు మరింత సంతోషిస్తారు. ఇక ఈ ప్రయాణం కోసం అప్పుడు ఎవ్వరూ అమెరికా వెళ్లనే అక్కర్లేదు. కాని ఇదంతా జరగాలంటే పెద్ద పెద్ద చదువులు నువ్వు చదవాలి కదా! అందుకు కొన్ని వేలైనా అవుతుంది. చూశావా డబ్బువిలువ! అది లేనిదే ఏ పనీ జరగదు. మీ నాన్నను బాగా డబ్బు కూడబెట్టమను. మీ నాన్న అనవసర ఖర్చులకు డబ్బు పాడుచేస్తూ వుంటే, 'నేను పై చదువులు చదవాలి...డబ్బు అనవసరంగా ఖర్చు పెట్టకు నాన్నా...' అను. ఆయన నీకోసం, నీ బాగుకోసం తప్పకుండా తన దూబరా ఖర్చులు తగ్గించుకుంటాడు. అయినా, మీ నాన్నగారు అనవసరంగా ఖర్చు పెట్టే మనిషి కాదనుకుంటాను అన్నారు.

ఈ మాటలు వింటూంటే అప్పారావు ఏదో తప్పుచేసినవాడిలా బాధపడిపోయాడు. 'ఇకెప్పుడూ దూబారా ఖర్చు చేయుగూడదు. ఒక్క దమ్మిడీ అనవసరంగా పాడుచే యుగూడదు. పై చదువులు చదవాలి. డిగ్రీలు సంపాదించాలి. చంద్రమండలానికి ప్రయాణం చెయ్యాలి' అనుకున్నాడు.

అంతే.....

అప్పటినుంచీ అప్పారావు ఎప్పుడూ పుస్తకాలు కాని బట్టలుగాని చినిగిపోనివ్వలేదు. పెన్సిళ్ళు పారవేయలేదు. హోటలు తిండి తినలేదు. సిగరెట్లు ముట్టుకోలేదు.

# గర్వభంగం

## సిరాజ్ అన్వర్

ముత్యం ఎంతో విలువైనదని, దాని విలువ వెల కట్టలేనిదనీ మీకందరకూ తెలిసినదే! ముత్యాలు సముద్ర గర్భంలో దాగివుండే ముత్యపు చిప్పల్లో ఏర్పడతాయి. ఈ చిప్పలపై గట్టి పెంకులు వుంటాయి. ఈ కథ అలాంటి వొక ముత్యపు చిప్పదే.

ఈ ముత్యపు చిప్ప తనకు తానే ఎంతో సంతోషించింది; ఎందుకంటే తాను యీ ప్రపంచంలో ఎంతో గొప్ప జీవినని దాని నమ్మకం. పట్టుపురుగు కూడ చాల ఉపయోగకరమైనదే అనుకోండి, కాని పట్టుకు ముత్యాలకుండే ధర పలకదు. అందువలన ముత్యపు చిప్ప తనకు తాను గొప్పది అనుకోవటానికి ఇదొక కారణం.

ఒకరోజు సముద్రంలో తుఫాను వచ్చింది. అలలు చాల ఎత్తులో లేచాయి. సముద్రస్థితికి మన ముత్యపు చిప్ప భయపడి తన పైనవుండే పెంకులో తనను తాను బిగించుకొని సముద్రం అడుగున వుండిపోయింది. తానున్న స్థితికి ప్రాణరక్షణకై ఒడ్డుకు పోవటం చిన్నతనంగా తలచింది. కాని అలలు ఎంత బలంగా వున్నాయంటే అది అలా నిశ్చయించుకొన్నప్పటికీ, ఆ తాకిడికి అదీ దానిపై పెంకుతో సహా ఒడ్డుకు నెట్టివేయబడింది. ఆ విధంగా అది సముద్రతీరంలో చేరి జాగ్రత్తగా తన మూతను పైకెత్తి, ఆ రంధ్రంగుండా లోకాన్ని తొంగిచూసింది. అది అలా చూస్తుండగానే ఇంకొక పెద్ద కెరటం వచ్చి దాన్ని పైకెత్తి యింకా ముందుకు ఇసుకలోకి తోసివేసింది. అప్పుడు దాని స్థితి భయంకరమైనది! సముద్ర కెరటాలు దాన్ని కడిగి, గుండ్రగా తిప్పివేశాయి, కాని ఆ కెరటాలకు దాన్ని తిరిగి సముద్రంలోకి తీసుకు వెళ్ళగలిగే శక్తిలేకపోయింది. కాబట్టి పాపం అది అక్కడే వుండిపోయింది. సముద్రంలోకి తిరిగి వెళ్ళేదారి కనిపించక, దానికి విపరీతమైన కోపం వచ్చింది.

సముద్ర తీరానికి దగ్గరలో ఒక చిన్న చెట్టువున్నది. దానిమీద చాలసేపటి నుంచి ఒక కాకి కూర్చొని ముత్యపు చిప్పను గమనించింది. చివరికి అది ఎగిరిపోయి దాని

పెంకును ముక్కుతో పొడుస్తూ "లోపల ఎవరున్నారు" అని? తలుపు తెరవండి గట్టిగా అడిగింది.

ముత్యపు చిప్పకు కోపం వచ్చి "ఎవరో నీచుడు వచ్చి నన్ను అల్లరి పెట్టాలని చూస్తున్నాడు" అని తనలో అనుకొని పైకి పెద్దగా "ఎవరు వారు" అని అరచింది. "నేను నీచుడ్ని కాదు. నేనొక కాకిని. అంతేకాదు తెలివైన కాకిని. తలుపు తెరుచుకొని బయటకురా!"

"నేనెందుకు బైటికి రావాలి?"

"ఊరికే కొద్దిసేపు మాట్లాడుకుందాము. అంతకు మించి మరేంలేదు" అన్నది కాకి చాల మర్యాదగా.

"నాకు కబుర్లకు సమయం లేదు. నేను బయటికి రావటం లేదు."

"మంచిది. సరేగాని లోపల వుండి నీవు ఏం చేస్తున్నావు?"

"ముత్యాన్ని తయారు చేస్తూ చాల పనిలో వున్నాను. అయినాగాని నీలాంటి మురికైన వికారమైన దానితో మాట్లాడాలని నాకేమిటి?" అని గొప్పలు పోయింది ముత్యపుచిప్ప.

"ఓ ఎంత గొప్ప!" అని కాకి నవ్వింది. ఓ మిత్రమా! నాకు కావలసిందల్లా--స ముద్రం యొక్క వైశాల్యాన్ని, లోతును గురించి కొన్ని ప్రశ్నలు అడగాలి. అలాగే నీకు యీ విశాలమైన బయట ప్రపంచం గురించి కొన్ని విషయాలు చెప్పాలి."

"ఎందుకు?"

"ఎందుకంటే నాకు విజ్ఞానశాస్త్రమంటే చాల ఆసక్తి. నేను నివసించేది ఒక విశ్వవిద్యాలయపు కప్పపైన. వినేది విజ్ఞానశాస్త్రవేత్త ఉపన్యాసాలు. అందుకే నాకు విజ్ఞానశాస్త్రం అంటే ఇష్టం ఏర్పడింది. సముద్రాన్ని గురించి, అక్కడ ఏమి జరిగేదీ తెలుసుకోవాలనిపించింది. అక్కడ నీకు ఎప్పుడైనా పావురాళ్ళూ, పిచ్చుకల గుడ్లు కనిపించాయా?"

"ఏమిటా చెత్త ప్రశ్నలు?" అన్నది ముత్యపు చిప్ప కటువుగా. "అక్కడేవో సముద్రంలో పిచ్చుకలూ, పావురాళ్ళూ వున్నట్లు చెపుతావేం?"

"అంత తెలివి తక్కువ ప్రశ్న వేయకు. సముద్రంలో మిలియన్ల కొద్దీ గుల్లలు వుంటాయి -- నాలాంటివి. కొన్ని వేల రకాల, రంగు రంగుల చేపలు, రకరకాల చెట్లూ వుంటాయి. అంతేకాని నీలాంటి తెలివి తక్కువ, మూఢులైన జంతువులు మాత్రం లేవు" అన్నది ముత్యపుచిప్ప.

కాకి నవ్వింది. "నీ కన్నా తెలివి తక్కువదాన్ని అంటున్నావని నాకేమీ లెక్కలేదు. నిజానికి నేను తెలివితక్కువదాన్ని కాదు. ఒక కాకిని. అందులోను తెలివిగల కాకిని. కానీ ఓ మిత్రమా! నీవు ఇవన్నీ నీ చిన్ని గూడులో వుండి చెబుతున్నావు. కానీ బయటకు రావేమిటి?"

"నీ కేమీ మర్యాద లేదా? నేను నీ కెంతో పరిచయమున్నట్లు మాట్లాడుతున్నావు? నీకేం మిత్రుణ్ణికాను."

"మంచిదే, కాని నీవు సముద్రానికి రాజుననుకుంటున్నావు!"

"అంతే ననుకో! సముద్రంలో ముత్యాలు తయారుచేసే వారిలో నేనూ వొకడిని. ముత్యాల వల్లే సముద్రానికి కీర్తి వస్తుంది. అంటే నా వల్లనే సముద్రానికి కీర్తి!" అన్నది ముత్యపు చిప్ప.

కాకి తనలో తాను నవ్వుకొని "అలాగైతే నిన్నొకసారి చూడాలి. నేనెప్పుడూ ఇలాంటి విచిత్రమైన వస్తువును చూడలేదు" అన్నది.

"నేను వస్తువును కాను. నేను ముత్యాలు తయారుచేసే ముత్యపు చిప్పను!"

"సరే సరే! దయచేసి, ఓ రాజుగారూ! ఒకసారి తమరు బయటికి వచ్చి తమరి దర్శన భాగ్యం కలిగించండి" అన్నది కాకి హాస్యంగా.

"వీలుగాదు--వీలుగాదు! వీలుకాదు--వీలుకాదు. నేనిప్పుడు తలుపు తియ్యలేను. పనిమీద వున్నాను."

"నీవు ముత్యాలు తరువాత చేసుకుందువుగాని. ఒక్కసారి తలుపుతియ్యి, నేను చాల సామాన్యమైన బీదదాన్ని. నీ అంత ముఖ్యమైన వారిని, ముత్యాలు తయారు చేసే వారిని చూడాలనివుంది. నీ ముత్యాలు కూడా చూడాలనివుంది. చూడూ! నేను ఇంతవరకూ నా జన్మలో ముత్యాన్ని చూడలేదు."

"ఇప్పుడే కదా చెప్పాను తలుపు తియ్యనని! అంత తెలివిగల వాడి ననుకుంటే నీవే వచ్చి నా తలుపు తెరవరాదా?"

ముత్యపు చిప్ప యీ విధంగా వేధించింది. ఎందుకుంటే కాకి ఎట్టి పరిస్థితుల్లోనూ తనపై మూత తీయలేదని దాని గట్టి నమ్మకం.

కాకికి చాల కోపం వచ్చింది.

"సరే! నీకు కావలసింది అదే అయితే నేను చేసి చూపిస్తాను. కాని తర్వాత నెపం నా మీద వేయకు" అన్నది కాకి.

కాకి తన ముక్కుతో ఆ చిప్పను పట్టుకొని పైపైకి ఎగిరిపోయింది. ఒక పెద్ద

పర్వతం చివరకు చేరుకొని అంత ఎత్తునుంచి ముత్యపు చిప్పను నేరుగా ఒక రాతి మీదకు పడేసింది. అప్పుడా ముత్యపు చిప్ప కంటికి కనిపించనన్ని ముక్కలైంది. కాకి ఆ ముక్కలమీద వాలింది. అప్పుడా ప్రాణిని తన ముక్కుతో పట్టుకొని వొక్క గుటకలో మింగివేసింది.

అమూల్యమైన ఆ ముత్యం దొర్లుకుంటూ పోయి ఆవు పేడలో పడిపోవటాన్ని కాకి చూచింది. తర్వాత కాకి పైకి లేచి, గాలిలోకి ఎగిరి, ఆనందంగా కావు కావుమని అరుచుకొంటూ వెళ్ళిపోయింది.

